# సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100028571



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పద్మావతీ శ్రీనివాసీయము

## పద్యప్రబంధము

అఖిల దైవతలోక విభూషణం
విమల వేద శిరోగ్ర విహారిణం
వృషభశైల శిఖాస్థిరవాసినం
వినుత వేంకటనాథ మహంభజే




'సాహితీ వాచస్పతి' 'ఉపన్యాస చతురానన'

మొవ్వ వృషాద్రిపతి

ఆంధ్రోపన్యాసకులు

శ్రీ ఏ. బి. ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, రేపల్లె

# మదిలోని మాట

రెండుమూడేండ్లకు ముందుమాట. నేను మా తమ్ముడు చి॥ కృష్ణ ప్రసాదు కలిసి, దివితాలూకా, కృష్ణాజిల్లా అవనిగడ్డకు సమీపమునందలి 'వేకనూరు' గ్రామమున రామాయణ ప్రవచన మొనర్చుచుంటిమి. చి॥ కృష్ణ ప్రసాదు ప్రతిదినము నవనిగడ్డకుపోయి ప్రవచనమువేళకు వచ్చుచుండువాడు. నేను మాత్రము వేకనూరులో కీ॥ శే॥ మాదివాడ కోటేశ్వరరావుగారింటనుండి ప్రవచనము కొనసాగించుచుంటిని. కీ॥ శే॥ కోటేశ్వరరావుగారి ధర్మపత్ని - పరమ సాధ్వీతిలకము - భాగీరథీసమాన మాదివాడ కోటేశ్వరమ్మగారు, కన్న బిడ్డగా ఆదరించి, ఏ లోపము రానీక అరయుచున్నది. వారింట ఆబాల గోపాలమునకు నేనన్న ఎంతయో ఆత్మీయత. ఆమెను తల్లిగా, చిరంజీవినీ చిరంజీవుల నాత్మీయులుగా నరయుచుంటిని.

దినమంతయు పనిలేదు. సాయంతనము 3 గం. నుండి 5-30 గం. వఱకు ప్రవచనము. మిగిలిన సమయమున నేదో ఒక గ్రంథమును పఠించుట. అంతకు ముందొకసారి, మా చిన్నమ్మాయి చి॥సౌ॥ కుముదవల్లికి కొలదిగా జ్వరమురాగా, ఆమె వివాహమును శ్రీ పద్మావతీ వేంకటేశ్వరుల సన్నిధి యందు గావింతుమని, నేనును నా శ్రీమతి చి॥సౌ॥ పద్మాలయాదేవియు నను కొంటిమి. అప్పుడు, మా పెద్దమ్మాయి చి॥సౌ॥ అవనిజ "అంతకన్న స్వామివారి మీద ఒక కావ్యము వ్రాయకూడదా?" అన్నది. అది జరిగి చాలాకాలమైనది.

దైవ చిత్రము. ఆ సన్నివేశము ఆ కాలమున నా హృదయమున మెదలినది. ఈ తీరికవేళ కావ్యరచన ప్రారంభింప వలయునని సంకల్పిం చితిని. ఒకటి రెండు గ్రంథములనుండి రేఖామాత్రమైన గాథను స్వీకరించితిని. ఒక చక్కని ప్రబంధమును కావింపవలయునని భావించితిని. అసలు పద్య కావ్యములనే పాఠకులు చదువరు. పైగా ఈసడింతురు. ప్రబంధ ధోరణితో రచించినచో ఎవ్వడంగీకరించును? నేను ఉపనిషత్తులను అనువదించునపుడే నా కిట్టి అనుమానము కలిగినది. దానికి నేనే

"సరగుననేల ఈ యుపనిషత్తులు తెన్గున పద్యమట్లు సం
బరపడి వ్రాసినావు? చదువంగల వాడొకరుండు కల్గునే?
సరసపురాణ కావ్య చయ సర్వము మచ్చులకెక్కిదాగగా
ఇరువది యీ శతాబ్దమున నెవ్వడు మెచ్చు త్వదీయ యత్నమున్?"

అని ప్రశ్నించుకొని,

"రసికుడొక్కడు మెచ్చిన నాకు చాలదే?" అని సమాధానము చెప్పుకొంటిని. అదే ప్రస్తుత సమాధానముకూడ.

'కావ్యమా భక్తిరస సంబంధి. రూపమా పద్యము. శైలి ప్రబంధోచితము. ఇతివృత్తమా పురాతనము. ఎవ్వరాదరింతురు? ఎవ్వరాదరించినను, ఆదరింపకున్నను నా భక్తిభావభరిత హృదయమును శ్రీనివాసునకు సమర్పించుకొనుటయే నా నిశ్చయము. ఎవరి మెప్పుకొరకో, ప్రయత్నముకాదు. "ఈ విధముగా మనస్సున నూహించి, కావ్యరచనా ప్రారంభము కావింప చూచుచుంటిని.

శ్రీవారి బ్రహ్మోత్సవములలో, తిరుమల కొండమీద సప్తశైలవాసుని పదసన్నిధి ఉపన్యాసము కావించుటకు, తిరుపతి - తిరుమల యాజమాన్యము నుండి ఆహ్వానమందినది. సరే అప్పటనే శ్రీవారి పదసన్నిధిని కావ్య రచన ప్రారంభింప తలంచితిని.

కొండమీది ఉపన్యాసము పూర్తికాగనే, నాగదిలో కూర్చుండి రచనకు ప్రారంభమొనర్చితిని.

> "మణిహేమ గోపుర మంటప ప్రాకార
> భాసురం బెవ్వానివాస భూమి?
> ఎగసి మిన్నుల రాయు నేఁడుకొండల మీఁదఁ
> బృథు మేఘముల నొప్పు నెవనిమేడ?"

పద్యముతో ప్రారంభించి, అప్పటనే ఏబది పద్యములుదాక పూర్తిచేసితిని, తొలుత మూడువందల పద్యములలో పద్మావతీ శ్రీనివాసుల కల్యాణమును పూర్తిచేయవలయునని భావించితిని. కాని ప్రారంభించి వ్రాయుచుండ క్రమముగా పెరిగి ఇప్పటి రూపమును సంతరించుకొన్నది. మూడుమాసములలో రచన పూర్తియైనది.

వ్రాయుచున్న కాలమున నాకు మిత్రులు, వ్యాకరణ శాస్త్రమును గండూషించిన (ప్రస్తుతము వారు శివైక్యమును చెందినారు) సరస కవిచంద్రులు శ్రీమాన్ గిద్దలూరు చెంచుబసవరాజుగారికి విన్పించితిని. వారిచ్చిన సూచనలు

స్వీకరించితిని. తదుపరి విద్వత్కవిశేఖర బిరుదాంకితులు. పండిత శ్రీమాన్ యార్లగడ్డ వేంకటసుబ్బారావుగారికి విన్పించితిని. వారిచ్చిన ఎన్నో సలహాలను గ్రహించి, కొన్ని సన్నివేశములను మార్చితిని.

రచన చేసితిని. సాఫుప్రతిని సిద్ధమొనర్చితిని. కాని ముద్రణమెట్లు అని విచారించుచు, ఆర్థిక సహాయమునకై "తిరుపతి - తిరుమల" దేవస్థానమున Public - Relation ఆఫీసరుగానున్న శ్రీమాన్ రావుల సూర్యనారాయణ మూర్తిగారికి పంపించితిని. (వారిపుడా పదవీ విరమణ కావించియున్నారు) చాలకాలము తరువాత తిరుపతి - తిరుమల దేవస్థానమువారి ఆర్థికసహాయ మందినది. కావ్యము నితరుల కంకితము చేయరాదని భావించి, శ్రీ వేంక టేశ్వరునికే అంకితమొనర్చితిని.

ఈ కావ్య విషయమును నెఱింగి, దీని ముద్రణకై కొందరువదాన్యులు తగుమాత్రముగా విరాళములొసంగిరి. "కృతజ్ఞతలు" అను శీర్షిక క్రింద వారికి పద్యరూపమున అభివందనములు సమర్పించితిని.

ఈ నా పద్మావతీ శ్రీనివాసీయ ప్రబంధమునకు, చక్కని అభిప్రాయము లందించి అలరించిన మాన్యమహోదయులు, మహాకవులు, 'సాహితీబ్రహ్మ' శ్రీమాన్ వి.వి.యల్. నరసింహారావుగారికి, 'సాహితీరూపక సమ్రాట్' 'ఆశు కవితాకేసరి' మద్గురుదేవులు శ్రీమాన్ ప్రసాదరాయ కులపతిగారికి, 'విద్వత్కవి శేఖర' పండిత శ్రీమాన్ యార్లగడ్డ వేంకట సుబ్బారావుగారికి, మా పినతండ్రి గారు 'కవి భట్టారక' శ్రీమాన్ మొవ్వ దాశరధి సూరిగారికి నా హృదయ పూర్వకానేక సహస్ర కృతజ్ఞతాభి వందనములు.

ఈ గ్రంథమునకు, ఆర్థిక సహాయమందించి గ్రంథ మీరూపము సంత రించుకొనుటకు కారణమైన తిరుపతి-తిరుమల దేవస్థానము, యాజమాన్యము నకు నా కృతజ్ఞతాపూర్వక నమశ్కృతములు.

గురువుగా గౌరవించుటకు, పద్యహారమందించిన విదుషీమణి శిష్యురాలు చి॥సౌ॥ నరహరి సత్యభామకు, శిష్యుడు చి॥ ఆకుల అంజనేయ వరప్రసాదుకు శుభాశీశ్శతములు.

ఈ కావ్యమునకు చక్కని అట్ట ముద్రించుటలో సహాయభూతుడైన నా తమ్ముడు చి॥ మొవ్వ జనార్ధనస్వామి (వృక్ష శాస్త్రోపన్యాసకులు - సప్తగిరి కళాశాల - విజయవాడ)కి, ప్రూఫులు దిద్దుటలో, కడుంగడు శ్రమించిన మా చి॥ పద్మావతీవరప్రసాదునకు నా శుభాశీస్సులు.

గ్రంథమును చక్కగా ముద్రించి యిచ్చిన తెనాలి-వాసవి ప్రింటర్స్ అధినేత శ్రీమాన్ సాంబశివరావుగారికి, అందు పనిచేయు సిబ్బందికి నా నమోవాకములు.

ఈ కావ్య రచనా యజ్ఞమున ప్రత్యక్షముగా లేక పరోక్షముగా సాయపడిన ఎందరో మహానుభావులు - వారందరికి వందనములు.

ఇట్లు
బుధజన విధేయుడు
మొవ్వ వృషాద్రిపతి

# కృతజ్ఞతలు

భైరవరపు వంశపాథోధి చంద్రుండు
వేంకటేశ్వరుండు విపులయశుఁడు
విశ్వవిహిత సహిత విద్యాసముద్రుండు
శిష్యవత్సలుండు - స్థిరగుణుండు

పనికిరాని వట్టి బండరాలను దెచ్చి
శిల్పములుగ మలచి జీవమిచ్చి
ఆలయముల పూజ లందఁజేసిన మహా
దేశికుండు జ్ఞానరాశి యతఁడు

పొంకములైన మాటలును బోడిమి పీడని రూపమున్ నిరా
తంక మనోజ్ఞవర్తన - శ్రుతంబగు శక్రుతతుల్య ధీ విశి
ష్టాంకిత వైద్యనైపుణియు నందరి మన్ననకగ్గమౌ - ఉమా
శంకర నామధేయుఁడు భిషగ్వరుఁడెన్న వదాన్యుఁడన్నిటన్

అతఁడు సాహితీపృథు సుధార్ణవ పూర్ణ సుధాకరుండు - వై
ద్యాతత విద్యలందున అనన్య మహా ప్రతిభాయుతుండు - వి
ఖ్యాత పవిత్రశీలుఁడు - దిగంత యశస్సువిశాలుఁడున్ గళా
ధీ తరుణుండు గెల్వి సహదేవుఁడు రోగులపాలి దేవుఁడే

అంచిత దేశినేని కలశాబ్ధి హిమాంశుఁడు - శుభ్రవర్తనా
చంచల దీక్షితుండు - గుణసాంద్రుఁడు - కావ్యకళాప్రవీణ ధీ
సంచిత విజ్ఞతా విభవసారుఁడు - పొల్చెడు సత్త్వభావము
ద్దించుచు నప్పకొండయ వితీర్ణి గుణప్రముఖైక ముఖ్యుఁడై

ఆతఁడు ముమ్మనేని కలశార్ణవ పూర్ణ శశాంకుఁ డంచిత
ఖ్యాతుఁడు రామరావు - గుణగణ్యుఁడు దానరతుండు నిత్య సం
ప్రీతుఁడు - భక్తి సంభృతుఁడు వేద పదార్థ విచార సాధకుం
డాతత పుణ్యశాలి వినయ స్థితవిత్తుఁ డుదాత్తుఁడారయన్

ఆయత పోలిశెట్టి కలశాంబుధి పూర్ణ విధుండు - లక్ష్మినా
రాయణరావు దాన మహితాత్ముఁడు సర్వదిగంత కీర్తి సం
త్రాయణ సత్ప్రవర్తకుఁ - డుదార మనోమృదుభావనుండు - స
ద్ధ్యేయుఁడు దైవభక్తి సుగుణోద్ధ చరిత్ర పవిత్రుఁ డెంతయున్

రస విశిష్ట కావ్యరచనచే త్రైలింగ
పృథ్వి పులకరించి తృప్తిఁజెంద
వరలి దివికిఁజేరె బాపట్ల హనుమంత
రావు సత్కవీంద్ర రమ్యయశుఁడు

అవధాన తండ్రి యడుగుజాడలలోన
అరుగు తనయుఁడనఁగ సార్ధకముగ
భవ్య సుగుణమూర్తి పార్థసారథి షిర్డి
సాయి భక్తుఁడతఁడు సౌమ్యగుణుడు

ఆరతి వీర లార్థిక సహాయమొనర్చిరి కోరకుండ - ఈ
హారి సుగంధ కావ్య మణిహారము ధాత్రి సువర్ణ ముద్రితం
బైరహియింప, వారలఁ జిరాయురు పేతులఁ జేసి పద్మజా
తా రమణీ మనోహరుఁ డుదార మహావిభవంబు లిచ్చుతన్

# సిద్ధసుకవి శ్రీ మొవ్వ

'పద్మావతీ శ్రీనివాసీయ' ప్రబంధకర్త శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారు పండితకవి: మధురగాయకుడు; నటధురీణుడు; సుప్రసిద్ధాంధ్రోపన్యాసకుడు. బహుగ్రంధకర్త; మీదుమిక్కిలి జ్ఞానమార్గగామియగు ఉపనిషన్మధువును తెనుగున పద్య కవితాకూలంకషగా ప్రవహింపజేసిన పుణ్యశాలి; విశ్వగాయత్రిని వినిపించిన విశ్వమిత్రుడు. ఇంతటి మహనీయునిచేత పడినది 'పద్మావతీ శ్రీనివాసీయ' చంపూప్రబంధరచన. ఇకనిది దివ్యప్రబంధముగా రూపొందుటలో ఆశ్చర్యమేముండును?.

కథానాయికా నాయకులు పద్మావతీ శ్రీనివాసు లగుటచే ప్రబంధము దివ్యశృంగార శోభితమై విలసిల్లినది.

ఈ ప్రబంధమును చదువుచున్నంతసేపును సంస్కృతమున వేంకటాధ్వరి విరచిత "శ్రీనివాస చంపూ" విశ్వగుణాదర్శ చంపువులలోని వేంకటేశ్వర వర్ణన శ్లోకములు గొంతులో కదలాడినవి.

"గాంభీర్యైకావలంబే గరిమ నివసతౌ కాంతికుల్యాతటాకే
కల్యాణాంభోజకల్యే నిరవధి కరుణాసార కల్లోలరాశౌ
చాతుర్యౌదార్య లక్ష్మీ విహరణ శరణే సద్గుణౌఘాన్ బభూతే
దేవే శ్రీ వేంకటేశే న జిగణయిషతా కేనవా గ్లానవాచా" (వి.గు 286)

'వేంకటేశ్వరుని యందలి గాంభీర్య గౌరవ కాంతి కల్యాణ కారుణ్య చాతుర్యౌదార్యాది సకల సద్గుణములను గణించువా డెంతటి వాడైనను సరే వాక్శక్తి చాలనివాడే యగు' నట! ఇది వేంకటేశ్వరుని సకల కల్యాణగుణ పరిపూర్ణత్వ లక్షణమునకు వివశుడైన వేంకటాధ్వరి భక్తివినయములను సూచించుచున్నది. అపర వేంకటాధ్వరియో యన్నట్లు గోచరించు వృషాద్రిపతియు ఇంతటి భక్తి వినయములతోనె తనచంపువును భక్తి శృంగార రసపిచ్ఛిలము కావించుకొనెను.

కావ్య కథారస ప్రవాహమున కొట్టుకొనిపోవువారికి నిలిచి, కథకు మూలమైన పౌరాణికాంశములను పరామర్శించుకొను ఓర్పుండదు. ఆంధ్ర

దేశపు దేవాలయములలో తిరుమల వేంకటేశ్వర దేవాలయ చరిత్ర నెమరు వేసికొను నేర్పుండదు. శ్రీ ఎన్. రామేశన్ వంటి పురాతత్వ చారిత్రక సంశోధకుల ప్రామాణిక రచనలను సంప్రతించి, తిరుమల తిరుపతి దేవస్థానముల చరిత్రను ఈ ప్రబంధరాజముతో సంవదించి చూచుకొను స్తిమితముండదు. కాని పరమ జాగరూకుడగు వృషాద్రిపతి కవి ఇట్టి రచనల నెన్నింటినో అవలోకించిన గుర్తులు కావ్యమున పలుతావుల గోచరించుచున్నవి. అష్టాదశ పురాణములలో ఖండాత్మకమైన స్కాందము (సంహితాత్మకమును కలదు) లో మహేశ్వర ఖండము పిమ్మట రెండవదియగు వైష్ణవఖండమునందు 'వేంకటాచలమహాత్మ్య' మభివర్ణింపబడినది. ఇట్టివే ప్రస్తుత కథకు మూలమైన ఇతర పురాణాంశములును అనేకముగలవు. వీని యన్నింటి నేకరువు పెట్టు 'చాదస్తము' తో ఈ పీఠికను పీఠభూమిగామార్చి నిష్ఫలమొనర్చుట నాకు సమ్మతముకాదు. 'ఆనందము స్రవించు కావ్యమున వ్యుత్పత్త్యాది విశేషముల కొరకై అన్వేషించు మాధుర్యవిముఖులకు ఒక నమస్కార' మని రూపక విషయమున చెప్పిన ధనంజయుని మాట నాకును తగులకపోదు. అభయముతో 'ఇక రసప్రవాహము నీదుకొనుచుపోయి ఆనంద మనుభవింతునుగాక!' అనుకొంటిని.

మన ప్రబంధయుగమందలి ప్రౌఢ ప్రబంధముల లక్షణములను పుణికి పుచ్చుకున్న ప్రబంధము 'పద్మావతీ శ్రీనివాసీయము'. ఇష్ట దేవతా ప్రార్థనా షష్ఠ్యంతాదులతో నారంభమై ఫలశ్రుతివరకు ప్రబంధ లక్షణములే కొనసాగిన కావ్యమిది. ఆశ్వాసాంతగద్యాదుల విషయమున ఒకటి రెండు తేడాలుండవచ్చును.

కథకుడు సుపౌరాణికుడైన సూతుడు; రౌమహర్షణి. అతని తండ్రికి వలెనే అతడు చెప్పుచున్నప్పుడును ఆనందముతో శ్రోతలు ముత్పులకలను భవింతురట! ప్రస్తుత కథాశ్రవణమునందును సహృదయుల కానందపులకాంకురము లనివార్యములు. తాము కూర్చున్న తావు నైమిశమో అన్నట్లు తాము శౌనకాది మహర్షులకువలె సహృదయులు ఆనంద మనుభవింతురు.

ఇట్టి పరమ లక్ష్యముతోనే శ్రీ వృషాద్రిపతి కవి ఈ ప్రబంధమును సప్తసోపాన సంఘటితము కావించెను. సప్తగిరులు, సప్తసోపానములు భక్త

యోగి అంతర్ముఖుడై షట్చక్రము దాటినపిమ్మట సహస్రారమున పొందు అమృతానంద సూచకములే కదా! సప్తసంఖ్యారహస్య మెరిగిన ప్రౌఢ సప్తగిరివాసుని మరొకతీరున నెట్లభివర్ణింపగలడు? సహృదయ భక్తకోటిని మెట్లెక్కించి రసావతారుని దర్శింపజేయు మార్గమిదియేకదా!

976 గద్యపద్యములతో ఏడాశ్వాసములుగా సాగిన ఈ ప్రబంధ కథ భృగు గర్వభంగము, పద్మావతీ జన్మ వృత్తాంతము, వకుళాదేవి వృత్తాంతము, వేదవతీ వృత్తాంతము, నాయికానాయకుల దృక్సంగమము, వివాహ ప్రయత్నములు, వివాహము అనునంశములతో పరమ మనోజ్ఞముగా రూపొందినది.

వృషాద్రిపతిగారు పద్య శిల్పమెరిగిన సత్కవి. కవి శబ్దవ్యుత్పత్తిని సార్థకము చేయగల వర్ణనకుశలుడు. భక్తిలో పోతన్నగారిని గుర్తుచేయును, పద్యరచనలో నన్నయగారిని స్ఫురణకు తెచ్చును. పునరుక్తి భయములేకుండ నన్నయ సమాసములను ఒకే సోపానమున ఒకటి రెండు పర్యాయములు ప్రయోగించుటకు వెనుదీయడు.

శ్రీనివాసుని పెండ్లికి గరుడు డేయేతావులకు ఆహ్వాన పత్రములు కొంపోయెనో చెప్పుచు కవిగారు

"నరసుర యక్ష కింపురుష నాగ నభశ్చర సిద్ధ సాధ్య ఖే
చర గరుడాది లోకముల" (సప్తమ సోపానము - 29వ ప॥)

నని పేర్కొనిరి. ఆహ్వానమందుకొని వచ్చినవారి విశేషములు వివరించుచు కవిగారు

"నరసుర యక్ష కింపురుష నాగ నభశ్చర సిద్ధి సాధ్య ఖే
చర గరుడోరగ ప్రముఖ చారణ కిన్నెర ముఖ్య దేవతా
వర నుత జాతివారు" (సప్తమ సోపానము - 41వ ప॥)

అని అట్టి సమాసమునే మరింత పొడిగించి ఔచిత్యము సాధించిరి.

నన్నయ భారతము ఆదిపర్వములో కద్రువ తన బిడ్డలను తేర్చుటకై ఇంద్రు నారాధించిన సందర్భమునందలి పద్య గత సమాసము వృషాద్రిపతికి ఆత్మభూతమైపోయినది

"నరసుర సిద్ధ కింపురుష నాగ నభశ్చర ముఖ్యులెల్ల నీ
కరుణయవేచిమంద్రుడు" (అది 2 - 46) ఇది నన్నయ పద్యభాగము.

వృషాద్రిపతి శైలి నన్నయ శైలికి భిన్నముకానంత మనోజ్ఞముగా సాగినది. కవి చరితార్థత కిదియొక నిదర్శన మనుకొందును.

భాషా విషయమున వృషాద్రిపతిగారి పట్టు విడుపులు ప్రస్తుతి పాత్రములు. ఎఱుకలసాని వేషమున శ్రీనివాసుడు పద్మావతికి చెప్పిన సోదె పాత్రోచిత భాషకు గీటురాయి

"ఏడుకొండలమీద యెలసినవోడ
ఆదివరావుండ ఆదిదేవుండ"....
'సత్తెం జెబుతా ఇనుకోయే తల్లా!" (ప.సో 124)

ఈ పంక్తులలోని అర్థాంతరము విష్ణుతత్త్వ నివేదకముగా నున్నది. ఇట్టి సందర్భములు కావ్యమున పలుతావుల ధ్వని విశేష సమర్పకములై తత్త్వ సౌరభములు గుబాళించుచున్నవి.

"నా కెవ్వరు లేరు లోకుల నేనొదున్ - ఒక పేరను నిర్దేశము లేదు
ఏ పేరున పిల్చినన్ పలికెదన్ - శత్రువులులే రాద్యంత శూన్యాత్మడన్"
(తృ.సో ప॥ 88) ఇట్టి వెన్నెని కలవు

భాషాభావాదికమున కవిగారి స్వాతంత్ర్యము కొన్నితావుల విలక్షణముగా నున్నది. "ఉపవసించు (ప్ర-25), సిద్ధపఱచి (ప్ర-69), ఆ తదుపరి (ద్వి-3), ఋజువు (ద్వి-11). అల్లాడి (పం-13) మొదలైన ప్రయోగము లిందుకుదాహార్యములు.

కథాకథనమున ఉత్కంఠ నొక్కొక్క సోపానమధిరోహింప జేయుచు రసశిఖిరికి చేర్చుటయందు కవిగారు నూటికి నూరుపాళ్లు కృతార్థులైనారు. ఇంటిపేరు సార్థకమైనది. 'సిద్ధసుకవి శ్రీ మొవ్వ కలమున సిద్ధేంద్రయోగి నాట్యమాడెనా అనిపించినది.

సంస్కృత 'శ్రీనివాస చంపూ'కర్త వేంకటాధ్వరి (క్రీ॥ శే॥ 1637) వలె వృషాద్రిపతియు విశిష్టాద్వైతుడగుట ఈ కావ్యమునకు దివ్యగంధమలదినది. వీరబ్రహ్మేంద్రస్వామి కాలజ్ఞానమున హెచ్చరించినట్లు (పు-15) మతాతీత విరాట్పురుషుడైన వేంకటనాథ తత్త్వముకూడ కావ్యమున నిక్షిప్తమైయున్నది.

ఒక్కమాటలో చెప్పవలెనన్న వృషాద్రిపతియొక్క ఆత్మతత్త్వావిష్కార రూపమైన మహాకావ్యము 'పద్మావతీ శ్రీనివాసీయము'. వృషాద్రిపతి పద్మాలయాధిపుడుగదా!

'సాహిత్య బ్రహ్మ'
**డా॥ వి.వి.యల్. నరసింహారావు**
రిటైర్డు డైరెక్టర్
ఆం.ప్ర. ప్రాచ్యలిఖిత గ్రంథాలయ-పరిశోధనాలయము

హైదరాబాద్
18-11-94

“సాహితీరూపక సమ్రాట్”
‘ఆశుకవి కేసరి’
# ప్రసాదరాయ కులపతి

పద్మావతీ శ్రీనివాసీయము మహాప్రబంధముగా నిర్మించి శ్రీ వృషాద్రిపతి తన హృదయమున ఒక కృతార్థతను భావించినాడు. ఈ అధునాతన కాలమున ప్రాచీన సంప్రదాయానుగుణమైన కావ్యములను నిర్మించువారు బాలతక్కువ. సంప్రదాయములు మారుచున్నవేళ, అవి మారితీరవలెనని కొందరు పనిగట్టు కొని ప్రచారము చేయువేళ, ఆ విధముగా వచించుట రచించుట ఆధునికతా చిహ్నముగా భావించు నొక కృత్రిమత్వమునకు పట్టాభిషేకములు చేయువేళ నింకను ప్రాతపద్ధతిలోనే వ్రాయుదునని పట్టుబట్టి కాలమున కెదురీదు వారిలో వృషాద్రిపతి యొకడు. లోకములో కొందరు కాలప్రవాహమునకు క్రొత్త మార్గములేర్పరతురు. కొందరు దానికనుగుణముగ ప్రయాణము చేయుదురు. కొందరు దాని కెదురీదుదురు. అవసరమైనప్పుడు మలుపులు త్రిప్పుట, ఎదు రీదుట సమర్థుల లక్షణము. ఆ సమర్థత కలవాడొకడు ఇప్పుడుండియు వెయ్యేండ్లు క్రిందివానివలె నుండును. ఒకడు వెయ్యేండ్లు తరువాతి వానివలె నుండును. ఆయా జీవుల లక్షణమునుబట్టి సంస్కారమునుబట్టి పెరిగిన వాతావరణమునుబట్టి ఆయా వాసనలో - కాలానుగుణముగా సామయిక ప్రేర ణలచేత వికసించి ఫలోన్ముఖములగును. అట్టి కవితా తపః ఫలోన్ముఖుడైన జీవుడు వృషాద్రిపతి. వైష్ణవ భక్తుల కుటుంబములో ఉదయించుటచేత పట్టు వడిన ప్రపత్తి, శరణాగతి, శ్రీమన్నారాయణ కళ్యాణగుణ సంకీర్తనము అతని కవితాత్మ నుద్బుద్ధముచేసి సత్త్వాభిముఖమైన శాంతమార్గమున తత్త్వాన్వేష కునిగా చేసినవి.

ఆ ప్రశాంత సాధన ఫలమే యీ ప్రబంధము దీనినే నాలుగైదు వందల యేండ్ల క్రింద రచించినచో ఏ మహారాజు ఏ అగ్రహారము లిచ్చెడివాడో మణి

కనక వస్త్ర వాహనము లిచ్చెడివాడో! లేక అవేవీ అక్కరలేదని విరాగవైష్ణవునిగా ఇతడుండెడివాడో! లేక అనాడున్నాడేమో! ఏ పేరుతోనున్నాడో! అప్పుడేకావ్యములు రచించినాడో - ఇప్పుడు భువన విజయాది సాహితీ రూపకములలో పాత్రధారణ చేసి విజృంభించి నటులే అప్పుడుకూడ ఏ సాహితీ విజయములలో విలసిల్లినాడో! ఏమో! యోగులు, దార్శనికులు చెప్పవలె!

ఏదైననేమి - పద్మావతీ శ్రీనివాసీయము పరమ రమణీయమైన ప్రతిభాసంపన్నమైన ప్రబంధము. అలంకార శాస్త్రములలో ప్రబంధములకే లక్షణములు చెప్పబడినవో అవి చాలవరకు ఈ గ్రంథమున కన్వయింప వచ్చును. దీనిలో ఇన్ని యీ విధమైన అలంకారములుగలవు - రీతులుకలవు, వృత్తులివి, గుణములివి, ఇన్ని ఛందస్సులలో ఇన్ని పద్యములున్నవి, వానిలో తత్సమ పదములిన్ని, తద్భవములిన్ని, దేశ్యములిన్ని, అన్యదేశ్యములిన్ని, సమాస నిర్మాణమిటులున్నది, లోకోక్తులిన్ని వాడబడినవి. ఈ విధమైన పట్టికలు తయారుచేసి చూపుట ఇటీవల విమర్శలలో కొందరి పద్ధతి. ఒకడు పాడుచున్నాడు. కన్నులుమూసికొని ఆ గాన మాధుర్యము ననుభవించుట ఒక తీరు. కాక వాని ముఖమును చూచుచు వీడీ రాగము పాడుచున్నప్పుడు నోరింత సాగినది, తల యింత ఊగినది, నాలుక యిన్నిమెలికలు తిరిగినది, ముఖమున నిన్ని వికారములు కలిగినవి - దీనికిని ముఖయంత్రమునుండి పాట వెలువడుటకుగల సంబంధమెట్టిది ఈ విచారణము నొక విమర్శ పద్ధతియే. నేనా జోలికిపోను. ఇతని పద్యములలో కవిత్వ పదార్థము పుష్కలముగా నున్నదని మాత్రము చెప్పెదను.

కవికి తన రచనలో ప్రధానమైన రసనిష్ఠ - ఆనందానుభవ ప్రధాన శక్తితోపాటు తనజాతి, తనదేశము, తనధర్మము వీటి విశిష్టతను ప్రకటించు ఆసక్తి సహజముగానుండును. ప్రాచీనులైన మహాకవులందరు సందర్భోచితముగా తమ మాతృభూమి వర్ణనలను చొప్పించినవారే. ఈ కవియు నటులే విష్ణుమూర్తి లక్ష్మీదేవిని వెదకుచు భూమిమీదకు వచ్చిన సందర్భమున

స్వామికి ఆంధ్రదేశము నంతయు చూపించినాడు. విష్ణుదేవుడు భద్రాద్రి రాముని, నెల్లూరి రంగనాధుని, శ్రీకాళహస్తీశ్వరుని పరామర్శించి వారితో కొంతతడవు గడపినట్లు వర్ణించి తెలుగుభూమిని పాఠకులకు దర్శింపజేసినాడు అంతకుముందే భూమికి దిగిన లక్ష్మీదేవియు ఓరుగంటి ఏకవీరను, బెజవాడ కనకదుర్గను కలసి కొల్లాపురమున ఆశ్రమము నేర్పరచుకొన్నది.

కథలో మధ్య ఇటువంటి ఘట్టములను అమూలకములైనను కలిపి కవులు తమ వ్యక్తిగతమైన అభిప్రాయములను చూపించుచుందురు. ఈ కావ్యము చదివినప్పుడు వెంటనే ఈ కవిమీద నన్నయ శ్రీనాధుల ప్రభావము కొంత ఎక్కువగా ఉన్నటు లనిపించును. అది దోషముకాదు. గుణమే. పూర్వ పూర్వకవుల ప్రభావము ఉత్తరోత్తర కవులపై నుండుట సహజము.

ఏమైనను ఈ ఉత్తమ కావ్య రచనతో వృషాద్రిపతి ప్రబంధ కవుల సరసన జేరు అర్హత పొందినాడు భద్రమస్తు! ఈ ప్రబంధము తెలుగు హృదయముల నలరించునుగాక!

ప్రసాదరాయ కులపతి
ప్రిన్సిపాల్
హిందూకళాశాల - గుంటూరు

# సంహృద్వాక్యము

విత్తం పెత్తనం చలామణిలో వున్న కాలం యిది. అందువల్ల సాహితీ విత్తములకు ఆదరం అంతగాలేని కాలంకూడా. అయినా ఆనువంశిక ప్రభావం వల్లనూ సంస్కార ప్రభావంవల్లనూ కొంతమంది సాహితీవేత్తలు వెలుగులోకి వస్తూనే వున్నారు. వుంటారుకూడా.

సాహిత్యంలో అనేక నూతన ప్రక్రియలు వ్యాప్తిలోకి వచ్చి పద్య రచయితలు పలుచబడినా, ఎప్పటికప్పుడు క్రొత్తవారు వస్తూనేవున్నారు పద్యానికుండే ప్రాధాన్యం యెప్పుడూ వుంటుంది. దాని ప్రత్యేకత దానిదే.

అలా చక్కగా పద్యరచన చేయగలవారిలో మా కాప్తమిత్రులు "సాహితీ వాచస్పతి" "ఉపన్యాస చతురానన" శ్రీమాన్ మొవ్వ వృషాద్రిపతి గారు సుప్రసిద్ధులు. వీరి ఉపన్యాసాలు ఆంధ్రదేశంలోని అన్ని ప్రాంతముల లోను చాలామంది సాహితీప్రియులు వింటూనేవున్నారు. భువనవిజయాది సాహిత్యరూపకాల్లో శ్రావ్యములైన వీరి పద్యాలను, చమత్కార సహితసమస్యా పూరణాలనూ వింటూనేవున్నారు. అలాగే ఉపనిషద్వాణి, హరిహరాత్మజ విజయము మొదలైన తత్త్వప్రధాన, భక్తిప్రధాన కావ్యాలు చాలా వీరు రచించారు. వీరు కవితాశక్తి, ఉపన్యాసశక్తి, గానకళాసక్తి, భగవద్భక్తి వీటి సమాహార రూపం. ఇన్ని శక్తులు ఒకచోట కేంద్రీకరించటం చాలా అరుదు. ఈ శక్తులు కొంతవరకు ఆనువంశికంగానూ, కొంతవరకు స్వయంగాను వీరు సంపాదించుకొన్నవి. వీటిఅన్నిట్లోను భగవద్భక్తికే అగ్రపీఠం. తక్కినవి దానికి అంగాలు. ఉదయం భగవదనుష్ఠానం అయినతరువాతనే తక్కిన దినచర్య కుపక్రమిస్తారు. ఆ భక్తి నిష్కామం కావటం విశేషం. భక్తుడు కోరకపోయినా భగవంతుడు ఎప్పుడూ అతని యోగక్షేమాలను నిర్వహిస్తూనే వుంటాడనటానికి ప్రత్యక్ష నిదర్శనం వీరే.

వీరి కుమార్తె వివాహం శ్రీనివాసునిసన్నిధిలోనే జరపాలనే సంకల్పంతో బస్సులో బంధుమిత్రులతో బయలుదేరారు. వరునికి సంబంధించిన బంధు మిత్రులుకూడా దానిలోనే వున్నారు. చీరాల - ఒంగోలు మధ్య ప్రయాణం సాగుతూవుండగా ప్రమాదవశాత్తు బస్సు చాలా లోతైన గుంటలోకి రెండు

బోల్తాలు కొట్టింది. ఆ ప్రాంతంలో వున్నవారంతా పరుగెత్తుతూవచ్చి బస్సు అద్దాలు పగులగొట్టి నిచ్చెనల సాయంతో అందర్నీ బయటకు తీయటానికి తోడ్పడ్డారు యెంతమంది ప్రమాదానికి గురైనారో అని ఆందోళనపడ్డారు. ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే బస్సులో వున్న 60మందిలో యేఒక్కరికీ చిన్న గాయంకూడా లేకుండా బయటకివచ్చారు. స్త్రీలు ధరించిన "తల పూవులు" చెదరనైనాలేదు. చూచినవారంతా ఆశ్చర్యంలో మునిగిపోతే వృషాద్రిపతిగారు భగవద్ధ్యానంలో మునిగిపోయారు.

ఈస్థితిలో అక్కడకి ఒక వ్యాను వచ్చింది. దాని డ్రైవరు వీరు కోర కుండానే ఒంగోలు చేర్చాడు. డబ్బు యివ్వజూపితే అతడు తీసుకోలేదు. ఇదంతా యెలా జరిగిందనుకోవాలి?

అంతకుపూర్వమే వృషాద్రిపతిగారు "పద్మావతీ శ్రీనివాసీయము" అనే యీ ప్రబంధాన్ని చాలావరకు రచించారు. ఎప్పటికప్పుడు నాకు వినిపించారు కూడా. ఇప్పుడు దానికి సమగ్ర రూపం సమకూర్చి ఆ స్వామికే అంకితం చేస్తున్నారు.

తమకు సిద్ధించిన కవితాశక్తినికూడా వీరు భగవత్ప్రసాదంగానే భావించి ఆ స్వామికే సమర్పించుకోవటం అభినంద్యం. నేను సాహితీప్రియుడనే అయినా ఈ కావ్యంలోని కవితా వైశిష్ట్యంకంటే భక్తి వైశిష్ట్యంవైపే నా చూపు మొగ్గు తున్నది. అయినా కొంచెం కవితా కౌశలంవైపుకూడా దృష్టి సారించటం అవసరం.

పద్మావతీ శ్రీనివాస కళ్యాణగాథ సుప్రసిద్ధమే అయినా యీ ప్రబంధంలో నాటకోచిత రంగస్థల సన్నివేశాల్లాగా కథాభాగం నడిచింది. సన్నివేశాల కల్పనలోనూ, పాత్రోచిత సంభాషణ క్రమంలోనూ చక్కని నాటకీయత చోటుచేసుకొని కళాత్మకరూపం సంతరించుకొన్నది. స్వామి సన్నిధికి చేరుకోవ టానికి తోడ్పడినట్లే కళ్యాణ ఘట్టం ముగియటానికి సప్తసోపానాలు యేర్పాటు చేయబడినాయి.

కథా ప్రారంభం మొదలు చివరిదాకా ప్రబంధరీతిలో సాగుతుంది. సోపానాది సోపానాంత పద్యాలు అంత్యప్రాస నియమంతో ప్రౌఢ శైలిలో

నడిచాయి. అటు శబ్దాలంకారాలూ, అర్థాలంకారాలూ, వర్ణనలూ లోకోక్తులూ, జాతీయాలు సందర్భోచితంగా నిర్వహింపబడినవి. శైలి మృదు పద విన్యాసాలతో లలితమధురంగా సాగింది. ఈ విషయాలన్నీ సోదాహరణంగా వివరించాలంటే ఈ ప్రబంధానికి మించిన గ్రంథం అవుతుంది. అందువల్ల స్థాలీపులాకంగా సూచిస్తే సరిపోతుంది. ముంజేతి కంకణానికి అద్దమెందుకు.

## శబ్దార్థాలంకారాలు

తచ్చరిత్రముల్ మోహలతాల విత్రములు మోక్షరమా కరుణా
పవిత్రముల్ 1-12

వాదంబులునాదంబులు రోదోంతరమెల్ల నిండరోయకవారల్
వాదంబులు ప్రతివాదము లాదరువులుచూపి చేయు నా సమయమునన్ 1-49

ఇక వర్ణనకు ఉదాహరణ చూడండి. భృగుమహర్షి విష్ణుమూర్తి వక్షఃస్థలంమీద తన్నబోతూ తన మనస్సులోనే భావనచేస్తున్నాడు.

ఈ వృక్షమేకదా యెనలేని సంపదల్ పుట్టించు లచ్చికిఁ బుట్టినిల్లు
ఈ యురంబేకదా యీరేడులోకాల రక్షించు సత్కృపారామసీమ
ఈ ఱొమ్మునెకదా వారాశి సంజాత కౌస్తుభనవరత్నకాంతి తనరు
ఈ యురంబునకదా యేపారు శ్రీ వత్సమను పుట్టుమచ్చ దివ్యాంకముద్ర
కల్పలతికా ప్రసూన సంగ్రథితమైన వైజయంతి రాజిల్లు నీ వక్షమందె
ధూతధాత్రి పరిష్వంగ భోగ్యమైన తరళ వేదిక యీ భుజాంతరముకాదె?

కింకరుడు అనే కృదంత శబ్దానికిబదులు కింకుర్వాణ అనే శానజంత పదాన్ని శ్రీనాథకవి తరువాత ఈ కవి వాడారు. ఇలాంటి ప్రౌఢ పద ప్రయోగాలు చాలావున్నాయి.

ధారాశుద్ధికి 1-64, 1-77, 1-78, 1-82, 1-76 ఇంకా యెన్నో పద్యాలు చూడవచ్చు.

## లోకోక్తులు, జాతీయాలు

పిల్లిమెడకు గంట కట్టడం 1-59 కన్నుల్లో వత్తులుంచుకోవటం 1-60 స్తనశల్య పరీక్ష 1-61 నిప్పుతో చెలగాటం 1-64 ముక్కుమూసికొని తపస్సు

చేయటం 1-65 రోట శీర్షమిడి రోకటిపోటుకు జంకటం కానున్నది కాక మానదు 1-68 ఒడలెల్ల చెవులు మొలవటం 1-72 కొండతో ఢీ కొనటం 1-77 మోములనెగాదిగ చూడటం 1-87 మగడు ముండ అంటే ముష్టికి వచ్చినవాడు ముండ అనటం 2-19

మగఁడు కొట్టెనేని మగనాలు సైరించు
సవతి యెత్తిపొడుపు సైపఁగలదె
లేకి పాటుగన్న వైకుంఠ లోకంబు
కోడియైనిగిడ్చికూయకున్నె 2-20

కంచె పొలంమేయటం 2-78 చెడి చెల్లెలింటికి అలిగి అత్తవారింటికి పోరాదు 3-72 ఎచ్చటైనను బావనవచ్చు వంగతోటదగ్గర బావను మాటతగదు 3-75 డబ్బులేనివాడు డుబ్బుకు కొరగాడు 3-79 అయినవారి కాకుల్లోను కానివారికి కంచాల్లోను పెట్టటం 4-70 పుణ్యానికి పోతే పాపం యెదురురావటం 4-72 ఇలా వ్రాస్తూపోతే వందల సంఖ్యలో వున్నాయి. లోకజ్ఞుడైన కవికిమాత్రమే యిలాంటి ప్రయోగాలు సాధ్యాలు.

## అ లం కా రా లు

"వ్యాసమౌని భగీరథప్రాప్త గంగ సూత విజ్ఞాన జాహ్నవీ స్రోతమయ్యె" వస్తు వౌపాధిక ప్రభావమున గణ్యమగు జలము శంఖమున తీర్థమైన భంగి" 1-10 అభ్రగంగను పుడమికి దింపినవాడు భగీరథుడు. అందువల్ల అది భాగీరథి అయినది. జహ్నుమహర్షి ఆశ్రమం ప్రవేశించి అతడు ఆపోశనంచేసి విడువగా జాహ్నవి అయింది. ఇక్కడ భగీరథుడు, జహ్నువు అనే ఉపాధులనుబట్టి గంగపేరు మారింది. మామూలు జలం శంఖంలోపోస్తే తీర్థమౌతుంది. ఈ చిన్న పద్యంలో ఒక రూపకం ఒక అర్థాంతరన్యాసం ఒక ఉపమ మొత్తం మూడలంకారాలు చిత్రంగా ప్రవేశించాయి.

"ఆ మాటల్ చెవిసోక నిర్జరులు వర్షాంభోద గర్జానినా
దామోదంబున నాడు కేకిగణ మట్లానంద తుందాత్ములై
ఓ మౌనీశ్వర! నీవుదక్క నొకఁడ న్యుండర్హుఁడే అంజనా
రామా పుత్రుఁడు గాక యెవ్వఁడటు పారావారముం దాఁటఁగన్"

ఈ పద్యం పూర్వార్థంలో కవి ముఖతః ఒక ఉపమాలంకారం, పాత్ర ముఖతః దృష్టాంతాలంకారం ఉత్తరార్థంలోనూ వెలసి విషయ సౌందర్యాన్ని చేకూర్చాయి.

ఈ ప్రబంధానికి పీఠిక వ్రాయటం సముద్రానికి యేతామెత్తటం. శక్తికి మించినపని. మిత్రులకు నాపట్లగల సౌహార్దానికి చిహ్నంగా నాకీ అవకాశాన్ని కలిగించినందుకు నా కృతజ్ఞతను తెలుపుకుంటూ. ఇంకా వీరి కలం నుండి ఇతోధిక రసవత్తర కావ్యాలు వెలువడగలవని విశ్వసిస్తూ

> "జయన్తితే సుకృతినోరససిద్ధాః కవీశ్వరాః
> నాస్తియేషాం యశః కాయేజరామరణజం భయమ్॥

అని స్మరిస్తూ ముగిస్తున్నాను.

ఇట్లు
సాహితీ పిపాసువు
యార్లగడ్డ వెంకటసుబ్బారావు

నల్లూరు
20-11-94

శ్రీమతే రామానుజాయనమః

"తర్క వేదాంత పండిత" "కవిభట్టారక"

**వె౹౹వ్వ దాశరథిసరారి (విష్ణుదాసు)**

వేణుగోపాల సేవాశ్రమము

చం॥ గయయుఁ బ్రయాగయున్ మధుర, కాంచి, మఱెన్నియొ పుణ్యతీర్థ సం
చయములు వెల్గు నీయవనిఁ జాలఁగఁగాని భవత్పదాంబుజ
ద్వయమును గన్నఁ గల్గెడి ముదంబది యెచ్చటనైనఁ గల్గునే
జయజయ సప్తశైలనివసజ్జగదీశ్వర! వేంకటేశ్వరా!

కవికి నపారమైన వాఙ్మయసామగ్రి యావశ్యకమై యుండును. అది ఛందస్సు, వ్యాకరణము, భాష, అలంకారము, ఔచితి, శయ్య, రీతి, ధ్వని మున్నగు రూపములతో నలరారు. అందు మొదటిది సంస్కృతాంధ్రముల యందుఁ దలస్పర్శియైన శబ్దజ్ఞానము రస సమాధియందుండి రచన సాగించు నపుడు కవికి శబ్దజాల మహమహమికతో గోచరించుచుండును. వానియందు రసానుగుణమైన మృదుపదమును స్వీకరించి కూర్చుట యనునది యుత్తమ కవులైనవారి కెల్లరకు ననుభూత విషయము. సహజ కవులుకాక బలాత్కార ముగా రచన సాగించువారికి యతి ప్రాసచ్ఛందో నిబంధన లిఱుకునఁ బెట్టఁగా నేదోయొక పదము నతికించి ముగింప బహుళ ప్రయాసపడవలసి వచ్చును. జన్మాంతర సుకృతసిద్ధిచేఁ గవులైనవారికీ శ్రమలేశమైననులేక గంగాతరంగిణీ ప్రవాహమువలె రచన పరువులెత్తును. రసమాధురీ వాహినియందుఁ బఠితలను ముంచివైచును. చూడుఁడు. "ధరదివ్యాస్త్రహతిన్ బగిల్చికొలనుత్పాదించి వే దానికిన్ శరజాలంబుల నిల్లుగట్టుమన సైన్యంబుల్ వెఱంబొందెన, చ్చెరు వొందెన్ సురసంఘముల్ హరి నుతించెన్ బొంగియప్పార్థు భూ, వరమున్నిట్టివి చూడరున్ వినరు నెవ్వారుం(త్రి)లోకంబులన్. తిక్కన, మ భా. ద్రోణపర్వము. మత్తేభము మత్తేభయానముతో నడిచినది. వ్యర్థపదము మచ్చునకైనలేదు. ఎంతయో కథాభాగము నొక్క పద్యములో నిమిడ్చివైచెను. కౌరవసేనా మధ్య భాగములో రథాశ్వముల కర్జునుఁడు నీరువెట్టిన విషయమెంత మధురగంభీర ముగా వివరింపఁబడెనో గనుఁడు. సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పుచు

న్నా(డు అర్జును(డు గుజ్జములకు నీరువెట్టుట(జూచి మన సైన్యంబులు భయము నొందినవి. భయమెందులకు? పగతుర మధ్యభాగమునందు నేమాత్రము లెక్కలేక యీ పని(జేసిన కృష్ణార్జునులు సైంధవుని( జంపక విడుతురా? సైంధవు(డు చచ్చినట్లే మనమందఱమును హతులమే యని కౌరవసేన భయ పడినది. సురసంఘము లచ్చెరువొందినవి. వారికి భయపడవలసిన యవసరము లేదు. కృష్ణార్జునుల యద్భుత కర్మమును స్వైరవిహారమును జూచి యాశ్చర్య పడిరి. శ్రీకృష్ణస్వామి యుప్పొంగి "యర్జునా! నీతో సము(డైన పరాక్రమ ధురీణు(డీ ముల్లోకంబుల యందును లే(డు, భేష్, భళీ యని కొనియాడెను. అర్జును(డొనర్చిన పని కౌరవులకు( గనిపించుచునే, యున్నది. వేఱుగా స్వామి పొగడుటేల? పగతురు మఱింత బాధపడ(గలందులకే. ఇ(క సంజయు(డు ధృతరాష్ట్రునితో "రాజా! మున్నిట్టి పనులు సేయ(గా నెవ్వరును జూడలేదు. విననుగూడ వినలేదు "నభూతో నభవిష్యతి" అని యతిలోక వృత్తముగా వర్ణించెను. ఒకేయొక్క విషయమునుగూర్చి కౌరవసేన, సురసంఘములు, శ్రీకృష్ణస్వామి, సంజయు(డు పొందిన భావముల నెంతయుచితమనోహరముగా మహాకవి చిత్రించెనో గమనింపవలసియున్నది. ఇట్టి మహాకవితకును, బలా త్కారముగా రూక్షాక్షర సన్నివేశ నికృష్టముగా వ్యర్థపద భూయిష్ఠముగా జెప్ప(బడు కవిత్వమునకును బోలికయుండదుగదా. మహాకవియగుట బహు జన్మ పుణ్య పరిపాక విశేషకృత్యము. అట్టి మహాకవులు, వారిచే( గొనియాడ( బడిన పుణ్యపురుషులే చిరస్థాయిగా లోకమున నిలుచువారు అందువలననే

లంకాపతే స్సంకుచితం యశోయత్
యత్కీర్తిపాత్రం రఘురాజపుత్రః
ససర్వ ఏవాదికవేః ప్రభావః
నకోపనీయాః కవయః క్షితీశైః। అనివాకొన(బడినది.

ఈ పద్మావతీ శ్రీనివాసీయమును వ్రాసిన మా చిరంజీవికి( గవిత్వము వెన్నతోడ(బెట్టిన విద్యయైనది. ఎందువలననన(గా( బితామహులు శ్రీ వేంకట దాసస్వామివారు. శతాధిక గ్రంధకర్తలు, మహా తపస్సంపన్నులు, సిద్ధ పురుషులు, తండ్రిగారు (మా యన్నగారు) శ్రీ శ్రీనివాస పెరుమాళ్లగారు మహాకవులు. పినతండ్రినైన నేనును, కవినే. ఇట్లు కవి వంశమున జన్మించిన వృషాద్రిపతికి( గవిత్వమబ్బుటలో( జిత్రమేమియులేదు. అందుచేతనే "శుచీనాం శ్రీ మతాంగేహేయోగ భ్రష్టోఽభిజాయతే" "అధవాయోగి నామేవ

కులే భవతి ధీ మతామ్ అని భగవానులు నుడివిరి. కవిత్వమేగాక ప్రియ వక్తృత్వము, ఉచితజ్ఞత, నిరంతర కావ్యావ్యాసంగము దైవపరత మున్నగునవి యనూచానముగానే మా చిరంజీవి కబ్బినవి. వీనికిఁ దోడుగాఁదీసికొన్న యితి వృత్తము లోకపావనమైన పద్మావతీ శ్రీనివాసుల కల్యాణము. ఈ కావ్యము నందు మా యాయుష్మంతుఁ డొనర్చిన కవితా ప్రాభవమునకు విజ్ఞులే సాక్షి భూతులు. దిఙ్మాత్రముగాఁ జూపుచున్నాఁడను. "మగఁడు ముండయనుచుఁ దెగనాడ, వచ్చిన. ముష్టివాఁడుగూడ ముండ యనఁడె" "వైకుంఠలోకంబుఁ కోడియై నిగిడ్చి కూయకున్నె" ద్వి.సో. "కడఁగి చెట్టు చెడిడి కొలంబునకుఁ గుక్క-మూతిపిందెలన్న పోల్కి-తనర" పం.సోపానము. ఇట్టి నానుడులు తగిన యెడలఁ బరిశ్కృతములుగాఁ బ్రయోగింపఁ బడినవి.

కులశైలంబులు తల్లక్రిందయిన దిక్కుడ్యంబులే వ్రీలినన్
జలధివ్రాతము లింకిపోయిన ధరాచక్రంబు వక్రించినన్
జలజాతాప్తుఁడు కాంతిఁ బాసినను నక్షత్రేశుఁ డల్లాడినన్
లలనారత్నములార! పొల్లగుచుఁ గల్లల్‌గావు నా వాక్యముల్

మత్తేభము, గంధగంజ గంభీరయానముతో సహజ సరళశయ్యా సారస్యమును వెలార్చుచున్నది.

సీ. చనుమొగ్గలా కాదు మనసిజు, నునుజేతి
జాళువాబంతుల జంటగాని
కన్నులా యివి? కావు వెన్నెల వాగులో
విరిసిన చెంగల్వ విరులుగాని
ముంగురులా? కాదు మోము దామరలోని
తేనెసోనలు గ్రోలుతేంట్లుగాని
కటిబంధమా? కాదు ఘనశైల పతయాళు
ఝురిఁదోఁచుసైకత స్థలముగాని
మోవియా? గాదు బలుజంటి బావిగాని
వదనమా? కాదు రేయెండ పాదుగాని
అరగునె? కాదు మారు కటారి గాని
కన్నెయా, కాదు పసిడి పూదొన్నెగాని, పం.సో

పద్మావతీదేవి సౌందర్యవర్ణనము. పూర్వప్రబంధములలోని స్త్రీ వర్ణనమున కేమాత్రము తీసిపోని రచన. జాను తెనుంగుల కూర్పు, లలితపదసౌకుమార్యముచే సుందరావయవ సౌకుమార్యము సూచింపఁబడినది.

కులుకుమిటారి గబ్బిచను గుబ్బలపోడిమినోడి జక్కవల్
కళకుచు రేయి యంతయుఁ గలంగుచు నేడ్చెడు హేమకుంభముల్
దళమగుతాప భారమున ద్రావకమయ్యెడు, శైలశృంగముల్
పలుకులు పల్కులై పడెడు, వారణకుంభము మొద్దుబారగన్

హృదయంగమమైన హేతూత్ప్రేక్ష. వేయేల? మహాకావ్య లక్షణములిందుఁ బొందుపడియున్నవని చెప్ప సందియంపడనవసరములేదు, ఈమా చిరంజీవికిఁ బద్మావతీ శ్రీనివాసులు ఇతోఽధిక కావ్య రచనాపాటవమును, సంపూర్ణాయురారోగ్యైశ్వర్యముల నొసంగి సర్వదా సర్వథా రక్షింతురుగాత.

ఇతిశమ్.

# పద్యసుమహారవం

సాహితీ సాగర జ్ఞాన జలమునెల్ల
పుక్కిలించిన కుంభజ మునివరుండు
సరస సంగీత సాహిత్య చతురుడగు వృ
షాద్రిపతి గురుదేవున కంజలింతు

పాఠంబు చెప్పెనా పాషాణములెయైన
చైతన్య రససిద్ధి సంగమించు
పద్యంబు చదివెనా వట్టి మ్రోడులెయైన
జల్లన పులకించి పల్లవించు
హాయిహాయిగ నుపన్యాసంబు చేసెనా
కొసరి కోకిల మారు కూయదొడగు
సరసత మెలమెల్ల సల్లాప మొనరింప
వెన్నెల పందిరుల్ వన్నెదరుగు

స్థిరత మానవత్వమ్మె మూర్తీభవించి
వినయ వినమిత చిత్తుడై వెలయుచున్న
అమిత శేముషీజిత దైత్యారిగురుడు
భవ్యగుణుడు వృషాద్రిపతి గురుండు

పరమదైవము వేంకటపతి పరిణయ
చరిత రచియించి సద్యశశ్శాలి యగుచు
కవి జనంబుల ప్రస్తుతి కాంచగలిగె
పసిడికివితావి యబ్బిన పగిదిదోచె

'కవయిత్రీ తిలకము'
నరహరి సత్యభామ
హైదరాబాదు

# దేశిక స్తవము

మొవ్వ వంశాంభోధి పూర్ణచంద్రుండు
నివ్వటిల్లిన కీర్తి నిచయసాంద్రుండు
సాహితీలోకైక చతురాననుండు
మోహలతాచ్ఛేద పూతవర్తనుడు
సరస కావ్యరచనా చతురదక్షుండు
పరతత్త్వ విజ్ఞాన భాసురాక్షుండు
నిజ శిష్య వాత్సల్య నీరధిసముడు
ప్రజలకు స్తుతిపాత్ర రమణీయగుణుడు
దేశికులకు నెల్ల దేశికోత్తముడు
ఆశాంత సంవ్యాప్త హార్దికోన్నతుడు
శయ్యావిలాసంబు శబ్దపాటవము
నెయ్యంపు రససిద్ధి నెఱియలంకృతులు
వ్యంగ్య మర్యాదయు నర్థగౌరవము
భంగ్యంతరంబగు పాత్ర చిత్రణము
నిరుపమానంబుగా నెరవేర్చు ఘనుడు
కరుణాలవాలుండు క్రమశీలుండు
'పద్మావతీ శ్రీనివాసీయ' మనగ
పద్మజా పరిణయ పటు గాథ వ్రాసె
భవ్య సద్గుణ కళావధి వృషాద్రిపతి
దివ్యవచోమూర్తి దిగ్దేశకీర్తి
మహితుడౌ ఆచార్య మార్తాండు డనఘు
డహిరాజ పర్యంకు ననుగు భక్తుండు
అతులిత దీర్ఘాయురారోగ్య భాగ్య
చతురుడై కలకాల మతుల సేవలను
తన శిష్యపాళిని తనుపుగావుతను
ఘనతర సాహిత్యకళల తేల్చుచును

ఆకుల ఆంజనేయప్రసాదు
గుంతకల్లు

# శుద్ధప్రతి

| పుట | పద్య సంఖ్య | పాద సంఖ్య | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|---|
| 3 | 5 | 4 | శౌనిక | శౌనక |
| 11 | 40 | 2 | నొక్కొక్క | నొకొక్క |
| 19 | 77 | 2 | మరుత్తిగ్మాంశువుల్ | మరుత్తిగ్మాంశువుల్ |
| 26 | 106 | 4 | మైక్యముఁజెంది | మైక్యముఁజెంది |
| 29 | 122 | 2 | జనుమిఁక" యని | జనుమిఁక" నని |
| 36 | 26 | 3 | బ్రతిమాలిన | బతిమాలిన |
| 44 | 70 | 3 | చింతాభూరుహ | చించాభూరుహ |
| 56 | 123 | 1 | లేనియట్లే | లేనియట్లె |
| 64 | 30 | 2 | పద్మత్రాక్షి | పద్మపత్రాక్షి |
| 76 | 85 | 3 | నిర్మింకొనె | నిర్మించుకొనె |
| 78 | 95 | 1 | చేకురుచుచుండు | చేకురుచుండు |
| 80 | 102 | 2 | మానసీమణి | మానినీమణి |
| 81 | 4 | 3 | జ్ఞానమృత | జ్ఞానామృత |
| 91 | 51 | 1 | యజ్జాయతాక్షుండు | అబ్జాయతాక్షుండు |
| 104 | 115 | 4 | సూత్రామా! | సుత్రామా! |
| 106 | 4 | 4 | వదనా! హయసదన | సదనా! హయవదన! |
| 113 | 31 | 2 | వైశమనేగి | వైశమయేగి |
| 114 | 38 | 4 | మృగయక్షుద్రుండు | మృగయుక్షుద్రుండు |
| 116 | 49 | 3 | నీనాకలున్ | నీ నాలుకన్ |
| 121 | 74 | 2 | భావనందు | భావమునందు |
| 122 | 76 | 1 | శ్రీ రాఘూద్వహా | శ్రీరఘూద్వహా! |
| 123 | 83 | 3 | ఔన్నడుఁగల్గ" | ఔన్నడుఁగల్గ" |
| 142 | 3 | 1 | చతురుబుద్ధ్యా | చతురబుద్ధ్యా |
| 145 | 15 | 2 | కళాపా డబ్జోదరా | కళాపారీణుఁడబ్జోదరా |
| 149 | 34 | 3 | సూచ్యార్థ | సూచ్యర్థ |
| 152 | 48 | 1 | కన్యదాన | కన్యాదాన |
| 155 | 61 | 2 | భకి | భక్తి |
| 168 | 117 | 3 | యాదార్థ్య | యాథార్థ్య |

# ఇష్టదేవతాస్తుతి

శ్రీరామా రమణీ ధరా సతులు ముంజేఁగంకణ క్వాణ మిం
పారన్ బాదములొత్త భోగివర పర్యంకంబుపైఁబండి కా
వేరీ మధ్యమునందు వైభవ కళా విశ్వైక రక్షాత్ముఁడౌ
శ్రీరంగేశ్వరుఁగొల్తుఁ బూర్ణ కరుణాసింధున్ జగద్బాంధవున్

ఏ పవిత్ర చరిత్ర చూపు లించుకసోఁక
బ్రహ్మరుద్రేంద్రాది పదవు లొదవు?
ఏ సాధ్వి పదరజం బింత సోఁకినమాత్ర
లలిగజాంతైశ్వర్య లాభమొదవు?
ఏ మాన్య భార్యగా దామోదరుఁడు శ్రీని
వాస సార్థకనామ భవ్యుఁడయ్యె?
ఏ దేవి పద ముద్ర లీరేఁడు జగముల
కాహార ధాన్య సస్యాళి నొసఁగు?

ఏ మహాజనయిత్రి పత్తామరసము
లర్థిఁగొలువ నింద్రాణీ ముఖామరాంగ
నాళి తమయంత వలతు, రాయమృతపూర్ణ
మహిత గుణపేటిఁ దలఁతు రమావధూటి

దురితావార దురంత రాక్షస కృతాంతున్ రామనామామృతా
క్షర నిత్య స్మరణైక సంజనితహర్ష శ్రీ నితాంతున్ మహో
ద్ధుర బాహాబలశౌర్య సాహస నిశాంతున్ - స్వచ్ఛ పాండిత్యబం
ధురునెంతున్ హనుమంతు సౌమ్యగుణ శాంతున్ దాంతు సుస్వాంతునిన్

వాసంబై యుపధానమై మృదులమౌపర్యంకమై మందిరం
బై సింహాసనమై సువర్ణ మకుటంబై పాదుకాయుగ్మమై
వాసిం గైకొని యెండవాన చలువల్ పై సోఁకఁగానీక తా
దాసుండై హరిఁ గొల్చు నాగకుల నేతన్ శేషు నర్చించెదన్

నగ భిద్వ్రజ మెవాని ఱెక్కల కొనన్ ఖండింపలేదయ్యెఁ? బ
న్నగరాట్తుల్యునకే మహాజవుని స్కంధంబే శతాంగంబొ? యె
న్నఁగ పున్నాగములే మహామహుని సందర్శింపఁ గంపించి తి
న్నగ వల్మీకముఁ జొచ్చు? నాఘను శకుంతస్వామి నగ్గించెదన్

అనల జ్వాల పరంపరల్ కుసుమమాలాభంబుగా దైత్య రా
డ్వనితా మంగళసూత్ర నాశన కళావ్యాపారుఁడై పాప ఖం
డన పారీణత ధర్మరక్షణ ధురీణ ప్రాజ్ఞుఁడౌ శ్రీ సుద
ర్శన చక్రాయుధునెంతు శత్రు హనన ప్రజ్ఞాపరీరంభునిన్

తన ధ్వాన మ్మసురారి బృందముల కుత్సాహంబుఁ గల్పింపఁ గ్రూ
ర నిశాటాధిప వాహినీ నిచయ హృద్రంగంబు భంగమ్ముగా
వనజాతాయత దివ్యనేత్ర వదన ప్రాబల్య సౌగంధ్య భా
జను నాపోజను పాంచజన్య నృపతిన్ శంఖ ప్రభుం గొల్చెదన్

చేతన కోటికెల్ల హరిసేవ ప్రబోధ మొనర్పనెంచి చిం
చాతరు కోటరంబున ప్రశాంత సమాధిని తామ్రపర్ణికా
స్రోతము చెంతలన్ దమిళ సూక్తుల వేదముచెప్పె నా శఠా
రాతి పదాబ్జముల్ గొలుతు ప్రాజ్ఞశిఖామణి - వైష్ణవాగ్రణిన్

అవివేకమ్మునఁ దత్త్వ దూరముగఁబెల్ల జ్ఞానపుంజీఁకటుల్
కవయం గ్రుంగు జనాళి మోక్షపదమార్గ స్వాంతులంజేయ - ఈ
యవనీ చక్ర దిగంతసీమల విశిష్టాద్వైత సిద్ధాంత బీ
జ వితానంబును చల్లు లక్ష్మణ యతీశ శ్రేష్ఠు నగ్గించెదన్

శ్రీ లక్ష్మీవిభు పాదపద్మయుగళీ భృంగంబులై విష్ణు సే
వా లక్ష్యంబుగబద్ధ చేతనతతిన్ భక్తి ప్రబోధంబుచే
లీలన్ మోక్షపథానురక్తముగఁ గల్పింపంగ యత్నించు ది
వ్యాళిన్ గొల్చెద జ్ఞాన భక్తి పరులౌ ఆళ్వారులన్ సూరులన్

యతి రామానుజ యోగిచంద్రుఁడు మనుష్యశ్రేణిఁ గాపాడఁగా
క్షితి నీ రూపముతో జనించె నన లక్ష్మీజాని పాదాబ్జ సం
భృత భక్తిన్ వెదజల్లి శిష్య జలజార్చిష్మంతుఁడై గ్రంథ సం
తతులన్ వ్రాసిన వేంకటాఖ్య ముని సుత్రామున్ సదా కొల్చెదన్

స్థానము సత్కవీంద్ర పరిషత్తున నగ్రము - తర్కవార్ధి మం
థాన ధరాధరమ్ము - రఘునాయక పాద జలేజ శీధు సం
పాన మిళింద - మార్యనుతవర్తన శిష్య సమాజవత్సలున్
మానితు శ్రీనివాస పెరుమాళ్లు నుతించెద నాదు తండ్రినిన్

పతిపద మగ్నజీవన - అవారిత దానకళానిధాన - మా
నిత వనితా ప్రతానగుణ నిర్మల దివ్య యశోవితాన - స
మ్నత ఋజు సత్త్వవర్తన వినూత్న పవిత్ర సుధాచరిత్ర - సం
తత విమలాచ్ఛ శీలయగు తల్లిని గొల్చెద బాలమాంబికన్

సాటిలేనట్టి భక్తివిస్తారుఁ డగుచు
నిర్మలాధ్యాత్మిక జ్ఞాన నిరుపమానుఁ
డగుచు శిష్యులఁ గాపాడు నసఘ చరితుఁ
గొలుతుఁ బినతండ్రి వేంకటాచలపతీంద్రు

చండజ్ఞాన సమస్త వాఙ్మయ సరస్వంతంపు సారోదమున్
గండూషించి స్వశిష్య వర్గమునకున్ జ్ఞానప్రదాన క్రియా
శౌండుండై విలసిల్లు దాశరధి విశ్వవ్యాప్తనామున్ మహో
ద్దండున్ సూరి కులాగ్రగణ్యుఁ దలతున్ దామోదరాంఘ్ర్యర్చకున్

వ్యవసాయము - హరిభక్తి
వ్యవసాయము - రెండు కన్నులైయొప్పెడి సం
స్తవనీయగుణ చరిత్రుని
అవికారున్ రామప్రసాదు నగ్గింతునెదన్

అలఘు యశుండు నిర్భర మహాశుకవిత్వ కళావిదుండు స
త్కళలకు దుగ్ధవార్ధి - అవధాన సరస్వతి శ్రీ ప్రసాద రా
ట్కులపతి మద్గురూత్తముని గొల్తు దిగంత యశోవిశాలుఁ ద
త్కల కవితామృతోర్మికలఁ దానమొనర్పని వారలుందురే?

ఆతడు సర్వశాస్త్ర కలశార్ణవ కుంభజుఁ డార్షధర్మ వి
ఖ్యాత చరిత్రుఁ డచ్ఛకవితామృత నిర్ఝరి సర్వమానవ
వ్రాత హితార్థభావుకుఁడు భవ్యయశోనిధి యార్లగడ్డ వం
శాతతవార్ధి చంద్రు వినయంబున నెంచెద సుబ్బరాణ్మణిన్

కీర్తి శరీర మిచ్చట మిగిల్చి దివంబునకేఁగె సత్కళా
వర్తనులైన దివ్యులకు వ్యాకరణంబును బోధసేయ - సం
పూర్తిగ శబ్దశాస్త్రమును పుక్కిటఁ బట్టిన బస్వరాజు - ధీ
కీర్తను గిద్దలూరు కులకేవల వార్ధి శశాంకు నెంచెదన్

## కవీంద్రస్తుతి

భారతదేశ కీర్తి సుమవాసన లీ జగమెల్ల నిండఁగాఁ
గారకులైన సంస్కృతి వికాసుల వాల్మికి - వ్యాసమౌనులన్
భారవి కాళిదాసులను - బాణమయూర మురారిహర్షులన్
భూరి విలాసుభాసు - భవభూతిని మల్హణ బిల్హణాదులన్

సరస సంస్కృత సాహిత్య సాగరంబుఁ
ద్రచ్చి యమృతసారము జగత్త్రయ హితార్థ
బుద్ధి విబుధులకిచ్చి యపూర్వ కీర్తి
చంద్రికల నొప్పు కవులకు సాఁగిమ్రొక్కి

నన్నయభట్టు - తిక్క కవినాథ - యెఱ్ఱాప్రగడాది సత్కవి
త్వోన్నయ పంకజోదరుల నుత్కటభక్తి నుతించి - భక్తపో
తన్నను - సార్వభౌముని - పితామహుఁ బెద్దనఁ జేమకూర వెం
కన్నను భట్టుమూర్తి కవిహంసులఁ గొల్తు జగద్రవీందులన్

ప్రథితు నాచన సోమన్న - భాస్కరకవిఁ
గృష్ణదేవరాయల - రామకృష్ణసుకవిఁ
దిమ్మనను - మొల్లను సరస్వతీ స్వరూపు
లైన సత్కవి చంద్రుల కంజలింతు

ఆంధ్ర సాహిత్య మృదు నిర్మలాంబరమునఁ
గాంతు లీనెడు తారకా గణమువోలె
నెనయు వర్తమానాంధ్ర కవీంద్రులకును
శిరము వంచి నమస్సులు చేసి చేసి

చెఱకుపాలును బూఁదేనె చెలిసగముగఁ
గలిపి క్రొంగ్రొత్త రీతులఁ గవితలల్ల
భావి కాలాన జనియింపఁబోవు తెనుఁగు
కవి వతంసుల కిదె నమస్కారశతము





# పద్మావతీ శ్రీనివాసీయము

## (పద్యప్రబంధము)

## ప్రథమసోపానము

### షష్ఠ్యంతములు

శ్రీ వేంకటగిరి వాసున
కావరణాష్టక నిబంధితామృతతత్త్వ
ప్రావృతునకు సుచరిత ప
ద్మావతి హృదయాధి నాథ దైవంబునకున్ 1

శ్రీ మహిళామణి నిర్మల
కోమలరుచి శాతకుంభ కుంభ కుచాగ్ర
క్షేమంకర కరకమలున
కామోదిత విశ్వరక్షణాతి శయునకున్ 2

నారాయణాద్రి నిలయున
కారాధక హృదయ పంకజాదిత్యునకున్
నీరేజ పత్ర నయనున
కారూఢ మహత్త్వ తత్త్వ యతిహంసునకున్ 3

కలియుగ దైవంబునకున్
గలికాల దురంతదురిత ఖండనునకు - ఉ
జ్జ్వల మహిమోపేతునకును
లలిత కళారాధితునకు లక్ష్మీశునకున్ 4

శ్రీ రమ్య దయాధారా
ధారున కత్యంత కీర్తి ధారాళునకున్
పారావార పరీత ధ
రారాతి విదారణాతి హంకారునకున్ 5

భక్తాభీష్ట ప్రదునకు
శక్తి శ్రీ రూప కీర్తి సాంద్రున కఖిల
ప్రాక్తన చైతన్యునకు వి
విక్త చరిత్రునకు దివ్య వేంకటపతికిన్ 6

వ॥ సమర్పితంబుగా నా యొనర్పంబూనిన 'పద్మావతీ శ్రీనివాసీయం' బను మహాప్రబంధంబునకు శ్రీ వేంకటశైలనాథు నధినాథుం గావించి, మృదు మధురశైలీ విన్యాసంబుతో పోహణించు నీ ప్రబంధ రత్నహారంబునకు సూత్రంబెట్టిదనిన 7

# కథా ప్రారంభము

శ్రీ కరుణా పారీణా!
లోకాలోకన రవీందులోచన నిపుణా!
నాకాధిప నుత చరణా!
స్వీకృత నిజ భక్తసుగుణ! వేంకటరమణా! 1

అవధరింపుము 2

పరమ పవిత్రమై ముని నివాస విభాసురమై తపో విని
ర్భరమయి సత్రయాగముఖ పావన వైదిక సంప్రదాయమై
నిరుపమ శాంతి దాంతి కమనీయ కళానిగమాభిరామమై
వరలును నైమిశాటవి సుపర్వ విమోహన నేత్రపర్వమై 3

కులపతిశౌనకుండు మునికోవిదుఁ డాశ్రమ మొండు నిల్పి ని
శ్చల తప మాచరింప గుణసాంద్రులు కొందఱు మౌని చంద్రముల్
వలచి తపంబుసేయ నటఁ బర్ణకుటీరములన్ రచించి ని
ర్మలతఁ దపించుచుండిరి స్థిరంబగు దీక్షఁ బరంబు పండఁగన్ 4

సూతుఁడు బ్రహ్మతత్త్వ రథసూతుఁడు సర్వపురాణ భావ సం
జాత సుధా విధాతృఁడు - ప్రశస్త కళాలతికా ప్రసూతుఁ డు
ద్భూత మనః ప్రపూతుఁడు ప్రపూర్ణ ఫలప్రద యజ్ఞ సత్క్రియో
పేతుఁడు వచ్చె శౌనిక నివేశము డాయఁగ బ్రహ్మభూతుఁడై 5

అటు లేతెంచిన సంయమిప్రవరు నాహ్వానించి శ్రద్ధా విధా
స్ఫుటతన్ దర్భకటంబు మీఁద నుపవిష్టుంజేసి ఆతిథ్యము
త్కట మర్యాద నొసంగి నమ్రత యతీంద్రశ్రేణి సప్తాద్రి వేం
కట నాథామృత గాథలన్ విన మనః కౌతూహలాయత్తులై 6

"స్వామి! అష్టాదశపురాణ సారమెల్లఁ
దెల్లమయ్యెను నీ దయోదీర్ణ మహిమ
వేంకటేశ్వర లీలాకథాంక దివ్య
చరిత వినమొల్చెఁ దనువెల్ల శ్రవణగణము 7

వ్యాసమునీంద్ర శిష్యులకు నద్భుతమైన జగత్ప్రవర్తకా
ధ్యాసిత సర్వ వృత్తములు హస్త తలామలకంబులౌఁగదా!
నీ సము లీ విశాల ధరణీస్థలి లేరు - పయోదగర్జ నా
భ్యాసగభీర మంద్ర మృదు వాక్య పరంపర మమ్ముఁ దేల్పవే! 8

అని ప్రార్థించెడి మౌనులఁ
గని తనమనమందు వేదఖని జ్ఞానఫణిన్
మునివరుఁ దనగురు దేవుని
ననువుగ మదినిల్పి సూతుఁడద్భుత ఫణితిన్ 9

వ్యాసమౌని భగీరథ ప్రాప్త గంగ
సూత విజ్ఞాన జాహ్నవీ స్రోతమయ్యె
వస్తు వౌపాధిక ప్రభావమున గణ్య
మగు జలము శంఖమునఁ దీర్థమైన పగిది 10

వ్యాసమౌనీంద్ర సత్కృపా వర్షధార
సూత విజ్ఞాన నగరఝరీ పాతమైన
మృదు మధుర వాహినులు పొంగి కదలసాగె
రూఢమగు సూత వాగ్ధార రూపమొంది 11

“శ్రీహరి శేషభూమిధర శృంగ శిరోగ్రమునందు దేవసం
దోహము గొల్వ విశ్వహిత దోహలితోహ ధరిత్రినేల స
స్నేహత శ్రీనివాసుడయి నిల్చె - సుధామయ తచ్చరిత్రముల్
మోహలతాలవిత్రములు - మోక్షరమా కరుణాపవిత్రముల్ 12

అనిశముఁ గోట్లకుంగొలఁది యాత్రికు లేనగ దర్శనార్థమై
యొనరు వ్యయప్రయాసముల కోర్చి యచంచలమౌ ప్రపత్తితోఁ
జని జననంబు వంశమును సార్థకమైన దటంచునెంతు రా
యనుపమ వేంకటాచల మహత్త్వ పటుత్వము నెన్న సాధ్యమే? 13

ఏనగ శృంగదర్శన మహీనమహైనసమున్ హరించి సం
దానిత సౌఖ్యసంగ సముదంచితమై సురసిద్ధ సాధ్య వై
మానిక ముఖ్య సేవ్యమయి మౌనితపః ఫల కల్పవృక్షమై
జానగు కాంతి వర్ధిలు వృషాద్రి సురాద్రి కసూయఁ గొల్పదే? 14

ఎవ్వని దేవళంబున నహీన జన ప్రకరంబు గుంపులై
దవ్వులనుండి వచ్చి కనుదమ్ములు మూయక ఆర్తితోడ నే
మవ్వపు నీలమేఘ నవమంజు మనోజ్ఞ సుధాప్రపూర్ణమౌ
నవ్వుమొగంబుఁ దన్మయ వినమ్రతఁ గాంచి తరింప నెంతురో? 15

మణిహేమ గోపుర మంటప ప్రాకార
భాసురం బెవ్వాని వాసభూమి?

ఎగసి మిన్నుల రాయు నేఁడుకొండలమీఁదఁ
బృథుమేఘముల నొప్పు నెవనిమేడ?

నిత్యవిభూతి దండించి వంకలు దిద్ది
రాణించు నెవ్వాని రాజధాని?

పాథోధి సప్తక పర్యంతమగు భూత
ధారుణియెవని విహారసీమ?

బ్రహ్మరుద్రేంద్ర ముఖ్య దేవతలకెల్ల
నెవని దర్శన మతిలోక హితముఁగూర్చు
నట్టి వేంకటబ్రహ్మ మనంత గరుడ
సైన్యపులు గొల్వనుండు నా శైలశిఖరి 16

దరిఁజేరువారల దురితముల్ తొలఁగించు
పాపనాశని యెందుఁ బరగుచుండు?

అఘజాలములఁబాపి అలరుఁ దానెచ్చోట
ఆకాశగంగ యుద్యత్తరంగ?

సిద్ధయోగి మునీంద్ర సేవితంబై యెందు
నిరవొందుకాన తుంబురుని కోన?

రామానుజయతీంద్రు ప్రాజ్ఞ నిర్ణయమెందు
వైష్ణవ రమకు సంపద ఘటించు?

వ్యాసరాయ తపః కృషి పంటపండి
జ్ఞాన భోజన మెట సర్వజనుల కొనఁగె
నట్టి అద్భుత ధాత్రి జితామరాద్రి
వేంకటనగంబు భూలోక విష్ణుపదము 17

కలియుగ వైకుంఠంబిది
కలిగిన కనుగవకు సార్థకత్వము చెలఁగన్
వెలసిన తిరుమలదర్శన
కలనన్ జరితార్థులగుచుఁ గాంచుడు శుభముల్ 18

ఈతఁడు కోట్లకుంబడగనెత్తినవాఁడు - దరిద్రుఁడీతఁడన్
భౌతిక జాతి సంపదల వాసి గణింపక సర్వమానవ
వ్రాత మెవాని ఆలయ కవాటతలంబులరేఁ బవళ్ళ సం
గాతపు జోతలీయఁ బడిగాపులు గాతురొ? వాని నెన్నెదన్ 19

ప్రత్యక్ష దైవతంబని
ప్రత్యయమునఁగొల్వఁ గొంగు బంగారంబై
నిత్యముఁ గాఁపాడు సుమా
అత్యంత శ్రద్ధ వినుఁడు యతివరులారా!" 20

వ॥ అని వినయ వినమితోత్తమాంగుండై సూతమహర్షి నారాయణుని దివ్యచరణ కంజంబుల కంజలించి - అష్టాదశ పురాణ విజ్ఞాన పరాయణుండగు బాదరాయణుని పదపద్మయుగ్మంబును మనంబున ఘనంబుగా నిలిపి తత్కథావిధాన మిట్లని అభివర్ణింపఁ గడంగె. 21

వికసత్పద్మ దళాంతరస్థిత రజఃపీఠిన్ సుఖాసీనుఁడై
సకలామ్నాయ పురస్సరంబుగ మహాసావిత్రి గాయత్రి త
న్నికటాంతస్థలిఁ గొల్చి చామరములన్ వీవంగ ఓంకార పూ
ర్వక మంత్రాక్షర నాదముల్ ప్రబలఁగా రాజీవగర్భుండొగిన్ 22

కొలువై యుండెను సత్యలోకమునఁ గింకుర్వాణులై దిక్పతుల్
నిలువన్ స్వర్గవిలాసినీగణ కళానృత్యంబు సాఁగన్ మునీం
ద్రులు కేల్మోడిచి సుస్వరాన్వితముగా స్తోత్రంబు సల్పన్ నిలిం
పులు వహ్నీంద్రులు మున్నుగాఁ దరలి తత్పూజాదులం బూనఁగన్ 23

శారద సర్వవాఙ్మయ విశారద శారద చంద్ర చంద్రికా
సారద నీరదాపఘన సాంద్రసితద్యుతియంక పీఠికా
ధార విపంచికా ఘటిత తంత్రులు మీటఁగ నుద్భవించు నోం
కార రవంబునన్ శ్రుతి శిఖల్ వెలయించుచుఁ జెంతనుండఁగన్ 24

సప్తఋషులు సూర్యచంద్రులు గ్రహములు
బ్రహ్మకడకు వచ్చి ప్రాంజలించి
ఉచిత పీఠములను నుపవసించిరి - పవల్
విరిసియున్న పద్మ సరసిఁబోలె 25

నలువ నలుమొగములఁ జెలఁగు వేద నినాద
మలమి దెసలు మారుపలుకుచుండె
మునులు దేవతలును గనులు మోడ్చి కరాబ్జ
ములను నిటల తటము లొలయ నిలిపి 26

నవచిత్రాకృతి నుండి రప్పుడు "నమోనారాయణాయేతి" సం
స్తవనీయధ్వని గంధవాహగతి వ్యాప్తంబై విజృంభించె ది
జ్నివహంబుల్ మహతీ నినాదముల విన్పించెన్ సుధాశ్రావ్యమై
అవలన్ నారదమౌనితోఁచెను సదస్య వ్రాత ముప్పొంగఁగన్ 27

జలజాతాసన పాదపంకజరజః స్పర్శంబు గావించి - ని
శ్చల భక్తిన్ జనయిత్రివాణి పదకంజ ద్వంద్వ మర్చించి వా
రల ఆశీః కుసుమంబులంది మునిచంద్రశ్రేణి నగ్గించి యే
కలహాంకూరము కల్గునో యనుచు నాకాంక్షం బ్రతీక్షింపఁగన్ 28

సుతు నెమ్మోమునఁ జూపు నిల్పి చతురాస్యుం డొక్కకార్యంబు ప్ర
స్తుతమంచెన్ని వచించె "నారద! జగద్దోషంబులం దెల్పి నీ
క్షితికిన్ క్షేమముఁ గూర్ప నద్భుత కళాసిద్ధిం బ్రదర్శింతు వ
క్షతమై వచ్చె సమస్య యొం డది పరిష్కారంబు గావింపవే! 29

వ॥ అది యెట్టిదంటివేని వినుము, కలియుగంబున శ్రీమన్నారాయణా వతారంబు కలుగనేరమి మానవులు భగవద్భక్తి శూన్యులై - మూర్ఖ ప్రవృత్తికి వశ్యులై పాపకార్య నిర్వహణ సమాసక్తు లగుదురు. నీ నేర్పుం బ్రదర్శించి శ్రీ మహావిష్ణువు కలియుగంబున నవతరించు వెరవేర్పరుపవలయు. 30

భక్తాగ్రేసర! నీవ యీ పని నొనర్పం జాలితేనిన్ బరా
సక్తిన్ దాము తరింప మానవులు నిష్కామక్రియాపాలనో
ద్యుక్తుల్ ముక్తివధూవిధూనన విధేయుల్ మోహమాయా పరి
త్యక్తాంతః కరణంబుతోడ భగవద్భక్తిన్ బ్రమోదింపరే? 31

అప్పుడు మేలుకల్గుఁ బ్రజలందఱ - కాంతరవైరిషట్కమున్
గప్పును శాంతి దాంతులు జగమ్ముల ధర్మము తాండవించు నీ
విప్పనిఁ జేయఁబూన నదియెంతటి"దంచు వచింప నారదుం
డప్పరమేష్ఠి వాక్యముల హర్షమునందెఁ జికీర్షరేఁచఁగన్ 32

ఆ మాటల్ చెవిసోఁక నిర్జరులు వర్షాంభోదగర్జా నినా
దామోదంబున నాడు కేకి గణమట్లానంద తుందాత్ములై
"ఓ మౌనీశ్వర! నీవుదక్క యొకఁ డన్యుండర్హుఁడే అంజనా
రామాపుత్రుఁడుగాక యెవ్వఁడటు పారావారముం దాఁటఁగన్ 33

అనుచు నుబ్బింప హరినామ మాలపించి
అజుని చరణాబ్జములకు సాష్టాంగ మెఱఁగి
నారదుండేఁగె మహతీ నినాదమొప్పఁ
గార్య మీడేరెనని సురల్ గంతులిడఁగ 34

జనకుని యాజ్ఞ యజ్ఞపుఁ బ్రసాదముగాఁగొని నారదుండు స
జ్జన హిత కార్యనిర్వహణ సత్వరజిత్వరుఁడై ధరిత్రి కొ
య్యనఁజని మాధవాహ్వయ సుధాక్షర సంస్మరణై కశీల వ
ర్తనుఁడయి పుణ్యగాంగతట రమ్యతలంబులఁ జూడనేఁగుచున్ 35

కనియెన్ నిర్మలతుంగ సంకుల తరంగన్ సత్యసంకల్ప స
జ్జన వాంఛా పరిపూరణాదృత మనస్సంగన్ బయోనీడజో
ద్ఘన సంచార మనోజ్ఞఖేలన తురంగన్ మత్తభృంగన్ బ్రతి
క్షణ సంచారిత వేదనాద కలనా సంసంగగంగన్ దగన్ 36

అచ్చటఁగశ్యప ప్రముఖులైన మునీశ్వరులెందరో చెడున్
మచ్చరకించి - విశ్వహితమర్షణులై జగతీప్రవృత్తమౌ
పొచ్చెము మచ్చమాపఁ గ్రతువున్ బొనరించెడువేళ గాన సం
పచ్చయుఁడైన నారదుఁడు వచ్చె విపంచి రవంబులెచ్చఁగన్ 37

తన ఆశయ సిద్ధికి నిది
యనువైన ప్రదేశమిందు నంకురమిడినన్
ఘనమగు శాఖల నాకస
మునుతాఁకును వృక్షమనుచు మునివరుఁడంతన్ 38

"మునినాథోత్తములార! యిద్దిజనతా పుణ్యప్రదంబైన స్వ
ర్గ నదీతీరము యజ్ఞకర్మము జగత్కల్యాణ గణ్యంబు - అ
త్యనఘుల్ మీరలు కర్తలార్షపరు - లన్వర్థంబు మజ్జన్మ మీ
క్షణమందే నిటకేఁగు దెంచుట ప్రశస్తంబయ్యె స్తోత్రార్హమై 39

మీరు మహానుభావుల - రమేయ తపోధను లొక్కరొక్కరే
సారసమగ్ర నిర్వహణ శక్తి నొక్కొక్క జగత్తుసల్పఁగా
నేరుచువారు - సర్వధరణీహితమూల సనాత నార్ష ధ
ర్మారసులై క్రతూత్సవము నందుట కెంతయు సంతసించితిన్ 40

ఐనను సందియంబొకటి ఆత్మజనించెడు నిట్లు వైదికా
ధీనత నిర్వహింపఁబడు దీనికిఁ బూరుషుఁడెవ్వఁ డాహుతుల్
వేనినిఁగూర్చి కుండముల వ్రేల్తురు? యజ్ఞఫలప్రదాత శ్రీ
జానియొ - బ్రహ్మయో - శివుఁడొ చక్కఁగ ఋత్విజులార! తెల్పరే! 41

వెస నా కెప్పటినుండియో మనమునం బీడించు సందేహ మొం
డసదై - దానినిఁ దీర్ప నన్యు లెవరయ్యా! నాకు మీకంటె? అ
క్కసముం గూర్చెడు దీనిఁదీర్చి ప్రతిభా గంధంబు సంవ్యాప్తమై
దెసలంగ్రమ్మి జగద్ధితంబు నెఱపన్ దీక్షింపఁ బ్రార్థించెదన్" 42

ఆ నారదముని ప్రశ్నము
వీనుల సోఁకంగ ఋషులు విన్నదనంబున్
బూని త్రిమూర్తుల నొక అభి
ధానముఁ జెప్పంగరాక తలఁకుచునుండన్ 43

నారదమౌని వారిఁగని "నాయనలార! యిదేమి? యజ్ఞపుం
బూరుషుఁడెవ్వఁడో క్రతు విభూషణుఁడెవ్వఁడొ? తత్క్రియాఫలా
ధారుఁడెవండొ యెంచక వృధాకద యజ్ఞకలాపధారణం
బారయ గ్రుడ్డియెద్దు పొలమందుఁ జరించిన తీరు తోఁపఁగన్ 44

హరిహర నీరజాసనులయం దతి సత్త్వగుణాఢ్యుఁ డెవ్వఁడో
కర మరుదైన ముక్తికధికారి యెవండొ యెఱింగి వానికీ
పరమపవిత్ర యజ్ఞఫలభాగము సర్వము ధారవోసి య
క్షరమగు మోక్షరాజ్యమునుగాంచి తరించుటమేలుకాదొకో?" 45

వ॥ అని వచియించి సమస్తవిషయ విస్తార విశారదుండగు నారదుండు తన మనంబున నిట్లని వితర్కించె 46

నా మాట లాలించి ఈ మౌనులు త్రిమూర్తి
వరుల శోధింపక మరలిరారు
బ్రహ్మరజోగుణ భరితుండు - రుద్రుండు
తామసైకాంత నిధానుఁడగుట
నారాయణుఁడు శుద్ధ సారసత్త్వుండౌటఁ
గ్రతు పూరుషుండన్న ఖ్యాతిఁగాంచు
నా పరీక్షలయందు హరికి శ్రీదేవికి
జగడమ్మొకించుక జరిగితీరు

అందువలన వైకుంఠమ్ము నవల విడిచి
అవతరింతురు వారలీ యాంధ్రమందు
వారి నర్చించి తరియింత్రు ప్రజలటంచు
నారదుఁడు బ్రహ్మలోకంపు దారిఁబట్టె 47

మునుల మనంబులన్ రగిలె పూర్ణ విశృంఖల సంశయాగ్ని నె
క్కొనియెను భేదభావములు కొందఱు బ్రహ్మయె సర్వశక్తుఁ డం
చును వివరింప శంకరుఁడెసూ భగవంతుఁడటంచుఁ గొంద - ర
బ్జనయనుఁ డచ్యుతుండె భగవానుఁ డటంచును గొందఱాడఁగన్ 48

వాదంబుల నాదంబులు
రోదోంతరమెల్ల నిండరోయకవారల్
వాదమ్ములు ప్రతివాదము
లాదరువులు చూపి చేయు నా సమయమునన్ 49

స్ఫురితాస్యంబులు నాల్గు వేదములకుం బుట్టిండ్లుగా సప్తసా
గర భూమీధర ఘోరకానన జగత్కాండైక సృష్టి క్రియా
నిరతుండూర్జిత జీవకారణుఁడు వాణీప్రాణనాథుండు - తా
మరసాసీనుఁడు బ్రహ్మయే సవన సంపత్కర్తయం చెన్నఁగన్ 50

స్మరునింగాల్చి - పురత్రయంబు నిటల జ్వాలాగ్ని దగ్ధక్రియా
పరతన్ భస్మమొనర్చి - ఈశ్వరత సంపద్దాతయై కాలభీ
కరుఁడై విశ్వజగన్మహాప్రళయ సంకల్పుండు - రుద్రుం - డుమా
వరదుండే సవనస్వరూపుఁడని శైవస్వాములుక్కొక్కఁగన్ 51

శ్రీ రమణీ మనోహరుఁడు చిన్మయరూపుఁడు సర్వలోక సం
సారి సమస్తపోషకుఁడు సద్గుణగణ్యుఁడు వేదశాస్త్ర ని
ర్ధారిత మాధవుండె క్రతురక్షకుఁడంచిత యజ్ఞమూర్తి ఆ
ధారుఁడు యాగకర్మకని తారువచించిరి వైష్ణవాగ్రణుల్ 52

తమ దేవుని గొప్పతనం
బమితముగా నుతియొనర్చి యావలఁబరదై
వములను దెగడుచు నవమా
నముగాఁ బలుకం దొడంగి రహమహమికతోన్ 53

కలహంబు మనలోనఁ గల్పించిపోయె నా
దేవమౌని యటంచుఁ దిట్టువారు
ఇట్టి సందేహంబుఁ బుట్టించి బుద్ధికిఁ
బదను వెట్టె నటంచుఁ బలుకువారు

ఇష్టి మంత్రములాపి ముష్టియుద్ధమునకై
ఢాక నత్యుద్ధతిఁ దూఁకువారు
విమల మంత్రోచ్చారణముమాని శాస్త్ర వా
క్యములు ప్రమాణంబులనెడువారుఁ
బరులపై స్రుక్కులు విసరివైచువారుఁ
బరమ యజ్ఞాగ్ని కాష్ఠముల్ పట్టువార
లగచుఁ గలహంబునకు దిగి మిగులఁ బంత
ములకుఁ బోయిరి యచ్చటి మునులు ఘనులు 54

మౌనులయందుఁ గొందఱు సమర్థులు వారల మందలించి "వి
జ్ఞానులు ధర్మవేత్తలు వికారవిదూరులు శాస్త్రపండితుల్
ధ్యాన నిమగ్నచిత్తు లవధానులు మీరలె పామరాళిగాఁ
బూని చరింప మిమ్ము నగిపోవరె? నల్వురుఁ బ్రువ్వదిట్టరే? 55

తగునా నారదమౌనిఁ గూర్చి యిటు నిందా వాక్యముల్ పల్కఁ? నె
న్నఁగ సత్యంబు నెఱుంగ నిట్టియను మానంబెంతయోమేలు - లే
కగునే యెన్నిక? యిన్నినాళ్లు మన కీ యాలోచనల్ తట్టెనే?
ప్రగతింజెందఁగ శోధనంబుచిత మార్గంబంచు లోనెంచరే? 56

సత్త్వరజస్తమోగుణ విచారమొనర్చిన సత్త్వమొక్కటే
తత్త్వము - దాని నెవ్వరుఁడు తాల్చునొ యాతఁడె దైవ - మట్టి ధీ
మత్త్వముతోఁ ద్రిమూర్తులను మాన్యుఁ డెవండొ యెఱింగి భక్తి సం
పత్త్వముమీర సర్వము సమర్పణఁ జేయుటయుక్తమౌఁగదా! 57

ప్రియమెసఁగన్ త్రిమూర్తులఁ బరీక్ష యొనర్చు సమర్థుఁడెవ్వఁడో
నియతి యొనర్పుఁ డా తబిసి నేర్పున వారలఁ దారతమ్య ని
శ్చయమునవచ్చుఁగాక అల సత్యవికుంఠ పురారి లోక సం
చయమునకేఁగి తద్విషయ సార మపార మెఱుంగుఁ గావుతన్ 58

అనుచు మహాత్ములైన మును లా నియమం బొనరింప నందఱున్
మనముల సంతసించి" కడుమంచి యుపాయము కాని యెవ్వరీ
పని నొనరించువారు? నిరపాయతఁ గార్యముఁ దీర్చివచ్చినన్
ఘనత వహింత్రు పిల్లిమెడ గంటను కట్టెడు వారలెవ్వరో? 59

అంతటి గొప్పవాఁడు మనయందు నెవండొ యటంచుఁ గన్నులం
దెంతయు వత్తులుంచుకొని యీక్షణసేయుచు దీర్ఘయోచనా
క్రాంత మనస్కులైన మునికాంతుఁ డొకండనె" ఈ భృగుం డవి
శ్రాంత తపోధనుండు గుణరంజిత లోకుఁడు జ్ఞానవార్ధియున్ 60

కావున నీ మహాప్రముఖ కార్యమొనర్పఁగ భార్గవాన్వయా
శా విపులైకకీర్తి స్తనశల్య పరీక్ష యొనర్చి నెమ్మి యీ
మూవురు మూర్తులందు మొగమోటములేక యెవండు సత్త్వ సం
భావితపూర్ణ మూర్తియగు వానిని జానుగ నిర్ణయించుతన్ 61

దానలభించునెల్లఱకుఁ దత్త్వ వివేకము - మౌననిర్మల
ధ్యాన ఫలంబుచేకురు - సదా మనజీవన లక్ష్యమాత్రకతు
జ్ఞానము పక్రమించుఁ బరగమ్య పథంబునుగూర్చి స్పష్టమౌ
ప్రీణనమార్గమొండు కనుపించును కోర్కులు పల్లవింపఁగన్" 62

మేలు మేలటంచు మిన్నుముట్టఁ జప్పట్లు
కొట్టిరపుడు మునుల చట్టులెల్ల
భృగు మహర్షి గుండెఁ బెద్దరాయివడంగ
మంచి చెడ్డ లిట్టు లెంచె నతఁడు 63

"గాటఁపు నిప్పుతోడఁ జెలగాటముకాదె త్రిమూర్తులన్ జగ
న్నాటక సూత్రధారుల గుణంబుల నిట్లు పరీక్షసేయ నా
పాటవమెంత? చేసిన తపంబదియెంత? తలంప యింత కే
చేటు ఘటిల్లునో మదినిఁ జింతయొనర్పఁగ భీతి కల్గెడిన్ 64

ఆకులు కందమూలములె అన్నముగా విపినంబెయిల్లుగాఁ
జేకొని ముక్కుమూసికొని సేఁగి సహించి తపించు మౌనులే
డా? కఠినైక కార్యకరణాద్భుత నిర్భర శక్తియేడ? ని
ర్మోకత ఱోఁట శీర్షమిడి రోఁకటిపోటున కేల జంకఁగన్? 65

ఐనను మౌనిరాట్ప్రముఖు లందఱు నిట్టె సమున్నతాసనా
సీనునిఁ జేసికొల్వ నిరసించుట పందతనంబు - మందుఁడై
ప్రాణములన్ ధరించుకొని వందయుగంబులు నిల్చుకంటె వి
జ్ఞాన యశస్సులన్ గొలఁది కాలమె యున్నను లోపమున్నదే? 66

కాన మదీయ బుద్ధిబల గంధము సోఁకి దిగంతవారణ
శ్రేణి కపోలపాళి మదసిక్తపు వాసన మాసి సౌరభ
శ్రీ నిలయంబు గావలె ధరిత్రి మునీశ్వర ధైర్యసార సం
ధానిత కార్యశక్తికి నుదాహృత సాక్ష్యము కావలెన్ సుమా! 67

ఎన్నికకెక్కలేని కతలేఁటికి మాటికిఁ ద్రవ్విపోయఁ గా
నున్నది కాకమానదు - మహోన్నత కార్య ఘటైకశక్తి సం
భన్నుఁడు దైవ - మాయన భుజంబులపైననె భారముంచి యే
మున్ను నిమిత్తమాత్రముగఁ బూరుష యత్నము నాచరించెదన్" 6

అనుచు నిర్ణయించి అనువైన సుముహూర్త
మందు యానమునకు నఖిల కార్య
ములను సిద్ధపఱచి మునుల కెఱింగింప
వారు భృగుమహర్షిఁ బ్రస్తుతించి 6

ఎన్నో విధముల గుణ సం
పన్నునిఁ దత్త్వ విషయ ప్రపన్నునిఁ దేజ
శ్ఛన్నుని సేవించి కడుఁ బ్ర
సన్నునిఁ జేయంగ నతఁడు చనె శీఘ్రముగన్ 7(

శారద వెంతనుండి శ్రుతిసారము వీణియ మీఁదఁబాడ బృం
దారక సిద్ధ కింపురుష తాపస ముఖ్యులు చుట్టుఁగొల్వ - బం
గారపు గద్దెపై జలజగర్భుఁడు నిర్భర వైభవోన్నతో
దార విచారుఁడై శ్రుతిహితంబుగఁ దత్త్వముపన్యసింపఁగన్ 71

ఒడలెల్లఁ జెవులు మొలిచిన
వడువున వినుచుండి రచటివారలు శ్రద్ధన్
గడువడి నా సమయంబున
అడుగిడె భృగుమౌని సభ నహంకృతి తోఁపన్ 72

ఆ విధిఁ జేరవచ్చి సభనంతయుఁ దేఱియు పారఁ జూచి గ
ర్వావృత బద్ధ మత్సరత నంబుజసూతికి మ్రొక్కకుండఁ దే
జోవలయైక హేమ మణిశోభిత పీఠమలంకరించి రా
జీవ భవున్ రవంతయును జీరికిఁ గైకొనకుండె మానియై 73

ఆ యమి రాకకున్ మిగుల హర్షము నందిన దేవమౌను లీ
హేయ విధానవర్తనకు నెంతయు రోసి - యిదేమి ధాతకున్
జేయఁడు వందనం బితని చేఁతలు రోఁతలు నీతిబాహ్య దో
షాయిత మూర్తియన్ గుసగుసల్ జెలరేఁగె సదస్య సంతతిన్ 74

అత్తఱి నీరజగర్భుఁడు
చిత్తంబునఁ గనలి కనులఁ జిటపట నిప్పుల్
గుత్తులుగా దొరలఁగ ముని
సత్తము భృగుమౌనిఁ జూచి సరభసవృత్తిన్ 75

"ధర్మాధర్మ వివేక శీలుఁడవు విద్వన్మౌళి వుద్యత్తపో
మర్మజ్ఞుండవు మౌని మండల సభామాన్యుండ వంచెన్నితిన్
దుర్మార్గస్థితి సంచరించి చెడుబుద్ధుల్ పెల్లుబ్రేరేప దు
ష్కర్మాధీనుఁడవౌట నేరను భృగూ! గర్వంబు మేల్గూర్చునే? 76

నా వంశంబునఁ బుట్టి యిట్లు పరువున్మర్యాదఁ బ్రోఁద్రోఁచి యీ
దేవ బ్రాహ్మణ సిద్ధ కిన్నర మరుత్తిగ్మాంశువుల్ కొల్వ న
న్నావంతైనను లెక్కసేయ కొక సాష్టాంగంబె కావింప కీ
ఠేవన్ ఠీవిగఁ గూరుచుండఁ దగునే? డీకొందువే కొండతోన్? 77

ముగురుమూర్తులఁ జిన్న ముద్దుగుఱ్ఱలఁ జేసె
నానసూయ - తద్భర్త అత్రికంటె
ఇంద్రుని ముష్క విహీనుగాఁ దిట్టిన
తాపసేంద్రుండు గౌతమునికంటె
అంభోధిజలమెల్ల ఆపోశనముగొన్న
మహిమాన్వితుఁ డగస్త్య మౌనికంటె
బ్రహ్మర్షి కులపయోరాశి రాకాశశి
శిష్టసన్నుతుఁడీ వసిష్ఠు కంటె

ఘనుఁడవా యేమి? నీ కింత గర్వమేల?
ఈ సభాస్తారులగు సంయమీంద్రులందు
నెవరికంటెను ఘనుఁడవో? యేటికిట్టి
పొగరు మొగముఁ జూపక పొమ్ము బుద్ధిహీన" 78

అనుచున్ రోసపుఁ బలుకులు
తనువెల్ల దహింపఁ గ్రోధ దర్పితమతియై
మునుమిడి తిట్టెడు బ్రహ్మను
గనుగొని భృగుమౌని కోప కంపిత తనుఁడై 79

"ఏమి! మీరలు సృష్టికర్తలు కదే ఈరీతి సామాన్యు ల
ట్లే మేమో పలుకంగ భావ్యమె? జగంబే మీ యధీనంబు మీ
కీ మాత్రంబు రజోగుణంబు తగునే? యేనన్య చిత్తుండనై
స్వామీ! వందన మాచరింప క్షమియింపం గూడదా? పెద్దలై 80



మౌనిని వందనంబిడని మాత్రన గొప్పతనంబు తగ్గెనే?
మానిత మౌనె యీ దురభిమానము? శాంతి సహిష్ణుశీల సం
త్రాణ చరిష్ణువుల్ తలఁ తురా పరపూజన గౌరవంబు? సం
దానితమౌ పొగడ్తలకుఁ ద్వాదృశులేఁటికి బాధనందఁగన్ 81

పుట్టితి దానవాంతకుని పొక్కిలి తమ్మిని - నాల్గు వేదముల్
పుట్టుట కాస్పదంబయిన మోములు నాలుగు తాల్చినావు - చే
పట్టితి రాణిగా నఖిలవాఙ్మయ దేవత శారదాంబ - నీ
కిట్టి రజోగుణంబు తగునే? మది నించుక యెంచి చూడుమా!" 82

అకట! ఆత్మాభిమానంబ యగ్గలంబు
రాజసగుణ ప్రధానుఁడీ బ్రహ్మదేవుఁ
డిట్టి వానినిఁ బూజింపనేల ధాత్రి?
జను లనుచు భృగువీరీతి శాపమిచ్చె 83

"నీకుఁ బూజలు లేకుండుఁగాక పృథ్వి
నీకు యజ్ఞఫలద శక్తి లేకయుండు
నది చతుర్ముఖ పారాయణాఖ్యఁదనరుఁ
బాప జుష్టమౌ ఒక యాట పద్మగర్భ! 84

ఇఁకఁ గైలాస నగంబుఁ జేరఁ జని గౌరీశున్ మహాదేవు ద
ర్పక హారిన్ గని తత్ప్రవర్తన గుణ వ్యాపారముల్ లోక ర
క్షక వృత్తంబు లెఱింగి ముజ్జగములన్ జాటింతు లేకున్న నా
సకలాయాసము యత్నమున్ బ్రతినయున్ సార్థక్యముం బొందునే? 85

వ॥ అని భావించి భృగువంశ వర్ధనుండు సమర్ధంబులైన గమనంబులఁ బ్రమథ గణావాసంబైన కైలాసంబు ననాయాసంబుగాఁ జేరి శివధ్యాన పరాయణ పారీణులైన నందీశ్వర భృంగీశ్వర చండీశ్వరుల సందర్శించి జప నిమగ్న మానసులైన యగ్నికల్పులఁ బ్రమథుల వీక్షించి ముందునకు సాఁగె. ఆ రజతాద్రిపై శివ పంచాక్షరీ మంత్రయుతమైన ప్రణవనాదంబుతప్ప నన్యంబు విన్పింపదయ్యె. అందులకు ముగ్ధుండైన మునినాథుండు శివ మందిర ప్రాంగణంబుఁజేరి. 86

కావలి వారి మోముల నెగాదిగఁ జూచుచు "నోయి! అద్రి పు
త్రీ వరదుండు - లోకముల దేవర యేమియొనర్చుచుండె? నేఁ
దీవరమైన కోర్కిఁ జనుదెంచితి వారినిఁ జూడ" నన్న సం
భావన మీర వారు మునివర్యునికిట్లని చెప్పి రింపుగన్ 87

ఇదె యేకాంత విలాసమందిరము నం దీశానుఁ డానంద సం
స్పద శృంగారవతీ సతీ సుఖరతిన్ మత్తిల్లి వర్తించు - నీ
యదనన్ దర్శన మాచరించుట అసాధ్యం బేరికిన్ గాన ఓ
త్రిదశారాధిత పాదుకా! భృగు మహర్షీ! రాగదే! పిమ్మటన్ 88

ఆ మాటల్ విని మౌని మంచి సమయం బయ్యారె! చేకూఱె నిం
కేమాత్రం బవకాశమున్ విడువరాదిప్డంచు - సత్యార్ధ ధు
గ్ధీ మత్త్వంబున లోనికేఁగెఁ బరుఁడేతేరన్ భయభ్రాంతయై
హైమాద్రీశ ననుంగుపట్టి చనె లజ్జాధీనయై లోనికిన్ 89

ఆదిగని ఈశ్వరుండు చటు లాగ్రహ విగ్రహ నిష్ఠురోగ్రుఁడై
పొదలెడు రుద్రభావమున "మూర్ఖుఁడ! యొంటి వివిక్తదేశమం
దుదిత సుఖానుభూతి జగదూహలు వీడియసంగ సంగరో
న్మదులగు దంపతుల్ మెలఁగు మందిర సీమఁ జొరంగవచ్చునే? 90

సదమల ధాతృవంశమున జన్మము నందితివంచు గౌరవా
స్పద విలసన్మహా తపము సల్పితివంచును బుద్ధిశాలి వం
చుదిత మహత్త్వవర్తన మహోన్నత శీలుఁడ వంచు నెంచితిన్
విదితములయ్యె నీ కలుషభీషణ వృత్తము లేమి చెప్పుదున్? 91

అరయన్ బెద్దవు వేదశాస్త్రనుత ధర్మాధర్మ సూక్ష్మార్థ సా
గరమున్ బుక్కిటఁ బట్టినాఁడ వతి సౌఖ్యంబెంచి యేకాంత మం
దిర సీమన్ విహరించు దంపతుల సాన్నిధ్యంబు నొందంగ ము
ష్కర కార్యంబని తోఁపదో? దురిత దుష్కర్మంబుగా నెన్నవో? 92

వెరవిడి సిగ్గుచేటుగద వీనుల వింటిమె యిట్టి చేష్టలం
బరువును గంగలో గలిపి మస్కరివారమనంగ ఇంగితం
బెఱుఁగనివారుగా జగతి నిప్పుడు చాటితి దుర్విదగ్ధ! నా
నిరుపమ శాపవజ్రహతి నీఱొనరింపదె? నిన్ను వ్రేల్మిడిన్ 93

ఐనఁ గృపావిధేయ మతినాఁగితి - నీ ముఖమింత చూచినన్
న్యూనత సంభవించు నిటనుండక ఛీ వెసఁబాసి పొమ్ము కా
దేని నిటాల నేత్రజని తేద్ధ మహోజ్వలదగ్ని కీలి సం
తానము కాల్చు" నంచు జలదధ్వనిఁ బల్కెను రుద్రుఁడుగ్రతన్ 94

"ఎంతటివానికైనఁ దగునే యిటువంటి దురాగ్రహంబు? తా
స్వాంతమునన్ బ్రశాంతముగ భావన సేయఁగలేని యిట్టి దు
శ్చింతుని గౌరవించుటకుఁ జిత్తమువచ్చునె? యంచుఁ బార్వతీ
కాంతునితోడ నిట్లనియెఁ గర్కశతన్ భృగుమౌని ధీరుఁడై 95

ఒక్క సతిన్ శిరంబుపయి నొప్పుగఁ గొప్పున దాఁచియుంచి వే
రొక్క సతీ లలామకు నహో భవదర్ధ శరీరమిచ్చి కై
పెక్కి మదించి మైమఱచి యెప్పుడు తైతక లాడుచుండు నీ
వెక్కడ? దేవదేవుఁడన వెక్కడ? నక్కకు నాకలోకమా? 96

పూసితి వొంటినిండ వెలిబూడిదఁ గట్టితి తోలుబట్టఁ గై
సేసితి వస్థి మాలికలు చేదు భుజించితి పాములన్ మెడన్
వేసి పిశాచ సంఘ పరివేష్టిత తుష్టుఁడవై శ్మశాన సం
వాసిగ సంచరింతు వృషభంబు పయిన్ సతతంబు శంకరా! 97

అఖిల లయ కర్తృ బిరుద మన్వర్థమయ్యె
ముఖ్యముగ నీవు మిగులఁ దమోగుణ ప్ర
ధానుఁడవు గాన నీయందుఁ దగదు భక్తి
వినుత శివనామ మది నేతిబీరకాయ" 98

అని దూషించు భృగూత్తమప్రవరుపై నంత్యతమున్ మండి నె
క్కొని ఫాలాక్షము విప్పెభర్గుఁ డది సక్రోధంబుగా రేఁగి భూ
మి నభోదిగ్వలయంబుఁ గ్రమ్మి జగతిన్ మ్రింగంగ నేతేరఁ బ్ర
మ్మిన భీతిన్ సుర సంఘముల్ వణఁకెఁ గంపించెన్ ధరాచక్రమున్ 99

అరుదారన్ భృగుమౌని సుంతయు భయవ్యగ్రుండు గాకుగ్రుడై
అఱకాలంగల అగ్ని నేత్రము - దురంతాభీల సాటోపుడై
తెలువన్ జిట్చిట భూరిరావము నభోదిగ్వారముల్ నిండ భీ
భరమై మంటలు గ్రమ్మె లోక చయమున్ భస్మంబుగావింపనాన్ 100

భర్గ నిటలాంబ కోద్భూత వహ్నికీల
లడరు భృగుపాద తల నయనాగ్ని శిఖలు
నలమి యితరేతరంబు జల్లార్చుకొనియె
నఖిల లోకంబు లానంద మంది వెలగె 101

అతి తమోగుణ యుక్తుండ వైన నీకు
నుర్విపై మూర్తి పూజ లేకుండు గాక
నేడు మొదలుగ లింగమే నీప్రతీక
యనుచు భృగు మౌని శపియించె నభవునపుడు 102

వ॥ అట్లు శపించి కోపోద్రేక భీషణమూర్తియై 103

అతివేగంబ వికుంఠమున్ దరిసి పద్మాక్షుం బరీక్షించి - మ
త్కృతకార్యంబు సమస్తమున్ మునులకుం దెల్లంబుగా దద్విశి
ష్టతలం దెల్పి పరత్వ నిర్ణయ విధిన్ సల్పంగ యత్నింతు నన్
జతురాలోచన సాగిపోయె భృగువంశ స్వామి నిష్కామియై 104

శ్రీ వైకుంఠము పుణ్యరాశి సుమనస్సేవానముల్లాస ల
క్ష్మీ వాల్లభ్యమనోజ్ఞసుందరము - పుంజీ భూత కోట్యర్కతే
జో విభ్రాజిత దిగ్విలాసము - శ్రుతిస్తోత్రైక పాత్రంబు మం
త్రా విష్కార తలంబుఁ జేరె భృగు వత్యంత క్రియోత్కంఠుఁ డై 105

సార తమంబుగాఁ బ్రణవ సాంద్ర నినాదము పర్వఁగా నహం
కార విదూరు లైన శుచికల్పులు యోగి విపశ్చి దాదిసం
చారము లేఁపు సూప విరజా సరిదూర్మి మృదంగ నాద సం
వారముతో విహంగరుత వైభవ మైక్యముఁజింది క్రమ్మఁగన్ 106

శ్రీ వైకుంఠపురంబు నందు ఫణిరాట్ శేషాహి తల్పంబుపై
సేవాభావ విచారయైన రమ తచ్ఛ్రీపాద సంవాహన
ప్రావీణ్యంబునఁ గొల్వ సత్త్వగుణ దీవ్యత్కాంతి నల్దిక్కులం
దైవారన్ బవళించె శ్రీ హరి జగద్రక్షైక దీక్షారతిన్ 107

తెల్లని కౌముదీ కళల తేజు నడంచెడు పాఁప పాన్పునం
దల్లన వేదముల్ సదమ లాకృతిఁ జెంగట నిల్చికొల్వ - ఉ
త్ఫుల్ల సరోజనేత్రములఁ బొంగు దయారస వార్ధియౌ జగ
ద్వల్లభు విష్ణుమూర్తిఁగని వక్షముఁదన్నఁగ నెంచె నీగతిన్ 108

ఈ వక్షమే కదా యెనలేని సంపదల్
పుట్టించు లచ్చికిఁ బుట్టినిల్లు
ఈ యురంబే కదా యీరేడు లోకాల
రక్షించు సత్కృపారామసీమ

ఈ జొమ్మనవెకదా వారాశి సంజాత
కౌస్తుభ నవరత్న కాంతి తనరు
ఈ యురంబునఁగదా యేఁపారు శ్రీ వత్స
మను పుట్టుమచ్చ దివ్యాంక ముద్ర
కల్ప లతికా ప్రసూన సంగ్రథితమైన
వై జయంతి రాజిల్లు నీ వక్షమందె
భూత ధాత్రీ పరిష్వంగ భోగ్యమైన
తరళ వేదిక యీ భుజాంతరముకాదె 109

వ॥ అని మునికుల నాథుండు తన మనంబున భావించి 110

ఆ యతి సార్వభౌముఁడు మురారి పదాంబుజముల్ మనంబునం
బాయక నిల్పి మిక్కిలి జవంబున వచ్చి యలంకరిష్ణు వి
ష్ణ్వాయత వక్షమందుఁ గఠినార్భటిఁ దన్నెను కోపఘూర్ణ చిం
తాయుత నేత్రయై కమల త త్తర పాటున నేఁగె దవ్వుగన్ 111

తాఁపున కగ్గమై వికచతామరసాంబకు డింత యేనియున్
గోపము నందకే స్మిత ముఃఖుండయి పానుపు డిగ్గి యల్లనన్
తాపస పాద యుగ్మము ముదంబున స్వీయ కరాంబుజద్వయిన్
జాపి పరిగ్రహించి ఋషి సత్తముతోఁ బలికెన్ మృదూక్తులన్ 112

"ధన్యుఁడ నైతినో వినుత తాపస తామరసోదరా! మహా
పుణ్య విచార! నీ చరణపుష్పపరాగ లవంబు సోఁకి నే
మాన్యుఁడ నైతి - లక్ష్మి యసమాన యశోధనరాశియయ్యె నిం
కన్య వచస్సులేఁటికిఁ? గృతార్థతఁ జెందె దిగంత సంతతుల్ 113

తత కఠినంపు మత్తనువు తాఁకుటఁగోమల పల్లవంబునా
నతి మృదులంబు నీదుపదమక్కట! యెంతగ నొచ్చెనోకదే!
యతి వర! నీ పవిత్ర చరణాబ్జము లొత్తెదనిం" డటంచు స
మ్మతి భృగు మౌని పాదములు మర్దనసేయుచు నేర్పు మీరఁగన్ 114

ఆ భృగుమౌని పాదతల మందలి నేత్రము మెల్ల మెల్ల సం
క్షోభముఁ గల్గ నీయక నిగూఢముగాఁ జిదిమెన్ జగత్కళా
ప్రాభవ మిచ్చి పెంచి తుదిఁబాడొనరింపఁగఁ జాలుశక్తి సం
శోభితుఁడీ రహస్యముల చొప్పు నెఱుంగఁడె? మాయఁగొల్పఁడే? 115

ఆ గతినేత్రముం జిదిమి "ఆర్య! త్వదిష్ట మనోగతార్థముల్
నే గమనించినాఁడ గణనీయ తపోధనరాసు లైన మీ
రీ గతి వచ్చి తన్నుదురె యేదియొ హేతువు లేక యూరకే?
రాగ వికార దూరమయిరంజిలు నీజతనంబు పండుతన్" 116

అని పల్కు విష్ణుదేవునిఁ
గని తద్వినయమ్ము నెంచి కడుముగ్ధుండై
"ఘన సత్త్వగుణ విశిష్టుఁడు
చను నితఁడే దైవ మనుచుఁ జాటింపంగన్" 117

అని భావించి "రమావధూహృదయ నాథా! దివ్యగాథా! నినుం
గనఁగా నేరవు వేదముల్ మునులు దిక్కాలంబులున్ దివ్యులున్
జనునే యిట్టి పరీక్ష నీకు? జగముల్ సర్వంబు నీ రూప మం
దు నడంగున్ బొడసూపు నందె పొదలున్ దుర్భేద్యమాయాగతిన్ 118

పరమాత్మా! నినుఁ దన్ని పాప పదవీ పట్టాభిషిక్తుండనై
దురితాచార మదోద్ధతుండ నగుచున్ దుర్వార దుఃఖాబ్ధిలో
దరియుండాంకయు లేక చీఁకటి గుహన్ దారాడు నంధుండు గాఁ
దిరుగం జొచ్చితి వేదనామయ చిరార్తిన్ బాప ఘోరాటవిన్ 119

ఏ యే పూజల నాచరింపఁదగు? నే యేపున్నెముల్ సేయనా?
ఏ యే దేవతలం భజింపఁదగు? నెట్లీపాప మీ జన్మలో
బాయంజాలుదు? మత్సమార్జిత తపోభాగ్యం బయోగ్యంబుగా
నా యీ సర్వముఁ బాడుసేసెనకటా! నానాదురం తార్థమై" 120

అని పాదాబ్జములంటివేడు భృగు వంశాబ్ధీందు నింజూచి మ
న్నన "వత్సా! సకలం బెఱుంగుదును చింతంబొంద నీకేల? యీ
యనుతాపంబును మాను మెట్లయిన నీయందింత దోషంబులే
దనఘా! మౌనులు పంప వచ్చితివి సత్యాన్వేషణోత్సాహివై 121

అనువగు శుభములు పొనరుతఁ
జనుమిఁక" యని హరి యనుపఁగ సరసత వరలన్
దనియుచు భృగుముని రయమునఁ
జనియెను చిత్త ప్రశాంతి సమకూరంగన్ 122

కదలి భృగుమౌని చేరి గంగాతటమ్ము
యజ్ఞ దీక్షిత స్వాంతసంయముల కెల్ల
నఖిల విషయముల్ వివరించె హరియె దైవ
మనుచు నిర్ణయించిరి నిశ్చలాత్ములగుచు 123

యజ్ఞపురుషుండు పరమాత్మ హరియటంచుఁ
దత్ఫలంబు విష్ణువునకుం ధారవోసి
వేడ్కఁ యజ్ఞాంతమం దవబృథ మొనర్చి
శాంత చిత్తులై యుండిరి సర్వమునులు 124

## సోపానాంతము

పరమ మునీంద్ర వందిత శుభప్రద పాద పయోజ! హృద్గుహాం
తర రవికోటి తేజ! మమతారహితాచ్ఛ కృపావిరాజ! ని
ర్భర సముదీర్ణశక్తిసముపార్జిత నిర్మల నిత్యపూజ! వి
స్తర కరుణా కటాక్ష రుచి సంభృత సుందర నేత్ర పంకజా! 125

సకలలోక పాలనా! ప్రశస్తసృష్టి ఖేలనా!
సుకృతిమార్గ రక్షణా! విశుద్ధ సౌమ్యవీక్షణా!
ప్రకట దుష్టశిక్షణా! ప్రపన్నదోష మోక్షణా!
ప్రకృతి రూపభావనా! ప్రపంచ మానవావనా 126

హరకేశవ శక్తిత్రయ
పరమ సమాహార రూప! ప్రజ్ఞాదీపా
దురితాపహృత కలాపా!
అరిరాట్ హరణప్రతాప! అక్షరచాపా! 127

# పద్మావతీ శ్రీనివాసీయము
## ద్వితీయ సోపానము

శ్రీ యంజనాద్రి నిలయా!
శ్రేయః ప్రదరమ్య దివ్య దృష్టి విధేయా
మాయావ తీర్ణ విషయా!
గాయత్రీ పూర్ణరూప! గరుడాద్రి నృపా 1

అవధరింపుము 2

"ఆ తదుపరి వృత్తాంతముఁ
జేతో మోదంబెసంగఁ జెప్పుడు స్వామీ!
శ్రీ తరుణీమణి కోపం
బే తెఱఁగునఁదీర్చె విష్ణు - వేమయ్యెఁదుదిన్?" 3

అని వినయ తరంగిత నవ
మనోబ్ధులై భక్తితో నమస్కారంబుల్
తన కొనరించు తపోధన
గణమును వీక్షించి జ్ఞాన ఖనిసూతుండున్ 4

ఆవలి గాథ నిట్లు వివరింపం దొడంగె 5

హరి వక్షస్సరసీజము
వరియించి వసించు పద్మవాసిని మౌనీ
శ్వరుఁడగు భృగు పద తాడన
మరతిన్ భరియింపఁబోక ఆగ్రహ మతియై 6

వ॥ పెనిమిటి సమీపంబునకుంబోయి వెచ్చని నిట్టూర్పుల
నాసాపుటంబులు చలింపఁ గట తటంబులదుర నెదుట
నున్న శ్రీ మన్నారాయణుం గాంచియిట్లనియె 7

"స్వామీ! ఆ భృగుమౌనికింత పొగరా? సర్వ ప్రపంచైక ర
క్షా మందారులటం చెఱింగియును లక్ష్యంబింత లేకుండఁ గ
ట్టా! మన్నింబయి మిన్నెఱుంగక వితండ స్ఫూర్తి వర్తించె ఆ
అమేపాటిది? యేమి చూచుకొని యా యాటోప మార్భాటమున్? 8

అది యటులుండ నిండు మరియాద నెఱుంగని ధూర్త వర్తనుం
డదయుఁడు - వజ్రి శర్వ జలజాసన ముఖ్యనిలింప పూజనా
స్పద మగు మీ యురంబు నిజ పాదహతింగడు నొవ్వఁజేయఁగన్
బెదవిని విప్పి కోపపడ నేరక - పై నతనిన్నుతింతురే? 9

భృగువట కన్నుమిన్నుఁ గన కిట్టులు బిట్టుగ నన్నుఁ దన్నఁగా
బిగువును బింకమున్ సడలి ప్రేమ వహించి తదీయ నీవప
ద్యుగమును హస్త పద్మముల నొత్తుచు నిచ్చక మాడినట్టి మీ
తెగువయు నాటకంబులును దెల్లములయ్యెఁగదా! హృదీశ్వరా! 10

మగఁడు రక్షించు నని నమ్మి మగువ మదిని
అట్లు కాకున్న దిక్కేది అబల? కైన
నబల కాదాడుది సబల యనుచు ఋజువు
చేసెద భృగుని నాశంబుచేసి - చూడు" 11

ఈ విధి నెగ్గులాడు జగదీశ్వరి భార్గవిఁ జూచి మందహా
సా వృత సుందరేందుముఖుఁడంబుజ నాభుఁడు పల్కె "దేవి! యి
ట్లీ వినరాని వాక్యముల నేఁటికిఁ బల్కె దరాతి కైనఁ గీ
డీవు సహింప నేర్తువటె? యెల్లరు బిడ్డలు గారె నీ కౌగిన్? 12

ఆతఁ డనన్య సాధ్యమగు నద్భుత కార్యముఁ జేయఁబూని ని
ర్భీతి మదీయ వక్షమును పెల్లనఁదన్నెను కాని నాకు సం
ప్రీతి ఘటించు భక్తుఁడు వివేక సమేతుఁడు జ్ఞాని బ్రహ్మ సం
భూతుఁడు వాని చిత్తమునఁ బొంగెడు భావ మెఱుంగవే? రమా! 13

జలజముఖి మనోవాక్కాయములను మనసె
ముఖ్యమై యుండు నాతని ముగ్ధ భక్తి
గ్రాహ్యమే కద - దైహిక కర్మమునకు
నలుగ నేల మనోనిష్ఠ నరయ కుండ? 14

అతని హృద్గత వృత్తాంత మవగతమ్ము
నాకు - గర్వం బెడద లేదు గాక లేదు
తల్లి పిల్లల బాధింప ధర్మమగునె?
భక్త జనులను శిక్షింపఁ బాడియటవె? 15

కావునఁగోపము మానుము
భావంబున శాంతినొంది ప్రమదా! ప్రమద
శ్రీ విధి నెప్పటి వలెనే
కావింపుము నామనంబుఁ గౌతుక పదమున్" 16

మృదులామోద సుధానయోక్తుల మగండీరీతి నోదార్ప నె
మ్మది శాంతింపక లక్ష్మి క్రోధమున "దుర్మార్గుండు తన్మాని దు
ర్మదు శిక్షింపక యున్న నింకొక ముహూర్తంబున్ వికుంఠాన నే
బ్రదుకన్ సాధ్యమె? మీకు నాకుఁగల సంబంధంబు లీపాటివే? 17

ఇంత జరిగిన తర్వాత నేమొగంబుఁ
బెట్టుకుని పెత్తనము సేయ వీలు కలుగు?
నిత్యమును నాదు కనుసన్న నిలిచికొలుచు
సుదతుల మొగంబులేనెట్లు చూతుఁ జెపుమ 18

మగఁడు ముండ యనుచుఁ దెగనాడ వచ్చిన
ముష్టి వాఁడు గూడ ముండ యనఁడె?
కట్టుకున్న తాలి గరువంబు గంగలోఁ
గలిపి నపుడె కూలుఁ గాఁపురంబు 19

మగఁడు కొట్టెనేని మగనాలు సైరించు
సవతి యెత్తిపొడుపు సైపఁగలదె?
లేకి పాటుఁగన్న వైకుంఠ లోకంబు
కోడియై నిగిడ్చి కూయకున్నె? 20

పటు సామర్థ్య విహారి యైన పతితో వర్తించు సాధ్వీమణిన్
జటిలుండొక్క పరాయి పూరుషుఁడు తన్నన్ భర్త సైరింప న
క్కట! ఆ నాతికిఁ బ్రాణమేల? తను సౌఖ్యం బేల? యిల్లేల? ము
చ్చట లేలా? ధనమేల? రాజ్యపదవీ సౌభాగ్య మేలాయిఁకన్? 21

మోసము వచ్చె నొక్కముది మూర్ఖపు బాపని వెట్టి భక్తికిం
దాసుఁడ వైతివే? వికచతామరసేక్షణ! యింక మీఁద నా
వాసియు వన్నెయుంజెడ భవత్పద దాస్య మొనర్పఁబాడియే?
వే సెలవిమ్ము బంధమును వీడ్చి యథేచ్ఛగఁబోయి వచ్చెదన్ 22

అరరే! భూమిసురాధముండొకరుఁ డిట్లాహా! వియోగంబుఁ జే
క్కురఁజేసెన్ మన - కింత నుండి బహుధా క్రూర క్రియా మగ్నమై
పర ధర్మంబు పరిగ్రహించి - చదువున్ వ్యాపారముం జేసి - దు
ర్భర హింసాధృతి వేద దూరముగ విప్రశ్రేణి జీవించుతన్ 23

ఇల్లు జరుగక భిక్షుక వృత్తిఁదవిలి
బ్రాహ్మణేతర పండిత ప్రవరు లొద్దఁ
జదువు సంధ్య నేరిచి దురాచార గతుల
బ్రతుకుదురుగాక" యనుచు శాపంబొసంగి 24

అవమాన వనధి వీచుల
దవంతయును చిత్తశాంతి దంజిలకునికిన్
ప్రవిమల తపమున శాంతిం
దవులఁగ దవు వీడి పోవఁదలపోసివెసన్ 25

చను లక్ష్మీసతి చుబుకము
గొని మాధవు డంతులేని కూర్మి తలిర్పన్
వినయార్ద్రత బ్రతిమాలిన
వినకుండ హుటా హుటి రమ పృథ్విం జేరెన్ 26

పచ్చని పంటచేలు - వరి పైరులు నీటి కొలంకులున్ గడున్
ముచ్చటఁగొల్పు పుష్ప ఫలపూర్ణమహీరుహముల్ ధరిత్రి వై
యచ్చర ధేనువుల్ దిగినయట్టి తెలుంగు ఘటోధ్ని- గోవులున్
బచ్చిక బీళ్ళతో నయన పర్వముగా ధర విందొనర్పఁగన్ 27

అభ్ర మార్గాన నేఁగుచు నబ్జ నిలయ
దేశములు దాటిచని యాంధ్రదేశ మరసి
అందలి విశేషములఁగాంచి యక్కజముగ
నరిగె ముందున కురుతపశ్చరణ సరణి 28

ఆ వల నోరుగల్లు పురమందు వసించెడు నేకవీర ది
వ్యావసథంబుఁజేరి పరమాదర మారఁగ మాటలాడి సం
భావన చేసికాకతిని వారల వీడ్కొని సాఁగె దివ్య శో
భావహ తాపసాశ్రమము లన్నియుఁ జూచుచు వేడ్కమీరఁగన్ 29

పావన జీవనంబులను బాయని క్రౌంచరథాంగ హంసికా
రావ మనోజ్ఞమై - దివస రాజున కర్ఘ్య మొసంగు భక్తసం
భావిత తీరమై - పరమ వందిత జీవన కృష్ణవేణి వీ
చీ వలయంబులన్ మునిఁగి చిత్త సుఖంబును బొంది నెమ్మదిన్ 30

అరుదుగఁ గృష్ణవేణి తటమందు మహోన్నత శృంగ చుంబితాం
బరమయి - నిర్మలోరు జలపాత మనోహర దృశ్యమాన వి
స్తర తరు వాటికా కుసుమ సౌరభ సంభృత మింద్ర కీలమున్
దొరయుచు నేఁగుచున్ గనక దుర్గమ సేమము నెంచి పిమ్మటన్ 31

రాజులశౌర్య విక్రమత రాజి మహా కలహాగ్ని కీలలన్
దేజముఁగాంచి శాత్రవుల దేశము లెల్ల దహించి ఆంధ్ర వి
భ్రాజిత కీర్తి కద్దమును బట్టిన దిట్టగు కొండవీఁటి సం
పూజిత రాజ్య వైభవముఁ బొల్చెన లారఁగఁ జూచి మీఁదటన్ 32

నగముల్ సాగరముల్ మహానదు లరణ్యంబుల్ జనావాసముల్
దగ దర్శించుచు వాని దాఁటి చని హృద్వాంఛాను సారమ్ము చె
న్నగ గోదావరి తీరభూమి నిలిచెన్ గొల్లాపురం బొద్ద శ్ర
ద్ధగఁ గల్పించెను పర్ణశాలను దపోదార్ఢ్యంబు సాధింపఁగన్ 33

శశి లేనట్టి నిశీధి మాదిరి జలేజ క్షీణ కాసార మ
ట్లశుభాకారత శ్రీ వికుంఠపురి దివ్యత్వంబుఁ గోల్పోయి దు
ర్దశలంగూరె రమామణీ విరహ చింతాక్రాంత చిత్తంబునన్
వశముం దప్పెను విష్ణుమూర్తి - తరుణింబాయన్ శుభం బొప్పునే? 34

జలజాతాసన ముఖ్య లేఖులు మునీశ శ్రేష్ఠు లోదార్ప న
గ్గలమౌ దుఃఖము వీడఁ డయ్యెహరి - లోకవ్రాత సంరక్షణో
జ్జ్వల కార్యంబున నాస్థఁ జూపఁడు సదాజాయా వియోగార్తుఁడై
పలు రీతుల్ విలపింపఁగా దొడఁగె భావం బెల్ల శూన్యంబుగన్ 35

"ఓ ప్రాణేశ్వరి! యెందుఁబోయితివొ? యెట్లున్నావొ? నా విశ్వ ర
క్షా ప్రావీణ్యము నిన్నుఁగావఁగ నశక్తంబైన నాకింక నే
లా ప్రాపంచిక పోషణాదిక విభుత్వార్థూఢి? యిల్లాలి క్షే
మ ప్రాప్తింగన లేనినాఁడు జగతీ మర్యాద నెట్లోమెదన్? 36

తాధూర సంధు లేదఁట
మీఁదట మితిమీరఁధనధు మెడకొౕకడోలా?
నా దారఁగావ లేనఁట
ఏ దారుల లోక హితము నెటురక్షింతున్? 37

క్షణమీ విచ్చట లేక నిల్తునెటు? - వాసంబైన వైకుంఠ ప
ట్టణమున్ సేవక భక్త సంఘము లభీష్టప్రాప్తి నెట్లిచ్చు? లో
చన పర్వంబుగ చూచుటెన్నఁడొ కదే? సంరంభినై వత్తు చం
ద్రనిభాస్యా! శశిరేఖ లేక మనునే రాకాసుధా చంద్రికల్?" 38

అని నానా విధముల వే
దనతోఁబలవించుచున్ సుదర్శన ధరుఁడా
ర్తిని భువికేఁగఁ దలంచెన్
వనితామణి లేని బ్రదుకు భారము కాదే 39

పురి వైకుంఠము పాపతేఁడు విరిపాన్పున్ బక్షిరాట్స్యందనం
బర విందోత్పల భాస్సరోవరము లుద్యానంబులున్ రత్నకం
దర కేళీగిరి కూట కుంజ గృహ సంతానంబులన్ వీడె శ్రీ
తరుణీ తీవ్ర వియోగ దావ పరితప్త స్వీయ దేహాంగుఁడై 40

నిత్య సూరుల ముక్తుల నిజవరూధి నీపతి యగు విష్వక్సేను నిరుపమాన
వైభవంబుల విడనాడి పద్మజాత - విరహ కీలల ద్రగ్గుచు హరి బిరాన 41

చనియెన్ శ్రీహరి శ్రీరమా సతికినై సాంద్రాంధ్ర కారోగ్ర కా
నన భూమిజ గిరీంద్ర సాగర నదీ నానాపుర ప్రాభవా
వని నెల్లన్ బరికించి యామెఁగని తద్వాసంబు నంజొచ్చి యా
మెను బామాలియె భంగమొందె యయునం వెన్వెంట గొంపోవఁగన్ 42

అటులా అభ్రమహాపథంబున నదృశ్యాకారుఁడై యచ్యుతుం
డటవీ సాగర శైలకందర సమీపాత్యంత పుణ్యాశ్రమ
చ్ఛట సందర్శన మాచరించుచు జగత్సౌందర్య లీలామహా
త్కట సంప్రీత మనోజ్ఞుఁడై చనియెఁగాంతా మోహ సందోహుఁడై 43

కతిపయయానముల్ సలిపికాంచె మహాంధ్ర ధరిత్రి సర్వత
శ్చిత జలపక్షి వారిజ విచిత్ర తటాక విరాజితంబు - న
క్షత నవ సస్య శాద్వల విశాల రసాల కిసాలయంబు - ను
న్నత గిరి శృంగ సంగత ఘనాఘన నిస్సృత నిర్ఝరీకమున్ 44

గౌతమి తీర భూధర శిఖానిలయుండయి చెంతమేదినీ
జాతయు లక్ష్మణుండుఁ బరిచర్యలొనర్పఁగ భక్తదేవ భూ
జాతమనంగ సర్వగుణ సాగరుఁడౌ రఘురామునిం గృపా
ధూత సమస్త కిల్బిషుని తోయజనేత్రునిఁగాంచి తృప్తుఁడై 45

తతఁడిడిన వన్యఫలంబు లారగించి
తగిన ఆతిథ్యమునకు మోదంబునంది
"రామ! వనవాస కాలాన రమణిఁబాసి
యావు పడిన బాధల నిప్పుడేనుగంటి" 46



మొవ్వ వృషాద్రిపతి

అని వీచీహత ఘోరపాపనిచయ వ్యాపార సస్యప్రవ
ర్ధన మూలైక జలప్రవాహకలనాధాన్యాగ్రకేదార స
ద్వన కారండవ రాజహంసరుత హృద్య స్పందనాధార పా
వనగోదావరి స్వచ్ఛవార్లహరికా ప్లావంబు నన్స్వస్థుఁడై 46

చని వేగంబున సింహవిక్రమపురీ సామీప్యమం దాగమ
ధ్వని సంవ్యాప్త దిగంత - సాధుజనతా భావోపమోత్తుంగ పా
వన సద్భంగ - పవిత్ర మజ్జన కృతవ్యాపార సంరక్షణో
ద్ఘన భావామలినాంతరంగను గనెన్ గంగాభఁబెన్నా నదిన్ 47

ఆ తీరంబున శ్రీధరాసతులతో నానంద నిర్మగ్నుఁడై
ప్రాతిన్ దెల్గు ధరిత్రి నేలుచు సదావందారు మందారమై
ధూతాఘుండగు రంగనాథుఁడటఁ బ్రత్యుత్థాన ముంజేయ సం
స్ఫీతామోదత ముచ్చటల్ తడవుచున్ జేతంబు ప్రీతంబుగన్ 48

అచ్చటఁగొన్నినాళ్ళు ముదమారఁగ నుండి రమావియోగమన్
జిచ్చు దహింపఁగా వ్యథఁగృశీకృత దేహ యుతుండు మాధవుం
డెచ్చిన చింత రంగ విభునెంతయు వీడ్కొని తుంగభంగ సం
పచ్చయపూర్ణ స్వర్ణముఖి వైభవముంగను లారఁగాంచుచున్ 49

జలనీడోద్భవ పాదప ప్రమర వేశంతంబు తత్కూల ని
శ్చల నైర్మల్య మనోజ్ఞ సైకతములన్ జ్ఞాన ప్రసూనాంబికా
జలజాక్షీకుచకుంభ సంభృత సుఖస్వైర ప్రచారంబులన్
జెలువారన్ విహరించు శంభుఁగనియెన్ శ్రీకాళహస్తీశ్వరున్ 50

కనుఁగొని యిరువుర మనముల
నెనసిన సంతసము తమక మెసరేపంగాఁ
దని వారఁగౌఁగిలించుచు
ఘన కుశల ప్రశ్నములను గడపిరి యపటన్ 51

అత్తఱి శ్రీ వధూటి విరహ జ్వల నోగ్ర శిఖా కలాప దు
ర్వృత్తిఁ బ్రదగ్ధ మానసుఁడు శ్రీహరి నిష్కళమైన మోముతోఁ
జిత్తము తత్తరింపఁజని శేషగిరీంద్రముఁ జేరఁబోయి పై
నెత్తిన వేసటన్ నిలువనెంచె నొాకించుక కాలమచ్చటన్ 52

శ్రీ ధవుఁడీ విధిన్ భువికిఁజేరి యరణ్య మహీరుహోపగా
క్ష్మాధర కందరాంతర విశాల నికుంజ లతావితాన గు
ల్మాధిగత ప్రదేశముల యందుఁబరీక్షగఁజూచి చూచి ఆ
శాధృతి జారి దుఃఖవివశస్థితి నుండెను చిక్కిశల్యమై 53

పూర్వము వాయు దేవునకు భూరికులాద్రి సముద్రకాననా
ఖర్వమహీజ వల్మీక ముఖస్థితధాత్రి సమస్తభార సం
ధూర్వహుఁడాది శేషునకుఁదోచెవిరోధము - గర్వసాంద్రులై
యిర్వురు 'నేబలాధికుఁడ నేబలవంతుఁడ' నంచుఁ బోరఁగన్ 54

"ఏనుజృంభించి వీచిన నీ సమస్త
జగములును దూదిపింజలై యెగిరిపోవు"
నంచు వాయువు పలుకఁ "దదఖిల వాయు
వులను భక్షింతు" నేనని పలికె భోగి 55

ఆ సమయంబునందుఁగమలాసన మానస పుత్రుఁడాత్మవి
న్యాస మురారినామ భజనామృత గాత్రుఁడు లోకసంగ్రహా
ఖ్యాసుఁడు నారదుండు జగదద్భుత వీక్షణ తత్పరత్వ దీ
క్షాసముదీర్ణ మానసుఁడు క్రన్నన నచ్చటికేఁగు దెంచితాన్ 56

వారల వాదముల్ విని "అవారిత సత్త్వులె మీరలిర్వు రీ
తీరునఁబోరనేల? జగతీహితమెంచి సయోధ్యతో మహా
దారత భూతరక్షణ విధానమునన్ శ్రమియింపు"ఁడన్నఁద
త్సార వచోర్థముల్ శ్రుతిహితం బొనరింపక పోయెవారికిన్ 57

అప్పుడు నారదుండు "వినుఁడంతటి పంతము వీడకున్నచోఁ
జొప్పడు మేరు భూమిధర సూనుఁడొకండు నితాంత సత్త్వుఁడిం
పొప్పఁ జరించు చుండు విపులోద్ధతి - శేషుఁడు వానిఁజుట్టిపైఁ
గప్పి కదల్పరాని విధిఁగట్టిగఁబట్టవలెం బలంబుగన్ 58

అనిల దేవుఁడప్పు డనితర సాధ్యమౌ
తనదు బలము జవము నెనయఁజూపి
పైకి లేపవలయు వడి నాగిరీంద్రమున్
దివ్యశక్తి జగతిఁదేట వడఁగ 59

పర్వతేంద్రు నట్లు పైకెత్త వాయువు
నప్పుడెన్నవచ్చు గొప్పయనుచుఁ
బర్వతమ్మునట్లె పట్టియుంచిన శేషు
నెన్నవచ్చుఁజాల మిన్నయనుచు" 60

అని యా నారదమౌని తెల్పఁగ ననంతాహీంద్రుఁడానంద నా
మ నగాధ్యక్షుని చుట్టిపట్టె బలసంపచ్ఛక్తిఁదీవ్రోగ్రుఁడై
అనిలుండుద్ధతి వీచెఁబాదప కులాహార్యంబులూటాడి బ
ళ్లనఁగూలంబడ రేబవళ్లు జగముల్ కోడాడి భీతిల్లఁగన్ 61

తనపట్టున్ సడలింపకానగము నుద్యద్భీమ సత్త్వంబుతో
నునిచెన్ గ్రక్కదలంగ నీకఫణిరా - జు ద్రేకవిద్రోహ బు
ద్ధిని జృంభించి ప్రభంజనుండు త్రిజగద్దేశంబులున్ దేవతా
గణ మెల్లన్ బ్రళయ ప్రభూతభయమై కంపిల్లఁగా వీచినన్ 62

అపుడింద్రాది సమస్త దేవతలు శేషాహీంద్రు దర్శించి "తీ
వ్రపు మీ పంతము లెల్లలోకముల కుత్పాతంబుఁగల్పించె నీ
విపరీతంబు లనర్థదాయకములై వెన్నంటె - మీరిట్లుచే
యుపనుల్ భావ్యము లౌనె? మీకినుక కిట్లూగింతురే విశ్వమున్? 63

ఆలపోఁతులడరి ఆలమ్ము నొనరింప
నడుమ లేఁగలెల్ల నలఁగి నట్లు
మచ్చరమున మీరు పెచ్చరిల్లుట నేఁడు
మూఁడు లోకములకు ముప్పుమూడె 64

మీరు సమాన వీర్యబలమేళను లిందున సందియంబు లే
దూరక యీరసాన శివమొత్తి చరింపఁగ మేలె? బ్రహ్మ మి
మ్మారకమైన కార్యము వహింప సృజించెన యేమి? స్వామి! దు
ర్వార వివాదమున్ విడిచిపొఁడిఁదలంపుము సూఁ డిదేఁటికిన్" 65

అని ప్రార్థింపఁగృపా తరంగిత మతిన్ వ్యాళాధి నాథుండు తో
డనఁబట్టున్ సడలించె స్వల్పముగఁ - జండ స్ఫూర్తి వర్తించి యా
యనిలస్వామి నగేంద్రమున్ సుళువుగా నాద్యంతమున్ లేపి గ్ర
చ్చన దూరంబుగ సాఁగివైచె నఖిలాశాచక్రమల్లాడఁగన్ 66

అట్టులది వరాహక్షేత్ర మందుఁబడియె
అహికులేశ్వర కరుణా కటాక్ష మహిమ
కాన 'శేషాద్రి' యన నద్ది ఖ్యాతిఁగాంచె
ఉత్తముల పొందుచే కీర్తి యొదవుటరుదె? 67

అట్లు జగత్ప్రసిద్ధంబైన శేషాచలంబుఁజేరి యనంత తల్పుండు 68

తన లక్ష్మి నామజపం
బనిశముఁ గావించుకొంచు నడవుల నెల్లన్
మును కనిన ప్రదేశంబులె
మునుకొని మరల వెదుకంగఁబోవుచు వరుసన్ 69

చని శేషాద్రిని వృక్షగుల్మలతికా సర్వంబు శోధించి - యెంఁ
దును లక్ష్మీసతి జాడ తోఁపక వ్యథా దోదూయ మానాత్ముఁడై
చను భూవ్యోమదిశా విశాలమగు చింతా భూరుహచ్ఛాయఁబ
ర్విన వల్మీకముఁగాంచి యందుఁజొరఁబారెన్ వెన్నుఁడాపన్నుఁడై 70

అప్పుడు నారదుండు చతురాస్యుని పాలికిఁబోయి "తండ్రి! పెం
పొప్పఁగ యుష్మ దాజ్ఞ హరినుర్వి జనింపఁగఁ జేసి నాఁడఁ దా
నిప్పుడొకండు పుట్టవసియించుచు నాఁకటి చిచ్చు వెచ్చునన్
దప్పిక రూపురేకలును దప్పి కడుంగడు జాలిఁగొల్పెడిన్ 71

వ॥ లక్ష్మీనారాయణుల కెడబాటు వాటిల్లినది. లక్ష్మీదేవి కొల్హాపురంబుఁజేరి గోదావరీ నదీ తీర సుమపుంజ నికుంజ రంజితంబగు ప్రదేశంబున నాశ్రమం బేర్పఱచుకొని నేర్పునఁదపంబాచరించెడు. ఎప్పగిదినైన శ్రీమన్నారాయణునకాహారంబుఁ గల్పింపవలయు. వైకుంఠంబు విన్నబోయినది. యజ్ఞ యాగాది క్రతువులు ఫల విహీనంబులగుచున్నవి. అనంతగరుడ విష్వక్సేన ప్రభృతి నిత్య సూరి పరివారంబు తెఱంగెఱుంగక క్రుంగుచున్నది" అని విన్న వించిన. 72

బ్రహ్మ నారదునంపి రజతాచలము చెంత
కరిగె మరాళ వాహనము నెక్కి

శంకరుం డెదురుగాఁ జనుదెంచి జలజసూ
తిని దోడి తెచ్చి యాతిథ్యమిచ్చి

"ఏ యుపద్రవమేని యేర్పడెనా? ముందు
వర్తమానము లేక వచ్చి తనఘ!"

అనుచుఁ బ్రశ్నింపఁగా" అభవ! శేషాద్రి పై
హరి యొక్క వల్మీక మం దడంగి

అన్న పానీయములు లేక అలమటించి
బక్కచిక్కుచునున్నాఁడు - పద్మనిలయ
ధరణిఁగొల్హాపురీ సీమఁదప మొనర్చు
చుండె హరికిప్పుడాహార మొసఁగ వలయు" 73

అని చెప్పంగ నుమాధవుండు జలజాతావాసుతో నందివా
హనుఁడై సాఁగుచు గౌతమీనది సమీపారణ్యభాగాన - నే
ర్పునఁబద్మాసన మందు నిశ్చల తపోరూపంబెసూయామెనాఁ
జను నత్యంత తపోభిరామను రమా సాధ్విన్ విలోకించియున్ 74

“తగునా లోకసవిత్రి! నీకు మరియాదా? మాటపట్టింపు కై
మగనిన్‌వీడి వికుంఠమున్‌వదలి సామాన్యాంగనాభంగినె
వ్వగలం గుందఁగ నేల? నీదయితుఁడోర్వంజాల కత్యార్తుఁడై
పొగులున్ శేషగిరీంద్రమందుఁ బెనుబాముల్ పుట్టసైదోడుగన్ 75

పలుబాముల్ పడుచుండె వ్యర్థముగఁగోపంబూని చేఁజేతఁ బా
లొలుకంబోసినరీతి స్వచ్ఛఫలమట్లొప్పారు సంసార మం
దలుకన్ నిప్పులుపోసికొందురఁటె? అమ్మా! రమ్మక్షుద్బాధతోఁ
గలఁగంబారెడు నీమగండట వియోగప్రోద్భవాగ్నిచ్ఛటన్ 76

నిద్రాహారము లుజ్జగించి మది నిన్నే నిల్పి చింతామన
శ్చిద్రుండై దయనీయ జీవితము కష్టింబొందనున్నాఁడు - ఈ
మాద్రిన్ నవ్వులపాలు చేసితిగదే మా తల్లి! లోకంబునన్
క్షుద్రప్రక్రియ లాచరింతురు కదేక్రోధంబునన్ మానినుల్ 77

కొలఁదిఁదలంప దంపతులకున్ బొర బొచ్చెములంకురింపవే?
కలిఁగిన మాత్రనిట్లు చనఁగాఁపురముల్ నిలువంగ నేర్చునే?
కలికిరొ! మార్గదర్శకముగా జనమండలిఁ బ్రోచు మీరిటుల్
మెలఁగుట కంచెయే పొలము మేయుట వంటిదికాదె? చూడఁగన్” 78

అని బోధింపఁగ భార్గవీ రమణి దుఃఖాక్రాంతయై నీరజా
సన గౌరీశులు వెంటనంటి నడువన్ సంరంభ మేపారఁగాఁ
జనిచోళావని నాధరాజ్యమున సస్యక్షేత్ర కేళీమహా
వనవాపీ మృదు శాద్వలంబుల శుభ వ్యాపారమున్ మెచ్చుచున్ 79

అబ్జగర్భుండు గోరూపమందెనపుడు
దూడయై నిల్చెఁజెంతఁదోడ్తోడ శివుఁడు
పద్మసంభవ గోపికా భామయయ్యె
ఏమి చెప్పంగ నొప్పు నా యింపు - సొంపు 80

గోవత్సాకృతులైన పద్మజ జటాకోటీరు లుత్సాహతన్
వేవేగన్ దనముందు సుందరముగా వేంచేయఁగాగోప భా
మా వేషంబున లక్ష్మి యాపిఱుదనే క్ష్మాభర్త రాజ్యంబునం
బోవంజొచ్చె విశాల వీధుల జనంబుల్ మూఁగి వీక్షింపఁగన్ 81

ఆవిభు రాజధాని పరమాద్భుత దర్శన భోగభాగ్య సం
భావితమైన చంద్రగిరి పట్టణ మందలి రాజసౌధముల్
పావన దేవగాంగజల భంగపరంపర క్షాళితంబులై
వావిరి స్వచ్ఛతేజమున వర్ధిలుచుండు నుషోరుణచ్ఛవిన్ 82

పొలుచు నారాజు ప్రాసాదమునకు ప్రక్క
దారి వెంబడి వేగమవారలరుగ
మేడపై నుండి ఆయావు జాడఁగాంచి
చోళరాజ్య పట్టమహిషి చోద్యమంది 83

రాణి తనప్రాణవిభుఁజోళరాజుఁజేరి
"కామధేను వీ రూపంబుఁగాంచె ననఁగఁ
బొలుచు శబలను విక్రయమ్మునకు నొక్క
కాంత వెసఁద్రోలు కొనివచ్చెఁ గనుమునాథ! 84

అమృతమునకు నుద్దియౌ ఆమొదవుపాల
తోడ నాదిలక్ష్మి కీడగుమన
సుతను పెంచు వాంఛ చొప్పడె" ననరాజు
విలిచెదాని తగిన వెల నొసంగి 85

ధర్మమును నాల్గుపాదాలఁదనరఁజేయఁ
దివిరి యవతరించిన ధర్మదేవతయన
నడరు నైచికిన్ రాజున కప్పగించి
రమ హుటాహుటిఁ గొల్లాపురంబుఁజేరె 86

చోళభూపాలుఁడా యావు సోయగంబుఁ
గాంచి యెదఁజొక్కి మిక్కిలి కరుణఁజిక్కి
దాని పోషణ యందు శ్రద్ధాళువైన
యొక్క గోపాలుఁబిలిపించె నుచితరీతి 87

ఆల మందలు వందలు వేలసంఖ్య
బలిసి విలసిల్లు నాథరావల్లభునకుఁ
గానఁ బ్రత్యేకపాత్ర నీగవిపయస్సుఁ
బ్రతి దినంబుఁదెప్పింప గోపకున కనియె 88

ఓరీ గోపక! నూత్న ధేనువు నిదే యుత్కృష్టమౌ శ్రద్ధ యే
పారన్ బోషణచేసి నిత్య ముదయం బాయావుక్షీరంబులన్
వేరేగిన్నెను పిండితె"మ్మనఁగ "నోపృథ్వీశ! మీ యాజ్ఞ చే
కూరం జేసెదనంచు భక్తిఁదెలిపెన్ గోపాలకుండెంతయున్ 89

అట్లు విన్నవించి యాతండు గోవుల
నెల్లఁద్రోలు కొంచునేఁగె వేగఁ
బ్రతిదినంబు వోలె వడివడి శేషాద్రి
సానుతలములందు వానిమేప 90

అతఁడు గోకదంబముల నక్కడ నొక్కెడ మందవైచి తీ
క్ష్ణాతప వారణంబగు మహా వటవృక్షమునీడ నిద్రవో
నాతెఱఁగెంచి గోవు వెరవారఁగ నాతని కన్నుగప్పి సం
ప్రీతిగ క్షీరధార కురిపించెను శ్రీహరియున్న పుట్టలోన్ 91

తోడమేయు గోవుల తోడ నీడ నాడ
తిరుగులాడిన తెఱఁగున వెఱపు లేక
ప్రతి దినమ్మును పుట్టలోఁబాలుపిండు
ఆత్మవిధి నెరవేర్చెడు నంబవోలె 92

అంతటఁ గొన్నినాళ్ళు చన నజ్జననాథునిపత్ని గోపకున్
జెంతకుఁబిల్చి కోపమున "సేవక! యీ మనక్రొత్తధేను వా
క్కింతయుఁబాలనీయదొకొ? యిచ్చినఁద్రావెదొ? అమ్ముకొందువో?
అంతయుఁదెల్పుమున్నది రవంతయు దాపక రవ్వసేయకే" 93

అని తర్జింప నతండు భీతిఁగొని "అమ్మా! సుంతయేపాపమే
నొనరింపన్ బ్రతిసంధ్య వేళ విధిగా నూధస్యముం బిండఁబా
త్రను జేఁబట్టి యొకొక్క గోవుకడకున్‌రాగా నదేమోయెఱుం
గను జిత్రంబగు రోజుదీని పొదుగాకంపించు శుష్కంబుగన్ 94

చన్నులెండి పొదుగు చప్పనై వ్రేలాడు
వాన "వెలియ" వ్రేలు వారిదముగ
అనుచు నంజలించి ప్రార్థించు గోపాలుఁ
గని నృపాలు నాలు కినుకననియె 9

"ఓరీ మూర్ఖుఁడ! పాఁడియావు కడలేవోపా? లబద్ధాలతో
నీరీతిన్ గికురించుటింక సబబే? నీకంటి కున్మాద పుం
బేరమ్మట్టులు గోచరింతు నాకా? నీ వీరంగముల్ చాలు - పో
పోరా! వంచన యెల్లకాలము జయంబుం బొంది వర్ధిల్లునే? 9

ఇప్పటి నుండియైన అడియిచ్చెడుపాలను వేరుపాత్రతోఁ
దప్పక తెచ్చియి మ్మటులు తప్పిన రాజుకువిన్నవించి నీ
తప్పున కర్హ రీతి ఫలితంబును ముట్టఁగఁజెప్పుదాన నీ
కప్పుడె నిప్పుతోడఁజెలగాటము శాంతి సుఖంబులిచ్చునే?" 9

అని గద్దింపనతండు సాధ్వసముతో ఆపాదమ స్తంబుఁ దా
వణకన్ సాఁగియు వక్త్రనేత్రములఁదోఁపన్ దైన్య - మా ర్తిజ్వరం
బున నల్లాడుచు వెచ్చనూర్చుచుఁగరంబుల్ మోడ్చి "ఓదేవి! మీ
యనుమానంబిది సక్రమం బెటులకాదంచేను వాదింబెదన్? 9

మీరలు పాలక ప్రభులు - మేము త్వదంఘ్రితలంబుచెంత న
వ్వారిగ నూడిగంబు సలుపన్ జనియించిన సేవకప్రజా
వారములోనివారము - భవచ్చటులాజ్ఞనుమీర నేర్తుమే?
మీరిన నింక నొక్కత్రుటి మేదిని నుందుమె? శాంతిఁగందుమే? 99

మీకుంగోపము వచ్చెనా బ్రదుకునన్ మేల్వాళ్ళ కీళ్ళాడవా
మాకున్? దాని నెఱింగి మీ కహితముం బాటింప నూహింతుమా?
వీకన్ కుత్తుకనుత్తరించినను దేవీ! యొండబద్ధంబు నా
వాకుంజెందదు వేయి మాటల నిఁకంబల్కంగ నూల్కొందునా? 100

తరలి ముల్లువచ్చి అరిటాకుపైఁబడ్డ
అరఁటియాకె ముళ్ళయందుఁ బడిన
అరఁటియాకె చిరుగు విరుగదు ముల్లింత
యెట్టులైన మాకె యిక్కటులగు 101

కావునఁగాచి యుండెదను గట్టిగముందిఁకఁదప్పులెన్నకే
బ్రోవుమునన్ను - దోషముల పొందునడంచి కుమారుదిద్దదే
యేవిధినైనఁదల్లి? అనియేఁగి శరీర మదెల్లఁగన్నులై
కావలికాయసాఁగె గిరికానన సీమల గోకదంబమున్ 102

ఎప్పటివిధాన నాధేనువేఁగి పుట్ట
యందు దుగ్ధంబు వర్షింప నరసియతఁడు
పట్టరానట్టి క్రోధంపుఁబట్టులోనఁ
గటములదరంగఁగనుఁగవ కలఁగబార 103

కోపముతోడఁ జేతనొక గొడ్డలిఁగైకొని అంతకాకృతిన్
దాఁపునకేఁగి కామగవి దర్పము గుత్తకుఁగొన్న ధేనువున్
వీఁపునఁజేతి వాటమున బిట్టుగఁగొట్టఁగఁబోవ నడ్డమై
శ్రీపతి వచ్చినిల్చెఁబరసేవలు ప్రాజ్ఞులు విస్మరింతురే

ఆ గోపాలకు ప్రేటుశ్రీహరి శిరం బత్యంత దుర్వారమై
వేగన్దాఁకిన బ్రద్దలయ్యెఁదల - అభీలంబుగా నెత్తురుల్
వాఁగుల్గట్టె నగాగ్రనిర్ఝరపయః పాతంబుగాజారి దు
ర్భాగుండై ధరఁద్రెళ్ళె గోపకుఁడు మూర్ఛాపారవశ్యంబునన్

అంతటధేను వాక్షితిధరాగ్రము నుండి బిరానడిగ్గి సం
భ్రాంతమనస్కతన్ గనుల బాష్పజలంబులు కార్చుచున్ నిజో
దంతముఁదెల్పనా మొగము దైన్యపుముద్దగఁ జోళరాట్సభా
ప్రాంతముఁజేరె బిట్టడలు పాటున నందఱు జాలినందఁగన్

రక్తధార లొడల రంజిల్లి తొలిసంజఁ
దూర్పుకొండవోలెఁదోఁచె గోవు
దానిఁగాంచిరాజు మానసంబు దురంత
వేదనా తరంగ విషధియైన

సేవకు నొక్కనింబిలిచి "శేషగిరీంద్రముఁజేరి వేగ నీ
యావు శరీరమిట్లు రుధిరావృత మౌటకు నేమిహేతువో?
ఆ విధమెల్లఁగన్గొని రయమ్మున ర" మ్మన నాతఁడేఁగి మూ
ర్ఛావశుఁడైన గోపకుని సంభ్రమతంగనెఁబుట్ట చెంగటన్

పొంగి స్రవించు నారుధిరపూరము ధాతుజలప్రవాహ జో
ద్భంగములట్లు పుట్టదరిదాఁపుల ముంచిన సంజవెల్గులం
బ్రుంగిన భానుమండలము పోల్పునఁదోఁచు తదీయసానువె
ల్లంగమనించి యార్తినుదిలంగొని సేవకుఁడేఁగి గ్రక్కునన్ 109

రాజునుగాంచి దుఃఖము కరంబును గ్రమింగుచు "హేతువేమియో
యోజనకందఁబోదు కఠినోగ్రత మారిమసంగినట్లు దే
వా! జవసత్త్వముల్ విడిచియక్కట! మూర్ఛమునింగియున్నవా
డోజచెడంగ గోపకుఁడు నొల్కిన నెత్తుటివాఁగు లోపలన్" 110

అనవిని లబలబ లాడుచు
మనమున దుఃఖంపుమొయిలు మల్లడిగొనఁగా
జనపతి గోవులు మసలెడు
ఘన పర్వతసానువునకు గ్రక్కున నేఁగెన్ 111

వ॥ అచ్చటి సన్నివేశంబును దర్శించి ఆందోళిత స్వాంతుండై చుట్టుం బరికించి తదుత్పాత హేతువెందునుంగానరామిఁదన మనంబున నిట్లని వితర్కించె 112

అకటా! గోపకుఁడేలమూర్ఛిలెనొ? కాయంబందు గాయంబులే
దొకటైనన్ - మరి పుట్టనుండి రుధిరంబుబ్బున్ నదీవీచికా
నికరంబట్టుల చిత్తముత్తలపడున్ నిర్వ్యాజమైయేటికీ
వికటస్ఫోటము కల్గెనో? యనిమనోవిచ్ఛిన్నుఁడై యుండఁగన్ 113

దళమౌ కాటుక కొండపై నరుణసంధ్యాకాంతి సందోహ మ
గ్గలమై క్రమ్మినరీతి శోణితఝరుల్ కాయంబుఁగప్పన్ నిర
ర్గళతన్ శంభుశిరోవతీర్ణ సురగంగాభంగి సాఁగన్వడిన్
వెలికిన్ వచ్చిమహోగ్రుఁడై హరియనెన్ బృధ్వీపుతో నీవిధిన్ 114

"రాజా యెంతటి దుర్మదాంధుఁడవు వైరంబింత లేకుండ నీ
యోజన్ గోపకునంపినాపయివధోద్యోగంబు సాఁగించి నీ
నైజంబున్ బ్రకటించుకొంటివిటు లన్యాయ్యంబుగా ధూర్తుఁడా!
రాజుంజెందవె సేవకుల్ సలుపు దుర్మార్గప్రవృత్తాఘముల్? 115

భృత్యుఁడొనరించి నట్టి దుష్కృత్యమునకు
బాధ్యతవహించి యనుభవింపంగవలయు
ఫలము - కింకరు సన్మార్గపథము నందు
శ్రద్ధతో దిద్దవలయు భూజాని సతము 116

పుడమిఱేఁ డసమర్థుఁడై విడిచెనేని
భటులుజృంభించి ప్రజలను బాధవెట్టి
మీరి వర్తించెదరు - రౌతు మెత్తనైన
హయముమూఁడుకాళ్ళనె నడయాడుఁగాదె 117

కింకరుఁడుసేయు నపరాధపంకమలమి
నృపుని కీర్తికి మచ్చగా నెనయుఁగాన
ఘనపిశాచమవై పోదుగాక యింక"
యనుచు శాపమొసంగె నా అచ్యుతుండు 118

సాఁగిలి చోళభూవిభుఁడు స్వామి పదాబ్జములందువ్రాలి "నా
కీగతి శాపమిచ్చితివి యేయపరాధముఁజేయఁ బుట్టలో
దాఁగితి వంచెఱుంగ - నినుఁదాడితుఁజేయఁదలంపఁ గల్మషో
ద్యోగ మొనర్ప నిట్టినను నూరకశిక్షితుఁజేయఁబాడియే? 119

అతుల దయాపయోధి! నిను బ్రార్థన చేసెదఁగావు" మంచు నా
క్షితిపతి వేడుచున్నఁగని శ్రీహరిసాంద్రకృపామృతాబ్ధియై
యతనినిఁగాంచి యిట్లనె "ధరాధిప! నావచనంబమోఘ - మ
ప్రతిహతశాపమిద్ది - యిది బాపఁగ నేరరు బ్రహ్మ రుద్రులున్ 120

జననాథ! యీ దేహమునువీడి చోళాన్వ
యమున 'ఆకాశరా' జాఖ్యఁబుట్టి
భవదీయ తనుజాత పద్మావతీ దేవిఁ
గల్యాణ మొనరింతు గాకనాకు
స్వర్ణరత్నఖచిత వజ్ర కిరీటంబు
నర్పింతు వతిభక్తి యగ్గలింపఁ
బ్రతి శుక్రవార మా భాసురోష్ణీషంబుఁ
దలఁదాల్తుఁదత్కాంతి దశదిశలను

కనక లహరీ జలస్నానమునఁదనుపఁగ
నేను తొలుదొల్తనేనాఁడు దానిఁదాల్తు
నపుడె నీ పిశాచాకృతి యడఁగు సుమ్మి"
యనుచు శాపాంతము వచించె నసురవైరి 121

అంతట మూర్ఛదేరి వినయంబున గోపుఁడు సాధుసజ్జనా
త్యంతశరణ్యముల్ దురితదారుణమార్గ వినాశగణ్యముల్
శాంతవరేణ్యముల్ మునివిశాల తపఃఫలదానపుణ్యముల్
దాంతి సుపణ్యముల్ హరిపదద్వయి నంటుచు వేడె నీగతిన్ 122

"కన్నులు లేనివానికి జగం బఖిలంబును లేనియట్లే - నా
కన్నులు కానరావిపుడు కంజవిలోచన! గ్రుడ్డినైతి నీ
యున్నత దివ్యశక్తి మహిమోద్భవ మీ నిఖిల ప్రపంచమం
చెన్నఁగలేని మూర్ఖుఁడ నహీన మహాపకృతిం బొనర్చితిన్ 123

కానకచేసినట్టి యపకారము సైపుము - స్వీయపుత్త్రుఁ డ
జ్ఞానముతోడఁ దప్పిదము సల్పి కరంబులు మోడ్వఁగ్రోధముం
బూనునె తండ్రి? నీ సుతుఁడఁబూర్ణదయామతిఁగావు" మంచు బా
ష్పాననుఁడై రమాధవునిఁబ్రార్ధన సేయఁగ నాతఁడిట్లనున్ 124

"ఆవు ధర్మప్రతీక - కల్యాణదాత్రి
అమ్మలేనట్టి పసివారి నాదుకొనఁగ
దైవమంపిన తల్లి అద్దానిఁగొట్టఁ
జేతులెట్లాడెనీకు? దుశ్చేతనమున 125

పూర్ణహృదయ పశ్చాత్తాపమునకు మించి
అన్యమైన ప్రాయశ్చిత్త మవనిలేదు
హృదయ పరివర్తనము నంది యెసఁగుచుంటి
విదియె శాపాంతమనుగ్రహింతు వినుము 126

కొంతకాలంబు చనిన నీకొండమీఁద
నవతరించెద నీవు నన్నరయఁ గోరఁ
గనులు వచ్చును - నీకంతదనుక గ్రుడ్డి
తనము తప్పఁబోదనిపల్కి చనియె స్వామి 127

## సోపానాంతము

నిరత సుజనగణనుతమృదు చరణా!నిర్మల సత్త్వగుణాభరణా!
నిరుపమ జలనిధి సురుచిర కరుణా! నిర్భరవేద శిరోభరణా!
దురితపథవిహరణజనమదహరణా! దుర్దమశత్రు వినాశరణా!
పరమముని హృదయ నివసనకరుణా! వ్యాప్తదిగంతయశస్తరుణా! 128

శ్రీరమణీమనోహర! ప్రసిద్ధఋషీశ్వర వాగ్విచార!వి
స్ఫారితివేదసార! ఖగపాల శతాంగ జగద్విహార! సం
సారసుఖైకదూర! భవసాగర తారణనౌప్రచార! వి
స్తారసుధాయశస్కర! విశాల దయాకర! వేంకటేశ్వరా! 129

దురితహరా! భరితసురా
చరితవరా! సత్పరా! ప్రశస్తకరా! వి
స్ఫురితధరా! ధ్వస్తపరా!
సరసహృదయ సంచరా! వృషగిరీంద్రధరా! 130

# ప ద్మా వ తీ శ్రీ ని వా సీ య ము

## తృతీయ సోపానము

శ్రీ కల్యాణ దయా వా
ర్ధీ! కమలాసన సురేంద్రదేవ వ్రాత
స్వీకృత నతనిజచరణా!
శ్రీ కరదుగ్ధాబ్ధివేశ! శేషాద్రీశా! 1

అవధరింపుము 2

ఆతత పురాణవిషయిక
చాతుర్య సుధీవిశిష్ట చరితున్ సూతున్
బ్రీతి భజించుచుమౌని
వ్రాతంబుత్కంఠతోడఁబరివేష్టించెన్ 3

అట్లు సూతునిఁ జేరి మహర్షి మండ
లమ్ము "మౌనీంద్ర! నీకటాక్షమ్ము వలన
వేంకటేశ్వర గాథలు వినఁగనయ్యె
నవలి కథఁ దెల్పుమయ్య! నెయ్యమున" ననిన 4

సూతమహర్షి యిట్లు వివరింపందొడంగె 5

సనకస నందనుల్ పరమసత్త్వపరత్త్వ మునీంద్ర సత్తముల్
ప్రణవ నిజాకృతుండుఁ బరిపాలితవిశ్వసమాజరక్షకుం
డనుపమ దివ్యశక్తియుతుఁడైన రమాధవుఁజూచువేడ్కఁజ
య్యనఁ జనుదెంచిరార్తి హృదయంబుననిండ వికుంఠసీమకున్ 6

అచ్చట ద్వారపాలకు లహంకృతివారల కడ్డువచ్చి "మీ
యిచ్ఛమెయిం జనందగవె? యిప్పుడు స్వామినిఁ జూడసాధ్యమే?
లచ్చినిఁగూడి వెన్నుఁడు విలాస వినోద వికాస చిత్తుఁడై
ముచ్చటలాడుచుండె నటుపోవఁగరాదు సువర్ణశాలకున్ 7

ఇచ్చటపాసిపొం"డనుచు నెంతయుఁగన్నులఁదట్టు దుర్మదం
బెచ్చఁగ లెక్కలేనితనమేర్పడ మౌనులఁబాయనెట్టి పై
పెచ్చుదురూక్తులాడఁగని భీషణరోషకషాయ నేత్రులై
మచ్చర మావహింపమునిమాన్యులుదగ్ర సమగ్ర కోపులై 8

"ఓరీ! దుర్మదదుష్ట వర్తన దురుద్యోగప్రయోగ క్రియా
ధీరస్వైరవిహారులార! కరుణాధీనుఁడు వేదాంత త
త్త్వారామస్థల శాఖికాపికము సత్త్వారూఢుఁడీ భక్తమం
దారుండౌ హరిద్వార పాలకులుగా దర్పించి వర్తింతురా? 9

ఘన తమోగుణ వర్తనఁ దనరుచుంట
నుగ్రరాక్షసయోనులం దుద్భవించి
లోక కంటకులై పుణ్యలోకములకు
దూరులై పుట్టుఁడవనిపై దూఱువడసి" 10

అనుచు శాపమిచ్చి చనిరి మౌనీశ్వరుల్
ద్వారపాలకులవిధాన మరసి
వారిఁగావనెంచి పరమ దయాళువై
చేరఁబిలిచి శౌరి వారి కనియె 11

"అదరిపాటు తగునెయేరికైనఁగాని
అణఁగి మణఁగి చరించుట ఘనతఁగూర్చుఁ
బెరిగి నిక్కిన తరుశాఖ విరుగుఁగాని
విరుగునే పెనుగాలికి గరికపోఁచ? 12

పరమమౌనీంద్ర శాపంబు వజ్రఘాత
సదృశమదిదాఁట విధికైన సాధ్యమగునె?
ఏఁడుజన్మములందు నాతోడమైత్రిఁ
గలిగివర్తింతురా? లేక గర్వనిరతి 13

మూఁడుజన్మల వైరులై పుడమిఁబుట్టి
జన్మజన్మకు నాచేతఁజంపఁబడుచు
శ్రీవికుంఠపురమ్మును జేరవత్తు
రా? స్వయమ్ముగ మీరెనిర్ణయముఁ గొనుఁడు 14

అనవిని వారలిట్లనిరి "ఆర్య! నినున్ విడనాడిపోయి యే
యనువున నేఁడుజన్మముల అంతరమోర్వఁగ వచ్చు? నామిషా
శనులుగఁ బృథ్విపుద్భవిలి సంగర రంగమునన్ మహాసుద
ర్శనపటుధారలందెగి బిరాననెవత్తుము నిన్నుఁగొల్వఁగన్ 15

అనిన "మూఁడు జన్మలందు నేనేమిమ్ము
సంహరింతునాజిఁ జచ్చిపిదప
శ్రీవికుంఠమునకుఁ జేరరం"డని పంచె
శ్రీధరుండు - విశ్వసేవితుండు 16

జయవిజయుల్ జగద్విభునిసాంత్వన వాక్యములాలకించి య
క్షయ ఫలదంబులైన జలజాక్షు పదాబ్జయుగమ్ముఁగొల్చి ని
శ్చయముగ దైత్యయోనులను జన్మవహింప ధరిత్రిఁజేరి రిం
తియెసుమి దోషకారులకుఁద్రిప్పలు తప్పునె యెంతయేడ్చినన్? 17

ప్రథితముగ హిరణ్యాక్ష హిరణ్యకశ్య
పాఖ్యలు ధరించివారుర్వి నవతరించి
వరబలంబున ఘోరదుర్వారులగుచు
దురితకార్యానురక్తులై పరగుచుండ 18

వ॥ అందు హిరణ్యాక్షుండు దురతిశయ దుర్నిరీక్షుండును, మహా నీలాంజన సదృక్ష విశాల కఠినవక్షుండును, నిరంతరామోఘానూన కల్మషకార్యనిర్వహణ దక్షుండునై భూమినిఁజాపచుట్టఁగాఁ జుట్టి నశింపఁజేయుటకుఁ బూనుకొనియె. అప్పుడు సురసిద్ధసాధ్య యక్ష గంధర్వ ఖచరపన్నగ కిన్నరకింపురుష నాగనభశ్చరాది దేవయోనులు ప్రార్థింప శ్రీమహావిష్ణువు శ్వేతవరాహావతారంబు ధరించి యయ్యసురయుసురులుబాపి భూతలంబును దనకోరపై నెప్పటియట్లనిలిపియుంచె.

ఆ సమయంబునన్ నలువ హర్షముతో మఘవాదినాకసం
వాసులు బాసటై తరలివచ్చిన నెమ్మివరాహదేవునిం
డాసి ప్రసూనపాళి నిబిడంబుగ శ్రావణ వర్షధారగాఁ
బోసి శ్రుతిప్రసంగములు పొంపిరివోవనుతించి యిట్లనున్ 20

"శ్రీ తరుణీ మనోరమణ! శ్వేతవరాహ మనోహరాకృతిన్
భూతలమందు భక్తజనపూజలుగైకొని సత్కృపారతిన్
జేతనపాళికెల్ల సుఖసిద్ధిఘటింపఁగ దివ్యసత్కృతిన్
బ్రీతిగనిల్వు" మంచు నరవిందభవుండు వచించెనమ్రుఁడై 21

"అని హస్తంబులు మోడ్చుధాతవచనం బాలించి పంకేజలో
చనుఁడున్నాడఁట శేషశైల శిఖరాసక్తుండు భక్తాళి కొం
గున బంగారము - మౌనియోగి జనముఖ్యుల్ గొల్వలోకంబులన్
జనితాపారకృపారసార్ద్రమతి దీక్షాదక్షతం బ్రోచుచున్ 22

అని వచియించెడు సూతుని
వినయంబునఁగాంచి మునులు "వీనులు తనివిం
గొనవు హిరణ్యాక్షుఁడు భూ
వనితామణిఁ గొన్న తెఱఁగువచియింపఁగదే! 23

హరిశేషశైల మందున
వరాహ విగ్రహుఁడయి యెటువరలెనో? అహిరా
డ్గిరి తెఱఁగెట్టిదో? విపులత
నెఱిఁగింపుము సూతసంయమీశ్వర!" యనినన్ 24

తృతీయ సోపానము

హరి పాదంబులు మదిలోఁ
దిరముగ నెలకొల్పి తీయతేనియజాలుల్
వరలఁగ సూతుం డీగతి
సరగున విన్పించె విష్ణు సరసకథాళిన్ 25

శ్రీనారాయణ దివ్యనాభి నవనీరేజంబునం దుద్భవం
బై నానాగహనాపగాంబునిధి శైలారణ్యకాసార సం
తానాస్థాన ధరాప్రపూజ్యనయనానందైక సామ్రాజ్య మ
క్షీణజ్ఞానపురస్కృతిన్ నలువసృష్టించెన్ మనస్తుష్టుఁడై 26

ఈవిధి నాదికల్పము రచింపఁగ విశ్వము సృష్టిచేసి సం
భావితసౌఖ్యుఁడై యొకపవల్ చనినంతట దివ్యయోగ ని
ద్రావశుఁడయ్యెబ్రహ్మ - జలరాసులు నింగికిఁబొంగె నబ్జినీ
దేవుఁడు ద్వాదశాకృతుల దీప్తివహించెనుదగ్రతీక్ష్ణతన్ 27

ప్రళయాంభోధర రాజి విచ్చలవిడిన్ వర్షించె ధారాళధా
రల వ్యోమావను లేకమయ్యెఁబటుగర్జాడం బరోదీర్ణఘో
షల నిర్ఘాతనితాంత పాతమున నాశాచక్రమల్లాడె - న
గ్గలమైకార్చిని సుళ్లగట్టెదివి నుగ్రంపశ్య దృశ్యంబులై 28

గాడుపులేఁడు పెల్లడరి క్రక్కదలింపఁగఁగొండపిండుప్రే
లాడెను కందుకప్రతతియట్టులు శూన్యమునందు నాకృతుల్
పాడఱి పంచభూతములు భౌతికరూపముడాచి సూక్ష్మమై
కూడఁగనుండె విశ్వమయగుప్తతమోమయశక్తి యందనన్ 29

ఆ యేకార్ణవతుంగభంగచయమం దాద్యంత మగ్నంబుగా
స్వీయాకారముఁబాసి దిక్కుచెడి పృథ్వీపద్మపత్రాక్షి - దై
న్యాయత్తాత్మతనుండనప్పుడు హిరణ్యాక్షుండు నానొక్కదై
తేయాధ్యక్షుఁడుదగ్రదర్పనుఁడుతోఁతెంచెన్ మహావ్యగ్రుఁడై 30

ప్రతిపదంబున మహాప్రళయాబ్ధి యావర్త
ములుగట్టి కల్లోలములఁ జెలంగ
దంతఘట్టన దిశాతలమెల్లఁగంపించి
భూనభోంతర రటద్ధ్వానమెసఁగ
శీర్షాగ్రనికష విశేష ఘాతముల బ్ర
హ్మాండ కటాహాగ్ర మగిలికూల
బలవదుద్బాహు విస్ఫాలనమ్మునఁదార
కలు దూదిపింజలై గాలిఁదూల

వెడలు నుచ్ఛ్వాస నిశ్వాస వేగవశత
నఖిల కులపర్వతంబులు నల్లలాడ
వచ్చెఁగాంచన నేత్రుం డపారమదవి
ఘూర్ణితాక్షుండు విక్రమోదీర్ణరతుఁడు 31

తల్లీలం జనుదెంచి వాఁ డవనికాంతన్ బల్మిఁజేపట్టి శుం
భల్లక్ష్యంబున నిర్భయుండయివెసన్ బాతాళముంజేరి స
త్సల్లాపంబుల నామెతోఁ బ్రవిమలో ద్యానంబులన్ బుష్పసం
ఫుల్లత్సౌరభ వల్లరీకుటజ సంభోగంబుఁగాంక్షింపఁగన్ 32

రయమెసఁగంగ శ్రీహరి వరాహమహాకృతిఁదాల్చి ఘుర్ఘురా
క్షయభయదోరురావము దిశావలయంబుఁబగుల్పఁబ
ర్యయముగ రోమసంహతి గ్రహంబు లహంకృతిఁదక్కఁకూల ని
ర్భయ పదఘాత వేగమున వార్ధిఘుమంఘుమ సంభ్రమంబుగన్ 33

పాతాళంబునకేఁగి రక్కసు బలప్రౌఢోగ్ర దంతాగ్ర సం
ఘాత వ్రాతముచే వధించి ధరణీకంజాత నేత్రన్మనః
ప్రీతింగైకొని దంష్ట్రికాగ్రములపైఁగ్రీడారతిన్నిల్పి సం
గాతంబొప్పఁగ నామెఁదెచ్చె జగతీకల్యాణ సంధాయియై 34

భూకాంతామణి మీఁదిప్రేమమున నాభోగీంద్రతల్పుండు శ్రీ
వైకుంఠంబు ననాదరించి యిటనేవర్తింపలోనెంచి క్రీ
డా కల్యాణ నగమ్ముఁదెమ్మని బలాఢ్యప్రౌఢు స్వర్ణాద్రి శో
భాకల్పున్ వినతాతనూజుఁబనిచెన్ హర్షప్రకర్షంబునన్ 35

గమనవేగమ్మునఁగ్రమముఁదప్పిసమస్త
విశ్వగోళమ్ములు ప్రీలిచెదరఁ
బక్షమారుత రయప్రవికంపితమ్ములై
దిక్పాల పురములు దిక్కుసెడఁగ
తుండాగ్రహతులవేధోండ కటాహంపుఁ
గప్పెర పగిలిముక్కలుగ రాలఁ
దెరలిన యెసరుల తెఱఁగున సప్తాబ్ధు
లుల్లోల కల్లోలితోగ్రములుగఁ

బర్వతంబులు చిఱుగాలిపటములట్లు
గాలిలోఁదేలియాడ వేగముననేఁగె
వైనతేయుండు బలజవ ప్రాభవుండు
ఘూర్ణితాంబరుఁడురికి వైకుంఠపురికి 36

ఆ వైకుంఠపురాగ్రసీమఁగల క్రీడాహార్యమున్ బాహు శౌ
ర్యావష్టంభమునం బెకల్చి దరహాసాంకూరముల్ కౌముదీ
ధావళ్యంబున మోముచెంగలువకందంబెచ్చ - శైలేంద్రమున్
లీవిన్ వీఁపునఁదాల్చియేఁగె ఖగరాడ్వీరుండు విన్వీథులన్ 37

బంగరు కొండనాఁబరగు పక్షి కులాధిపు ఱెక్కలందు ను
త్తుంగనవాంజనాద్రియనితోఁపనభస్థలినేఁగుదెంచు వా
నిం గని ఖేచరప్రతతి నిశ్చలభక్తిఁగరంబులంబుజా
ళింగికురింపమోడ్చి విరళీకృత సూక్తులఁ బ్రస్తుతింపఁగన్ 38

గరుడుండు దివ్యపుష్కరిణితోఁగ్రీడాద్రి
నభ్రవీధినిఁదెచ్చునప్పుడందు
విహరించు నంచల పిండులు కలగుండు
పడి మింటిదారి నెవ్వడిగమించె
నవవికసన్నలినంబుల నులివెచ్చ
తేనియల్ ద్రావెడు తేఁటిగములు
తామరలన్వీడి దౌదవ్వుపోవుచు
ఝుంకార నాదంబు సవదరింపఁ

బాపదిండి స్వపక్ష విక్షేపరవము
తాళగతికాఁగ వీణియ మేళగించి
పాడుచున్నట్లు శ్రుతి సుఖాపాదకముగ
దివ్యరెల్లరానంద సంభావ్యులైరి 39

ఆకోనేటి జలంబునం గలుగు స్వర్ణాంభోజపాళీరజం
బాకాశోర్వితలంబు మధ్యదళమై వ్యాపించి సంధ్యారుణా
స్తోక భ్రాంతిఁజిగిర్చెఁబైఁడివెలుఁగుల్ తోరంబులై లక్ష్మీ భూ
లోకావాసుల లేమిఁదీర్పఁగరుణాలోలాత్మయై వచ్చెనాన్ 40

చెలులతోఁగూడి జలకేళిసలుపు లక్ష్మి
పసిఁడి వలువల చెఱఁగులు పారుకాడఁ
ద త్తరంబునఁదరుమయ తటముఁ జేరె
మేఘములసోఁకు తొలుకారు మెఱుపువోలె 41

అపుడా ఆదివరాహదేవుఁడు విహారార్థంబు శేషాద్రిపై
విపులంబైతగు ఖేలనాచలముఁదాఁబెట్టించి కోనేటిపా
ర్శ్వపుభాగంబునఁ బశ్చిమంబున మహాప్రాకారముల్ స్వర్ణమం
టప దివ్యాలయగోపురంబులను గట్టంబంచె నుత్సాహియై 42

శ్రీరామామణి నీళయున్ మిగుల సంసేవింప మోదించి భూ
నారీసాధ్విని దంష్ట్రికాగ్రమున సంధానించి, ఆముప్వురన్
గారాబంబున ముద్దుసేయచు జగత్కల్యాణ సంపత్కళా
ధారుండై విహరించుచుండె నవచైతన్యంబు నిండారఁగన్ 43

శ్రీ వరాహస్వామి తావుగావున నద్ది
శ్రీవరాహ గిరిప్రసిద్ధిఁబడసె
గరుడుండు తెచ్చిన కారణంబున నద్ది
గరుడాద్రియనుపేర ఖ్యాతిఁగాంచె
వారాహదేవుకోనేరు కాఁబట్టి వా
రాహ పుష్కరిణినా రాణకెక్కెఁ
గల్మషహరణమై గ్రాలుట నాపుష్క
రిణి విరజానదీ ఘనతమిగిలె
సకలవల్లీనికుంజ పుంజముల తోడ
వివిధ తరుగుల్మ సుమలతావితతితోడ
హంససారసబకనిచయాంబుపక్షి
గణముతోనొప్పు తత్తట కాననములు 44

ఆగహనప్రదేశముల నంగనలన్ ముదమారఁగూడి సం
భోగ సుఖప్రచారముల పూర్ణయుగంబులు లిప్తలైచనన్
భోగికులేంద్ర తల్పమునఁబొందుగ నిల్చినమస్తలోకర
క్షాగుణ దక్షుఁడై యసురసంతతులన్ దెగటార్చుచున్ గడున్ 45

వాసమొనర్చుచుండె సురవల్లభశంకర ధాతృముఖ్యులెం
తేసముదీర్ణ భక్తిఁజనుదెంచి నుతింపఁగ - లోకరక్షణా
భ్యాసకలాకలాప పరిపాలిత సర్వదిగంతరాళహే
లాసముదంచితాప్తివకుళాసతి నిత్యసపర్య సల్పఁగన్ 46

అని సూతమౌని తెలిపిన
విని పరవశమంది మునులు "విశ్రుతవిజ్ఞా
ననిధీ! తత్త్వగుణసుధీ!
వినయవిధీ! తృప్తిఁగొనవు వీనులు మాకున్ 47

ఘనుఁడా శ్వేతకిటీశ్వరు
మనికిన్ వకుళాభిధాన మహిళామణియే
యనువునఁజేరెనా? యేవిధి
ననుదినపరిచర్య స్వామి కనుసంధించెన్ 48

ఎవరామానిని? శ్రీవరాహుసవిధం బేరీతిఁబ్రాప్తించె? ద
ద్వివరంబుల్ వివరంబుగా సకలమున్ విన్పింపవే!" యంచు మౌ
నివరుల్ జ్ఞాన తపఃపరుల్ పలుమరున్ వేడంగ సూతుండు సౌ
మ్యవచోమంద్రగభీర వాక్యముల వ్యాఖ్యానించె నీ తీరుగన్ 49

అనువై ద్వాపరమందు నందుని స్వకీయార్ధాంగి సాధ్వీశిరో
మణి కల్యాణియశోద ప్రాణముగఁబ్రేమంబార శ్రీకృష్ణునిం
గనిలాలించి - శ్రమించి పెంచె మరితత్కల్యాణ పర్వంబులన్
గనులారన్ గనుభాగ్యమబ్బమికి దుఃఖస్వాంతయై కుందుచున్ 50

"స్వామీ! పెంచితిఁ బెద్దఁజేసితినినున్ బాపంబదేమో? శుభ
శ్రీమంతంబులు నీవివాహములు దర్శింపంగలేనైతి - ను
ద్దామంబైన కొఱంతగా నదిమనోధామంబునన్ శల్యమై
యేమాత్రంబును నిల్వనీదు సతతంబే మూలనో గ్రుచ్చుచున్" 51

అనుచుఁ గృష్ణావతార సమాప్తికాల
మందు భగవానుని యశోదఅడిగె - నాతఁ
డాదరంబునఁ గలియుగంబందు - వేంక
టేశ్వరునిగ నీకోర్కి నీడేర్చువాఁడ 52

ఈ దేహంబునువీడి యోజనని! నాగేంద్రాద్రి కింబొమ్ము బ్ర
హ్మాదుల్ వేడఁగ విష్ణువాదిమ వరాహాకారుఁడై యుండు నం
దాదేశాన్విత సర్వరక్షణకళావ్యాపారుఁడై నీవుత
త్పాదాబ్జంబులు కొల్చుచుండు మటకేవత్తున్ బ్రమోదంబునన్ 53

అని శ్రీకృష్ణుఁడు తెలిపిన
మనముబ్బ యశోదవకుళమాలిక పేరన్
జనియించి సుగుణ సౌరభ
మును కకుబంతముల నింపి పుణ్యచరితయై 54

శేష శైలంబునకు నేఁగి శ్రీవరాహ
దేవు పాదాబ్జయుగళికి సేవసలుపు
చుండె ధర్మాభినిరతయై యోగినిగను
దైవ సన్నిధిఁజనునె యధర్మవృత్తి 55

వ॥ ఇట్లు కొంతకాలంబు కడఁజనినమీఁద స్వర్గ సంవాసుండగు దేవా
చార్యుండు తనదివ్యదృష్టి వలన శ్రీనివాసుండు పుట్టలో నివసిం
చుటయు - గోపకుని గండ్రగొడ్డలిచేత బిట్టుగా దెబ్బతిన్న
విషయంబును ఆమూలాగ్రంబుగా నెఱింగి. 56

సురగురుఁడు బృహస్పతి భా
సుర మాయానిజ విహారు - సురకోటీర
స్ఫురదరుణచరణు - లక్ష్మీ
వరు దర్శించె భుజగేంద్ర పర్వతశిఖరిన్ 57

అప్పుడు దేవతాగురుని నారసి శ్రీహరి "నాశిరస్సుపై
నెప్పుడొ గాయమేర్పడిన దిప్పటిదాఁకను వైద్యుఁడబ్బకే
నొప్పరి కించియుంటిఁ దగునోషధి గాయము మాన్పఁజెప్పినా
త్రిప్పలుమాన్పుమా! దివిజదేశిక! వైద్యుఁడు దైవమేకదా!" 58

అనిభగవానుఁడాడిన బృహస్పతి శ్రీపతిఁగాంచి నవ్వుచున్
వినయనయమ్ములొప్ప నరవింద పఖమ్మగు పాణియుగ్మమున్
దన నిటలమ్ము నం దునిచి "తావక దివ్యకృపాకటాక్ష మో
పును జగముల్ సృజింపఁగను బ్రోవఁగ నాశమొనర్ప శ్రీధరా! 59

ఈ భువనాంతరప్రకృతియెల్ల యెఱుంగుదువీవ - నీవిలా
సాభిమతంబులై యడరు నన్నియు - నన్నొక పెద్దఁగాఁద్వదీ
యాభిమతంబుఁదెల్పితివి - అష్టులయందు రవంతలేనిప్ర
జ్ఞాభరమున్ జగత్తులను చాటుట నీకును క్రీడయౌఁగదా! 60

ఐన నన్నడిగితిగానఁదెల్పెద భక్త
వరద! మేడిచెట్టు పాలుదెచ్చి
చెలఁగి వానియందు జిల్లేడు ప్రత్తినిఁ
దడిసి పట్టువేయఁ దగ్గుక్షతము 61

వారము దినములు నీవీ
తీరున నొనరింప మానితీరును గాయం
బారీతిఁజేయు మనిబ్బం
దారకగురుఁడేఁగె దివికిఁ దదనుమతుండై 62

ఆ మందుల్గొనితేరమాధవుఁడరణ్యంబెల్ల గాలించుచున్
సామీప్యంబున శ్రీవరాహవిభు ప్రాంచద్భూరి పుణ్యాశ్రమా
రామంబుంగని యందుఁజొచ్చిన మనోరాగం బపారంబుగాఁ
ప్రేమన్ దానెదురేఁగుదెంచి కిటిరాడ్వీరుం డపూర్వంబుగన్ 63

మధుపర్కంబునొసంగి నూత్నమగు క్షౌమద్వంద్వమర్పించి స
ద్విధినాతిథ్యము నిచ్చిక్షేమములు సంపృచ్ఛించి - మర్యాదలం
బృథు మోదంబు ఘటించి - విన్నదనమున్ వీక్షించి సంభావనా
సుధలంజిందుచు మెల్లమెల్లఁగ నిటుల్బొప్పించి భాషించుచున్ 64

“అరికరిసింహ! యేమిది? రయంబునఁదెల్పుము శ్రీవికుంఠమున్
దొరఁగి సుఖంబులందరిగి తొయ్యలినెయ్యము వీడియేలయీ
సరణి నొకండవీపుడమి చక్కికి వచ్చితి” వన్న వేదనా
కరమగు కంఠనిస్వనము గద్గదికన్ స్ఫుటమేద నిట్లనున్ 65

“ఆదికిటీశ్వరా! భృగుమహర్షి త్రిమూర్తులయందు మంగళా
పాదక దివ్య సత్త్వగుణపాలకుఁడెవ్వఁడొ నిర్ణయింపఁగాఁ
బాదమునెత్తి నా పృథుల వక్షముఁదన్నెను - నేను తన్మనో
వైదికభావమెంచి పొలపంబుగ నాత్తితిఁదత్పదద్వయిన్ 66

అయ్యది హేతువుకాఁగా
అయ్యా! తొయ్యలి మహాగ్రహంబున నెయ్యం
బయ్యారే! వ్రయ్యఁగఁబెను
గయ్యముఁగల్పించి క్రోధకంపిత మతియై 67

నాసతి నన్నువీడి చనినన్ భరియింపక శ్రీవికుంఠమున్
బాసి సతీగవేషణ నిబద్ధమనస్కుఁడనై ధరిత్రిఁజేరి మై
గాసిల శేషభూమిధర కందర సీమల నొక్కపుట్టలో
వాసమొనర్చుచుంటి సహవాసులు లేక రహస్య వర్తనన్ 68

అంతట నొక్కగోపుఁడు - లయాంతక కోపుఁడు గండ్రగొడ్డటన్
బంతము మీర నాశిరముపైఁగడు బిట్టుగఁగొట్టె - రక్తమ
త్యంతముఁజిమ్మె - గాయము మహావ్యథఁబెట్టగ నౌషధాల కీ
ప్రాంతము లన్నియున్ వెదకి భాగ్యవశంబున నిన్నుఁగాంచితిన్ 69

అనఘా! విన్నపమాలకింపుము ప్రియంబారంగ నీ పర్వతం
బునకున్ మీరలెహక్కుదారులు కదా! పూర్వంబు నందుండి యీ
ఘన శైలంబున వాసముండ వలెనన్ గాటంపుటాకాంక్ష నె
మ్మనమం దింటెనిఁగట్టుకొన్నది దయామందార! తీర్పంగదే! 70

తలదాచుకొనఁగ నిచ్చటఁ
గొలఁదిగఁజోటిచ్చి కట్టుకొనవే పున్నెం
బలఁతిగఁ జూడకు నీకిట
నలఘుబలా! తోడు నీడయై చరియింతున్ 71

మేరచెడి చెల్లెలింటికిఁ జేరఁదగదు
అలిగి అత్తవారింటికి నరుగరాదు
కాని కష్టకాలము నందు నైనవారి
సరసబ్రతుకుట కొండంత శాంతినిడదె? 72

అని ప్రార్థించు రమాధవుంగని వరాహస్వామి "నీకూరకే
చన దిచ్చోట స్థలం బొసంగఁ గరుణాస్వాంతుండ నైపంచిపె
ట్టిన నేనే పయిగుడ్డ వైచుకొని పెట్టేబేడయున్ సర్దుకొం
చును పోవందగుఁగొంపఁగోడియును నిచ్చోవీడిసన్న్యాసినై 73

ఊరకవచ్చెనేని జనులూఁకయు మెక్కరె? అట్లొసంగినన్
బోరన నాకు నాకనుచు బొర్లుచువత్తురు వృద్ధులున్ బ్రజల్
తేరగవచ్చినట్టి దొకలేశము మేరువుగాఁ దలంతురీ
నేరని మాటలేమిటికి? నిక్కముఁదెల్పెద నాలకింపుమా! 74

పేర్మి మనవాఁడవని చౌకబేరమునకె
విక్రయించెద ధనమిచ్చి పృథ్విఁగొనుము
ఎచ్చటైనను బావనవచ్చు - వంగ
తోఁట దగ్గఱ బావను మాటతగదు" 75

ఆదివరాహదేవుఁడిటు లాడఁగ నెవ్వెఱగంది మాధవుం
"డీ దెసమాలినట్టి జనులెల్లరఁ బ్రోవ నిలాతలంబునం
దాదరబుద్ధి ధాతమొదలైన మహాత్ముల ప్రార్ధనంబులన్
గాదనలేకకాదె విధిగా నవతారముఁదాల్చితీగతిన్ 76

లచ్చికి దూరమై విభవలాఘవ మబ్బిన నొంటివాఁడనై
యెచ్చట నిల్వనీడ లభియింపక చెట్టుల పుట్టగుట్టలం
దచ్చపుటంధ కారమున నంధుఁడనై క్షణమే యుగంబుగాఁ
బుచ్చుచునుంటిఁ గాలమొకపోలికసాఁగునె యెంతవారికిన్? 77

కావున నోదయామయ! అగాధపుచీఁకటిబావి దుర్దశల్
తీవలు సాఁగ లేమి కడుతీవ్ర మనోవ్యధపాలుజేసె - నా
యీ వెతతోడి దీనదశనెంచి కృపామతి నీ నగాగ్రమం
దేవలనైన నింతస్థలమిమ్ము కృతజ్ఞతఁగొల్చియుండెదన్ 78

డబ్బులేనివాఁడు డుబ్బుకు కొఱగాఁడ
టన్నమాట సత్యమయ్యె నేఁడు
తివుట ధనముకలుగ దేవురింతునెనిన్ను?
రమ్యభావ! శ్రీవరాహదేవ! 79

ప్రతిదినము వేలకొలఁదిగా భక్తజనుల
దరికి రప్పింతు శేషభూధరముఁగొలువఁ
దొలుతఁగానుకల్ నైవేద్యములును నీకె
అర్పణముసేయునట్లుగా నేర్పరింతు 80

పిదప ననుగాంచి మ్రొక్కులు వెలయఁదీర్చి
చనెడుపగిదిఁగట్టడిఁజేసెదను మహాత్మ!
యిదియె ప్రతిఫలమంచు మీరెంచవలయు
సూకరాకార! దుష్టరక్షోవిదార!" 81

అని గండశిలలె కరుగఁగ
వినయము జాలియు నెసంగవేడెడు శ్రీశం
గని కరుణవెలయ నాదర
మున శ్రీ కిటిసార్వభౌమ పుంగవుఁడనియెన్ 82

ఇదిగో! యిచ్చట నిల్లుకట్టుకొనుమా! యేపారనభ్యున్నతుల్
కడియన్ వచ్చిభవద్రమారమణి సౌఖ్యస్ఫూర్తిఁగొల్వంగ ని
య్యదె భూలోక వికుంఠమంచు సురలత్యంతంబు నగ్గింప నె
మ్మది వాసింపుము నీదు కుక్షిజగముల్ మానొంద సర్వేశ్వరా! 83

నీకు సపర్యలన్ సలుపనిర్మలశుభ్రసుధావచస్క - అ
స్తోకపవిత్రభక్తి పరిశుద్ధ మనస్క - సనాతనార్ష ధ
ర్మైకవిచారయౌ వకుళమాల శుభాఖ్య నొసంగువాఁడ శ్రీ
శా! కనుపాఁపగా నరసి సాఁకుననిన్ జనయిత్రి పోలికన్ 84

అని వకుళమాలికాదేవి నప్పగించి
స్థలమొసంగె వరాహుం డుదారబుద్ధి
నందు నిర్మింకొనెనొక్క ఆకుగుడిసె
హరి - విధినిదాటఁదరమెయెవ్వరికినైన? 85

వ॥ ఆసమయంబున వకుళమాలాపరీమళ విస్ఫురర యశో విశాలయగు నావకుళమాలాదేవి లీలామానుష విగ్రహుండయిన శ్రీహరిని గాంచి యిట్లనియె. 86

"ఎవ్వరివాఁడవీవు? కులమెయ్యది? నీయభిధానమెద్ది? నీ
విఘ్నపినాద్రి దేశములనేలచరించెదు? గాయమేమి? నీ
కెవ్వరు శత్రువుల్? రిపుతయేఁటికిఁగల్గెనా? దాపకుండ నా
కవ్విధమున్ వచింపుము రహస్యముకానియెడన్ సమస్తమున్ 87

అనిప్రశ్నించిన శ్రీధరుండు "వినుమమ్మా! యేనభాగ్యుండ ఏ
మన? నాకెవ్వరులేరులోకులకునేనౌదున్ బ్రపంచంబునన్
జనులేపేరునఁబిల్చినన్ బలికెదన్ సామాన్యమై యొక్కపే
రను నిర్దేశములేదు - శత్రువులులేరాద్యంత శూన్యాత్ముఁడన్ 88

అమ్మ నాన్నలేరు నెమ్మిగ్రామములేదు
ఆలు తొల్లిగలదు - అలిగినన్ను
విడిచిపోయెనెటకొ - వెదకుచునొంటిగా
ధరణిఁజెప్పలరుగఁదిరిగినాఁడ 89

కారణాంతరములవల్లగాయపరచె
ఆలకాపరి యొక్కఁ డేనంతకన్న
నేమియును జెప్పఁజాలఁదల్లీ! మదీయ
భాగ్యవశతఁదల్లిగ నిన్నుఁబడసినాఁడ" 90

అనివచియించుచున్న జలజాక్షునిగన్గొని కన్నుగ్రంతలన్
దొనదొనహర్షబాష్పములు దొర్లఁగ నామెవచించె "నాయనా!
మనమిట తల్లిబిడ్డల సమంచిత బంధముతోడఁగూడుటల్
పనుపడు దైవచిత్రమిటువంటివెసుమ్ము ఋణానుబంధముల్ 91

దిక్కుగలదింత తరుశాఖఁ బక్కికైనఁ
బుడమినాకెందు దిక్కును మ్రొక్కులేదు
దేవుఁడొసఁగిన సుతుఁడవై తివి, కుమార!
ఎన్నిజన్మల బంధమో యెవ్వఁడెఱుఁగు? 92

నేఁడుమొదలుగాఁగ నిను శ్రీనివాసుఁడా!
అనుచుఁబిలుచుకొందు నను నయమున
నన్నువీడి చనకు మెన్నండు నాతండ్రి!
పిన్నవాఁడ! నన్నుఁగన్నవాఁడ" 93

అతివాత్సల్యము మీరఁబల్కు మృదువాక్యన్ నవ్వుచుంగాంచి - ఆ
యత బీజైకఋణానుబంధనిగళవ్యానద్ధజీవుండుగా
నతు లావ్యక్తనితాంతతత్త్వుఁడును - మాయాధ్వస్త శీలుండు స
ద్భుత వేదాంతపురాణవాఙ్మయ శిరోభూషుండు తానిట్లనున్ 94

చిత్రము జీవబంధములు - చేకురుచుండు ఋణానురూపసం
పాత్రతఁబుట్టిగిట్టుచును వచ్చుచుఁబోయెడి బాటసారు లి
ద్ధాత్రిని యెంత సేపెచటఁదద్దవసింతురో? యెందుఁబోదు రీ
యాత్రల నెవ్వఁడెవ్వనికి నప్పువడెన్ వచియింప శక్యమే? 95

నేనెనీకప్పు వడితినో - నీవెనాకు
ఋణపడితివో? వచింపఁగ నెవ్వఁడోపు?
దానిని గురించి యింతటి తర్కమేల?
తల్లివైతివి నాపుణ్య తపముపండి 96

అమృతమూఱ నోరార అమ్మా! యటంచుఁ
బిలుచుకొనుభాగ్యమింతకుఁగలిగెనాకు
నీవనుంగు తల్లివి నేను నీసుతుండ
జననినెడఁబాసి తనయుండు మనఁగలండె?" 97

అని పలు తెఱఁగుల వకుళా
వనితామణిఁగాంచి మాతృభావమెడందన్
వనసిధివలె నుప్పొంగఁగ
వినయమ్మునఁబలికెనిట్లు వెన్నుఁడు చెన్నై 98

అందులకా వకుళాసతి
చిందెడు నానందబాష్పశీకరముల సం
స్పందిత పులకాంకురముల
నందముగాఁజూడ నెనఁగె నమృతాకృతియై 99

ఘనశేషాద్రి గుహాటవీ స్థలములంగాలించి - శ్రేష్ఠంబు లౌ
వన దివ్యౌషధ మూలికాలతలు సంపాదించి శ్రీశ్రీనివా
సుని శీర్షాగ్రతలాన గాయమునకుం జొక్కంపుఁ బై పూఁతఁబూ
సిన మాన్పట్టెను - తల్లిచేతి చలువన్ సిద్ధింపవే స్వస్థతల్? 100

ఫలములు కందమూలములు భవ్యములైనవి యేర్చితెచ్చుచుం
బిలిచి యనుంగుపుత్రునకుఁబెట్టుచుఁబోషణ సేయుచుండె ని
చ్చలు సుతుఁగంటి తెప్పగతి సాఁకుచు నెప్పటిజన్మబంధమో?
చెలఁగు ఋణానుబంధములె జీవికిఁగష్టసుఖైక హేతువుల్ 101

అఖిల జగములఁబోషించు నధిపుఁడొక్క
మాననీమణి పోషణమనలఁ దొడఁగె
నిఖిల విశ్వంబు శాసించు నృపుఁడుఁగూడ
అమ్మకడ ముద్దుబిడ్డఁడై యలరుఁగాదె 102

అమ్మపోషణ సుఖముల నందుఁగాని
ఆలి యెడబాటుఁదల పోసియప్పుడపుడు
మిగుల దుఃఖార్తి పొగులుచు వగలనలగు
వకుళ కనకుండ జాగ్రత్తపడుచుదాని 103

## సోపానాంతము

కరుణాపాంగతరంగ! రంగ దఖిలాక్రాంతార్క తేజస్కరా!
కరసందత్త విశిష్టవైభవ! భవోగ్రవ్యాళ పక్షీశ్వరా!
వర పంచాయుధ హస్తసారస! రసప్రస్తార వాగ్భాసురా!
సురసంతాన నిరంతరావన! వనక్షోణీ విహారాస్పదా! 104

శ్రీరమా హృదంతరాళ చిద్విలాస మందిరా!
సారసోద్భవాదిదేవ సన్నుతాంఘ్రియుగ్మకా!
ధారుణీ ధరాగ్రవాస! దందశూక తల్పకా!
ధీరదైత్యవంశనాశ! దేవ! వేంకటేశ్వరా! 105

వేంకటాద్రీశ్వరా! విశ్వరక్షాకరా!
సంకటాపాకరా! సప్తశైల స్థిరా!
న్యంకుహృన్మందిరా! అబ్జజా సుందరా!
పంకనిర్మూలనా! భక్తసత్పాలనా! 106

# పద్మావతీ శ్రీనివాసీయము

## చతుర్ధ సోపానము

శ్రీ మత్తిరుమలవాసా!
శ్యామల ఘనతను విలాస! చంపకనాసా
కోమలతర దరహాసా!
శ్రీ మహిళా హృద్విలాస! చిన్మయభాసా! 1

అవధరింపుము 2

గండూషిత సకల కథా
మండన ధిషణావిశిష్టమాన్య చరిత్రున్
చండవచోభర పండిత
శుండాలుని దండితారి సూతపవిత్రున్ 3

నానాస్తోత్రంబులచే
ఆనందితుఁజేసి తాపసాధ్యులు తత్త్వ
జ్ఞానమృత పానామో
దానూనావిష్టులగుచుననిరీరీతిన్ 4

11) మొవ్వ వృషాద్రిపతి

ఆవలికథ వినిపింపుము
శ్రీ వనజదళాక్షుఁడెట్లు హృద్గత చింతా
భావము వాసెనొ? శ్రీ ప
ద్మావతినెటు పెండ్లియాడె? మౌని! తెలుపవే! 5

వ॥ అని యర్థించిన ఆపైవిషయం బాలకింపుమని సూతసంయమీంద్రుం
డిట్లని వక్కాణింపం దొడంగె. 6

తొల్లిసుధర్ముఁడన్ నృపతి ధూతమహోఘుఁడు - చంద్రవంశ సం
పల్లతికాలతాంతమనువాసివహించుమనేలె - శౌర్యమే
యెల్లగ నెల్లరాజ్యముల యెల్లలు నన్యనృపాల పాలనం
బొల్లక యీ ధరాభుజు దృఢోన్నత బాహుల నాశ్రయింపఁగన్ 7

వ॥ ఆ మహామహీపతి రాజధానీ నగరంబు నారాయణపురంబు.
అయ్యది శేషాచలమున కుపకంఠమ్మున నేయుపద్రవంబు లేకుండ
అఖండ భోగభాగ్యైశ్వర్యవైభవ సంపన్నంబై అలరారుచుండె.
ఆ మహారాజునకు తనూజులిరువురు. అందుఆకాశరాజు పెద్ద
వాఁడు ద్వితీయుండు తొండమానుండు. వారిరువురును బెరిగి పెద్ద
వారైరి. 8

అప్పుడాకాశరాజు నీయఖిల వసుధ
కధిపతినిజేసి ప్రజల స్వీయాత్మజులుగ
అరయుమను సాధుసజ్జనులలరఁజేయు
మనుచు వనికేఁగెను సుధర్మజనవిభుండు 9

ఆయన ధర్మపత్ని సముదంచిత శీలచరిత్ర - ధర్మకా
ర్యాయత సత్పవిత్ర - మృదులాకృతి సన్నుతపాత్ర ఉన్నత
ధ్యేయపరత్ర - పర్వదివసేందు కళాద్భుతజైత్రవక్త్ర - ప
ద్మాయత పత్రనేత్ర - వినయప్రతిభారమణీయ గాత్రియౌ 10

ఆయమ ధరణీదేవి విఖ్యాతనామ
మానిత పతివ్రతా శిరోమణి స్వకీయ
భర్తృపదసేవ దేవతా పాదపూజ
యనఁగఁ బ్రాణేశజీవితయై చరించు 11

ఆవిధిఁబావనంబగు గృహస్థ సమర్థ విశిష్టధర్మర
క్షావశులై ప్రశస్తగతిఁగాఁపురముంబొనరింప సౌఖ్య సం
భావనఁగాల చక్రము క్రమంబుగ సాఁగెను గాని పుణ్యదీ
క్షావరివస్య రాణికిని గర్భము పండకపోయె నెంతకున్ 12

పుట్టలఁబాలువోసి - వ్రతముల్ పొనరించుచు - క్షేత్రసీమలన్
మెట్టుచుఁ బుణ్యతీర్థముల మేకొని మున్గుచు - ముడ్పులెన్నియో
కట్టుచు భూతమాంత్రికుల కట్నము లిచ్చుచు - భక్తిపెంపునన్
జెట్టుల గుట్టలం గొలిచి చిల్లర దేవతలన్ భజించుచున్ 13

దానధర్మములును దైవప్రతిష్ఠలు
నోములెన్నొ నోచి నొవ్వఁగొనిరి
కాంత కడుపుపండి కాయకాయకపోయెఁ
గలిసిరానివేళ ఫలముగలదె? 14

అంతట నొక్కనాఁడు వసుధాధిపుఁడెంతయు భక్తితోడ ఆ
శాంత యశోవిశాలుఁడు మహామహిమాన్వితుఁ డధ్వరక్రియా
శ్రాంతుఁడు శాంతిదాంతిగుణ సన్నుతుఁడైన స్వవంశ దేశికున్
జెంతకుఁ బిల్వనంపె మృదుశీతల వాక్యు శుకాఖ్యసంయమిన్ 15

హుతవాహప్రతితేజుఁడౌ మునికిఁ బ్రత్యుత్థాన ముంజేసి స
మ్మతిఁదత్పాదజలేజముల్ కడిగి సమ్యక్పాద తీర్థంబు ను
న్నతభక్తిందల మీఁదఁ జల్లుకొని స్వర్ణస్వచ్ఛ పీఠంబుపై
యతిశార్దూలుని నిల్పియిట్లనిరి నెయ్యంబార రాడ్దంపతుల్. 16

"నీపదధూళిసోఁకి మహనీయ తపోధన! మా గృహంబు సం
ప్రాపిత పుణ్యరాశిగను వాసికి భాసురవాసమయ్యెఁబు
ష్పాపచయార్థమై నెగడె నన్వయ మెల్ల - నితాంతధర్మకా
ర్యాపణమైనజన్మ చరితార్థతఁ జెందె చిరాయురున్నతిన్. 17

పిల్లలులేని గృహము విల
సిల్లను సన్యాసి మఠముచెన్నున - మృదువౌ
పల్లవ విరహిత లతవలెఁ
బొల్లయి వంశంబు నిలిచిపోవును గాదే! 18

యతిహర్యక్ష! మునీంద్ర చంద్రసముదాయాధ్యక్ష! ఎన్నో ప్రజా
హిత కార్యంబులు నిర్వహించితి - సుహృద్దింసన్ నిరోధించి దే
వతలంగొల్చితి - దేవతాలయములన్ భక్తిన్ వినిర్మించితిన్
గ్రతువుల్ పెక్కులొనర్చిభూమిసురులన్ దానంబులం దన్పితిన్ 19

కానీయేభవమందుఁ జేసినదొ యీకల్కంబు - కట్టా! మహా
నూనంబై యనపత్యతాకృతిని వంశోద్ధారకుం గల్గ నీ
దీనాతాపము తీరుటెట్టు? లిదెనాయిల్లాలి చిత్తవ్యథా
యోనారాచము పాయుటెట్లు? సుతసంయోగాప్తి యెట్లబ్బెడిన్? 20

కలకల నవ్వుచున్ బసిఁడికాంతులఁద్రోయుచు దవ్వులన్ సుధల్
జలజలరాలఁబల్కుచును జక్కలిగింతలఁగేరుచున్ రుచుల్
వెలయఁగఁ గొక్కిరించు పసిబిడ్డఁడు లేని గృహంబు శూన్యమై
వెలవెలఁబోవు జీవితము వెత్తిగ నిత్యము వెక్కిరింపఁగన్" 21

ఇటుప్రార్థించు నృపాలుఁగాంచి శుకయోగీంద్రుండు నిర్ణిద్ర సం
స్ఫుట చిత్తంబుననెంచి - "ఓయినృప! యీ శోకంబునీకేల? చ
క్కటి నేనుండఁగ - నీశ్వరేచ్ఛవలనన్ గల్యాణ భాగ్యంబులు
త్కటమైకల్గును - సర్వమున్ శుభమగున్ గమ్యంబు సిద్ధించెడిన్ 22

అతులితకీర్తియౌదశరథావని నాథుఁడు సర్వభూప్రజా
తతిముదమంద రాజ్యమును ధర్మపదంబుగ వేలయేండ్లు సం
స్తుతగతినేలెఁగాని కనుదోయికిఁ బండు వానర్పుఁజాలు సం
తతిఁగనఁడయ్యెఁ జిత్తమునఁదద్గతి యెంతయు వంతఁగూర్పఁగన్ 23

మౌని చంద్రువసిష్ఠు నాజ్ఞానుసార
మతఁడు పుత్రకామేష్టి నాయజ్ఞమాచ
రించి నల్వురఁబుత్రులఁగాంచలేదె?
నీకు దిగులొందనేల? చీఁకాకులేల? 24

అధిప! నావాక్యముల సత్యమరయుమయ్య!
పుత్రకామేష్టి నొనరింపఁబూనుకొనుము
ఫలితముగ నీసతికడుపు పండి - పండు
వంటి సంతతి కలుగు నన్వయము వెలఁగు 25

ఆగురువర్యు వాక్యముల నాదరముంచి కుతూహలక్రియా
భోగుఁడు రాజచంద్రముఁడపూర్వముహూర్తము నిర్ణయించి - ఆ
యాగమొనర్ప నర్హులగు నట్టి మునీంద్రులఁబిల్వఁబంచి స
ద్యోగమనప్రయోజనపుయోజన మంత్రపురస్సరంబుగన్ 26

గురుపురస్కృతి నధ్వర క్షోణితలము
స్వర్ణహలమునఁ గర్షించు సమయమందు
లాంగలముయొక్క కృషికాంచలమ్ము నందుఁ
దగులుకొనె నొక్క మంజూష - ప్రగతిభూష 27

పృథ్విలోనుండి పెట్టెతీయించి నృపుఁడు
తెరచిచూచెను తన మహాదృష్టనిధిగ
దానియందు సహస్ర పత్రములతోడ
భాసిలుచునుండెఁగాంచన పద్మమొండు 28

అందుఁబవళించి యుండెను చందమామ
అంద చందంబులను మేన నపహరించి
ముద్దులను మూటఁగట్టుచు నిద్దమైన
మెఱుఁగు తీవియ నిలుకడ మీఱెననఁగ 29

మృదుల సుధాంశు బింబమును నెల్లిదమాడెడు ముద్దుమోము - ష
ట్పదములఁ గ్రిమ్మరించు కచబంధము - నీరజపత్రకాంతి సం
పదల హరించు కన్నుగవ - మంజుల దర్పణ చిక్కణ స్థితిం
జిదుము కపోలయుగ్మమున సృష్టికళానిపుణత్వ సూచ్యమై 30

వరలెడు బాలికంగని నృపాలుడు బాలుఁడు వోలెపెల్లు సం
బరమున పొంగు సాగరము మాడ్కిఁజెలంగ నభంబునుండి" యో
వరనృప! నీదుభాగ్యపరిపాకము నేఁటికిఁబండె నిట్టు లి
ద్ధరణి భవాదృశుల్ పరమధన్యులు గణ్యులు కల్గరన్యులున్ 31

భవ దదృష్టంబు కతన ఈబాలదొరకె
మురిపెమునఁబెంచు మల్లారుముద్దుగాఁగ
నీదువంశ ప్రతిష్ఠ విన్వీథిఁ బ్రాఁకు"
ననుచు నాకాశరాజుకు వినఁగనయ్యె 32

అప్పు డాకాశవాణి వాక్యముల కలరి
అనుఁగు బాలిక నెత్తిముద్దాడి యాడి
భార్య ధరణిదేవికినిచ్చె పాపనపుడు
కలిత దినరాజ తేజుఁ డాకాశరాజు 33

కన్నబిడ్డకన్న మిన్నగా బిడ్డను
ధరణిదేవి ప్రేమవరలఁ బెంచి
విప్రవరులఁబిల్చి పేరు పెట్టుడనంగఁ
బారఁజూచి పాపతీరుఁజూచి 34

పద్మలబ్ధగాన పద్మావతి యటంచు
సార్థకాఖ్య నిడిరి సంయమీంద్రు
లబ్ధిజాతలక్ష్మి అవతరించినదింట
ననుచు తల్లిదండ్రు లభినుతింప 35

ఈ విధి శ్రద్ధాసక్తుల
నావిషయం బాలకించి అత్యుత్కంఠా
భావితమతులై సూత సు
ధీ వరుఁగని యిట్లనిరి యతివరులు భక్తిన్

"స్వామి! మందస మేరీతి వచ్చెనటకు?
అందుఁబసికందు కలుగుటె? ట్లానతిమ్ము
ఆమె యెవ్వతె? తత్కథ నాలకింప
తహతహలుచెందు మనములో తాపసేంద్ర!" 36

వ॥ అని ప్రార్థించిన మునిపుంగవులఁబరికించి సూతుండు తదనంతర కథావిశేషంబు నశేషంబుగా వచింపందొడంగె 37

అద్భుతశీల వేదవతి నాఁ జను కన్యహరిన్ వరించి త
త్పాదములాత్మలో నిలిపి ప్రస్తుతిపాత్ర తపంబొనర్ప - నా
సాదిత మోహలోలుపులు క్ష్మాపతి నందను లెందరెందరో
వేదవతిన్ వరింపఁ బరువెత్తుచు వచ్చిన నామెయిట్లనున్ 38

"ఓ నరనాథులార! కరుణోదధి వెన్నుఁడు నాకు నాథుఁ డిం
కేనారులన్ వరింపఁగ నభీష్టము కల్గదు సుంత కన్యగా
నేనియు జీవితాంతమిటులే తపమున్ బొనరింతు" నన్సమా
నధాముఁజెప్పి పంపె విదితంబుగ నామె తదుర్వినేతలన్ 39

ఈవిధి నామె యుగ్రతప మెంతయుఁ జేయుచునుండ లోక వి
ద్రావణుఁడైన రావణుఁడు దర్పితుఁడై రణభూమి కేఁగుచున్
ద్రోవ వసించు కల్మష విధూత పవిత్ర చరిత్ర - భాసురం
బౌ వెడవిల్తు పుష్పవిశిఖాకృతిఁ బొల్చెడు నామెఁగాంచుచున్ 40

మదన శరాహతింబడలి మక్కువఁజిక్కి విరాళిఁదూలి యు
న్మదుఁడయి మోహవారినిధిమగ్న మనోంబుజుఁడై వికారతా
స్పదుఁడయి వెచ్చ నూర్చుచును పంచశర ద్విపహస్తకంజ మ
ట్లదవద యౌచు నామెదరి కల్లనఁ జేరి యతండు నిట్లనున్ 41

"తరుణీ! రావణుఁడంద్రు నన్ను రణవిద్యా కర్కశుండన్ మహా
పరమార్థాదృత వేదకోవిదుఁడ - శైవస్తుత్య ధర్మక్రియా
దరుఁడన్ సత్కవిలోక చంద్రుఁడ - దిగంత వ్యాప్త కీర్తిప్రభా
కరుఁడన్ - దీనజనావన ప్రబల దీక్షా సత్కృపా సాంద్రుఁడన్ 42

సురలంద్రోలితి - దైత్యదానవకుల స్తోమంబు నిర్జించితిన్
ఖరబాహాసి సమస్తలోక చయముంగైకొంటి - నింద్రాదిది
క్పరిపాలాధములెల్ల భృత్యులుగ నా పాదంబులంగొల్తు రో
వరబింబాధర! నాదు పేరు వినఁగంపంబందు ముల్లోకముల్ 43

లంకారాజ్యము నేలుచుంటి సుమబాలా! బాహుశక్తిన్ నిరా
టంక స్ఫూర్తి - నవక్రవిక్రమ నిశాటశ్రేష్ఠులాభీల శౌ
ర్యాంకుల్ నిర్జరవీర హృద్భయద యుద్ధాటోపదుర్వారని
శ్శంకుల్ నాకనుసన్న కార్యగతులన్ సంధింతు రత్యున్నతిన్ 44

నరసుర దైత్యకామినులు నన్నుఁగనుంగొని నంతమాత్రచే
స్మరశరజాల విద్ధలయి సంభృత మోహదశావశాత్మలై
అరుదగు కాన్కలంపి రతికై కడు చిత్తములుత్తలింప నా
కొఱకయి వేచియుందురిఁక కోమలి! వేరుగఁజెప్ప నేఁటికిన్?

అతివా? నీయెలప్రాయమిా విధిఁ దపో వ్యాసంగ మందేల దు
స్థితి పాల్జేసెదు? కానరాని హరికై చేఁజేతులన్ జీవితం
బతుల వ్యర్థతఁబాడుచేసి కొననేలా? నాదు పేర్విన్న దు
ర్గతిమై విష్ణుఁడు గిష్ణుఁడున్ భయమునన్ గారాకు మేయుంజుమీ! 4

అట్టినేను నీ సౌందర్య మరసినంత
బంధితుఁడనైతి నీచూపు వలలఁ జిక్కి
మూఁడు లోకంబులందు నీతోడ - జోడు
కూడఁగల కన్యలేదు నీతోడు తరుణి!" 4

వ॥ అని మహోగ్రగతిం బలుకుచున్న 4

అతని మాటలన్ విని భయంబును గోపము నగ్గలింపఁగాఁ
జేతము నందు ధైర్యమును జేకొని "రాక్షసరాజ! నేను సం
ప్రీతి సరోజనాభుని వరింపఁదలంచి తపంబు నీగతిన్
బ్రాతిగఁజేయుచుంటిఁ బెఱవారల పాణిగ్రహింప నెంతకున్ 4

ఆ హరి కాదుకూడదనఁ బ్రాణము లైనను వీడుదాన సం
దేహములేదు - నేననుమతింపఁగఁ జాలను నిన్ను - నీవృథా
మోహముమేలె? నీపయిని మోజు రవంతయులేని యే వరా
రోహను కూడినన్ సుఖముఁగ్రోలుదె? బొమ్మను పొందుటే కదా!" 50

అనినన్నవ్వుచుఁ "బిచ్చిదాన! యెవఁడాయబ్జాయతాక్షుండు? రా
వణ నామంబది వీను దోయిఁబడఁగంపంబెత్తి భీత్యుద్ధతిన్
దన గుండెల్ పగులంగ దిక్కుసెడి పత్తాలేక పర్వెత్తు నె
వ్వనికింజెప్పక నాకువీరులెదురై ప్రాణాలతో నుందురే? 51

లలన! నాపొందు లెదఁగోరి లంచమిచ్చి
దూతికల నంపు చుందురు తోయజాక్షు
లనుచుఁ జెప్పితి - నట్టి నేనక్కటకట!
చుల్కనైతిని నినుగోరి సుందరాంగి! 52

అంతటి నేను నీకొఱకు నైపలుభంగుల దేవురింప వా
రింతువె? బల్మిఁజేగొని వరించెద - నెవ్వరుఁడడ్డు వచ్చునో
చింతయొనర్పు మింత - యిటఁజేతికిఁజిక్కిన నిన్నుఁగావ శ్రీ
కాంత శచీశ్వరాబ్జభవకామవిరోధులు నేగుదెంతురో?" 53

అని భయంకర రూపాన అంతికమున
కరుగుఁదెంచెడి రాత్రించరాధమునకు
నోడి మానంబు నిపుడు పోనాడు కొనుట
కంటెఁ బ్రాణంబు వీడుట కాదెమేలు? 54

చెంతకుఁజేరు కామ కలుషీకృత చిత్తునిఁజూచి "వీఁడు దు
శ్చింతుఁడు వీనియందుఁబని సేయవు సామముఖాద్యుపాయముల్
క్షాంతి వహించి యుండుట ప్రశస్తముకాదిఁక మానరక్షణం
బెంతయుముఖ్య - మద్దిచన నేఁటికిఁ బ్రాణము? లేల సంపదల్?" 55

అని చింతించి స్వకీయదేహమున యోగాగ్నిం బ్రకల్పించి త
ద్ఘన కీలాంతరయై కృశాను కరయుగ్మ ప్రాప్తయౌ స్వాహయో
యన"నోరావణ! నీదు మూలమున నన్యాయంబుగా నీ తపో
గ్నిని దగ్ధంబగుచుంటి నీ యఘము నిన్వెన్నాడు మచ్ఛాపమై 56

ఓరీ! దుర్మద దుష్ట కార్యకరణోద్యోగా! మహాభీకరా
కారా! ఈ విధిఁగన్నుఁగానని మహాకామాంధకారాన అ
చార ప్రాభవ శీలలైన అబలా సంఘమ్ము నీరీతి నొ
రారా! బల్మి మెయింజెఱంగొనుట శౌర్యంబంచు భావించితే? 57

స్థిరముగ నన్నుఁబోలెడు సతీమణి లంకను సంభవించి నీ
హితసుత మంత్రి బంధుగణ భృత్యచమూ సహితంబుగా మహా
దితిజ కులంబునెల్లను వధించును - లంక నశింపజేయు - నీ
దు తలలు సంగరోర్విఁబడి తుష్టి నిడున్ఖగపాళి కన్నమై 58

నీవు మరణించెదవు గాక నింద్యమైన
ఫణితిఁ గలహాన నీకు నిర్వంశ మగుత"
మనుచు యోగాగ్ని దగ్ధయై - యందడంగి
వహ్ని యందుండె నుష్ణ రూపము వహించి 59

సరస సుధాకథాకథన చాతురికిన్ నెలవైనవాఁడు - అ
చరిత తపోమహామహిమ సన్నుత వాక్కులు కల్గువాఁడు - అ
క్షరపరిపూత నైగమ విచార మహోన్నత పండితుండు - వి
స్ఫురదురు విజ్ఞతాధికుఁడు సూతుఁడు మౌనులఁజూచి యిట్లనున్ 60

"ఇంతవఱకు విన్న యిక్కథ నించుక
నిలిపి స్మృతి పథమున మెలఁగఁ దెచ్చి
కొనుఁడు పంక్తిరథుని కొడుకు చరిత్రంబు
మౌనులార! జ్ఞాన మహితులార! 61

దాశరథి మైథిలీసుమిత్రా తనూజ
యుక్తుఁడై జనస్థానమందున్న యపుడు
మాయలేడిని పంపించి మాయఁజేసె
రామ జననాథ చంద్రుని రక్కసుండు 62

రాముని దూరముంబనిచి రాక్షసమాయలు పన్నివంచనో
ద్దాముఁడు రావణుండు దురితంబున భూసుత దొంగిలించి లం
కాముఖుఁడై చనందొడఁగెఁ గామపరీత మనోభిలాష - జ్వా
లాముఖుఁ డగ్నిహోత్రుఁడు నిలాసుతఁ బ్రోవఁదలంచి గ్రక్కునన్ 63

ఆ సురవైరి మార్గమున కడ్డమునిల్చి "నిశాటవల్లభా!
మోసమువచ్చె రాఘవుఁడు ముందుగ నాకడనుంచి మైథిలిన్
వాసిగ నీమె నుంచెఁ దన పర్ణకుటీరమునందు - నీమె భూ
మీసుత యన్న భ్రాంతి బలిమిం గొనిపోయె దమాయకుండవై" 64

అని వచియించు నగ్నిఁగని "అంతయు సత్యమె? నమ్మమందువే?
పనిగొనియేల యిట్లెదురువచ్చి వచించెదు? రాముఁడేమి నీ
కొనరిఁచె నెగ్గు? నావలన నున్నదె కార్యము? మిమ్ము నమ్మరా
దనువుగ నిట్లు చెప్పి వినుతాంగిని గైకొని పోఁదలంచితే? 65

ఉన్నటులుండి నాయెడల నూరకపుట్టెనె యింత ప్రేమ? నీ
వెన్నడురావు నాకడకు నేపనికైనను మున్ను - ఇప్పుడీ
తెన్నునమేదినీ సుతను తీసుకుపోవు నుపాయమెంచి యీ
పన్నుగడన్ వచించి యిటుపంపిరొ శూరులు రామలక్ష్మణుల్? 66

నీకయినీవ వచ్చితివొ? నిక్కము తెల్పుము - లేకయున్న బా
హాకరవాలధార కెరయయ్యెదవోయి కృపీటయోని! అ
ప్పాకల నాదు దారికిని అడ్డమురాకు" మటంచు నాగ్రహో
ద్రేకతఁ బల్కు రావణుని తీవ్రతఁ గాంచి భయాకులాత్ముఁడై 67

వెఱపును - పూర్ణ భక్తియును - భీతి నటించుచు వీతిహోత్రుఁ "డో
సురకులవైరి! నీ తెగువ - శూరత - వైభవమే నెఱింగి యే
సరణిని నీకు ద్రోహమును సల్పఁగ నక్కట! సాహసింతుఁ? జె
కురునాకొ నిప్పతోఁ దలనుగోకి కొనంగను వెఱ్ఱివాఁడిలన్? 68

తల్లులువేలుగాని మన తండ్రి యొకండగుఁ బూర్వదేవతా
వల్లభుఁడీవు - దేవమునివర్యుఁడనే - మనబాంధవంబు రా
జిల్లు ననాదిసిద్ధముగ - సీతయు రాముఁడు మానవుల్ గదా!
చెల్లరె! వాడు వంచనముసేయ నెరింగియు మిన్నకుందునే? 69

ఐనవారి కాకులయందుఁ గానివారి
కవుర! కంచంబులం బెట్టనగునె? దైత్య
నాథ! మున్నెన్నడేనియు నాకతాన
కష్టనష్టంబు లించుకేఁ గాంచినావె? 70

ఆరయ యక్షసాధ్యగరుడామర దైత్య నభశ్చరాది బృం
దారక యోనులందు వినుతంబగు శౌర్యపరాక్రమప్రభా
వైరి శిరోవిలుంఠన విభాసుర దక్షుఁడెవండు నీవు గా
కోరజనీచరాధిప! మహోద్ధతి నన్యులు నీకు సాటియే? 71

నీదు వైభవంబు నీ పరాక్రమ సిద్ధిఁ
గాంచి మేలుసేయఁగాఁ దలంచి
వచ్చి తిట్లుతింటి బాపురే! పున్నెంబు
నెంచి పోవఁ బాపమెదురువచ్చె 72

నీదు నయప్రయోగ మహనీయ యశస్సును గాంచి నీ హితా
పాదన బద్ధ బుద్ధినయి వర్తిలుచుండుట దీనిఁ దెల్పితిన్
గాదని యందువేని నొక గవ్వయుఁ బోయెడిదేమి? ఈ వృథా
వాదనలేల? పోయెదను వచ్చినదారిని రాక్షసేశ్వరా!" 73

అని పోవం గమకించు హవ్యవహు నెయ్యాన న్నిరోధించి "ఓ
అనఘా! యింతటి కోపమేల? మనవాఁడన్నట్టి భావంబుతోఁ
జనవుం గైకొని మేలమాడితిని - ఆ స్వాతంత్ర్యమున్ గైకొనం
గ ననర్హుండనె? తప్పు సైచి హితవుం గాంక్షించి వాక్రుచ్చుమా!" 74

వ॥ అనిన రావణున కాధనంజయుండిట్లనియె 75

"నీకడనున్న కాంత ధరణీసుతకాదు - విదేహరాట్సుతన్
నాకడనుంచె రాముఁ డిదినమ్ముమ - యీమె నొనంగి మైథిలిన్
గైకొనిపొమ్ము లంక" కనఁగా విని సీత నొసంగె రావణుం
డేకడనైనగాని ఫలియించునె దుష్టుల క్రూరతంత్రముల్? 76

అంతఁగృపీటయోని తనయందలి వేదవతీ సతిన్ నిలిం
పాంతక భర్తకిచ్చి జనకాత్మజఁ గైకొనిపోయి దాచె ని
శ్చింతత - నామె సత్యముగ సీతయటంచుఁ బ్రమోదపూరిత
స్వాంతుఁడు రావణుండరిగె వైభవ దర్పములొప్ప లంకకున్ 77

అట నశోక మహోద్యానమందు శింశు
పాతరుచ్ఛాయ సీతగా బ్రమసి వేద
వతిని బంధించె రావణుం డతిబలుండు
రామ రావణులకు మహారణము జరిగె 78

రావణుని జంపి రాముఁడు
పావన చారిత్ర సీత పాతివ్రత్యం
బీవసుధకు నెఱిఁగింపఁగఁ
బావకకీలలఁ జొరంగ వడి శాసించెన్ 79

వేడుక మాయ సీతయగు వేదవతీసతి అగ్నిఁ జొచ్చినన్
దోడును నీడనా వెలయు తొయ్యలు లిద్దఱఁదెచ్చి "రామ! యీ
పోడిమికత్తె లిర్వురను పొంది సుఖింపుమ" యంచు సర్వమున్
బాడి చెలంగఁ జెప్పె రఘు వంశ్యనకాయనలుండు సత్కృపన్ 80

అనురాగాన వచించు నగ్నికిని హస్తాంభోజముల్ మోడ్చి యి
ట్లను నిక్ష్వాకు కులావతంసుఁడు "మహాత్మా! యే కృతజ్ఞుండ - నీ
వెనయం జేసిన మేలుకే ప్రతిహితం బేమిత్తు? కొండంత దే
వుని కొండంతటి పత్తిరిం గొలువ నీ భూమిస్థలిన్ శక్యమే? 81

ఈ యవతారమందు నొకటే సతి - యియ్యది మద్వ్రతంబు - నే
నీ యబలా లలామ వరియించెద వేంకట శైలవాసినై
ఖాయము - దీనకన్య విధి కల్గ" దటంచు వరం బొసంగి భ
ద్రాయితమూర్తి సత్య శుభదాయక సీతను స్వీకరింపఁగన్ 82

ఆపగిదిన్ రఘుప్రవరుఁడాదరమేదురుఁడై ఘటింప న
ష్టాపద మందసంబునఁ గడాని బెడంగుల బొమ్మ పోలికన్
బ్రాపుగఁజేసి వేదవతి బాలను దానను పండఁబెట్టిక్ష్మా
లోపలదాచియుంచె ననలుండు మహోరుచి మండలుండొగిన్ 83

పడఁతి వేదవతియె పద్మావతిగ నిప్పు
డవతరించి పృథ్వినధివసించెఁ
బట్టియయ్యెనంచుఁ బట్టపగ్గములేక
హర్ష జలధిఁదేలె నవ్విభుండు 84

శుక్లపక్షేందు రేఖనా సొగసు మిగిలి
దినదినాభి వృద్ధిఁగను నాతీవబోఁడి
అతుల సౌందర్య ధృతి రమాసతియొ లేక
రతియొ యననొప్పె నందాలరాశియగుచు 85

పాసిగఁబంచ వర్షములువచ్చిన మౌని వరేణ్యు లక్షరా
భ్యాసముఁజేసిరాధరణి పాలుని బాలకు - నామెకద్భుతం
బై సకలంబు దేశికముఖాంతర నిర్గతమైనఁ జేతిలో
భాసిలురేఁగుపండు వలెస్వచ్ఛతఁగంఠగతంబులయ్యెడిన్ 86

వరుసగాఁబదు నాలుగు వత్సరమ్ము
లరుగఁబద్మావతీదేవి యంగకముల
యౌవనము పొడమెవసంత మందుఁదీవ
సాఁగి నట్లామె లావణ్య భాగయయ్యె 87

అతిలోక సౌందర్యవతియైన రతిదేవి
చక్కదనంబును చక్కఁజేసి
వేదజడుండైన విధిదార శారదా
సతిపాండితీ ధృతి నతకరించి
భార్యలిద్దరు గల్గు పరమేశు నర్ధాంగి
పార్వతీ పావిత్ర్య గర్వమడఁచి
అతినీల దేహుఁడ చ్యుతపత్ని శ్రీరమా
సౌభాగ్య గరిమంబు సన్నఁజేసి

అందమును బొండితియుఁబవిత్రాన్వితైక
వర్తనము నలంకార సంపదలు గలిగి
దివ్య విభవానఁ బద్మావతీ సతీమ
తల్లిక చెలంగు నందాల కెల్లయగుచు 88

ఒకనాఁడా నృపజాత నిశ్చల మనోయోగైక భక్తిన్ గిరీ
శకుమారిన్ సుమపూజలం దనిపి స్వేచ్ఛా సంస్కృత క్రీడయై
నికటాంతః పురసీమ నాడుకొనుచుండెన్ - యౌవనారంభముల్
సకలోత్సాహ విలాసకేళికి నివాసస్థానముల్ గావొకో? 89

ఆ సమయంబునన్ సురమహామునినాథుఁడు నారదుండు వీ
ణాసముదంచిత ప్రణవ నాద వినోదుఁడు విష్ణుకీర్తనా
భ్యాస కళావిలాసుఁడట వచ్చెను దైవరహస్య కార్య మే
దో సమకూర్పఁబూని జగదున్నత సిద్ధికి విత్తునాటఁగన్ 90

ఆ పద్మావతి మౌనిపుంగవుఁ బ్రియంబారంగఁ బూజించి పూ
జా పీఠంబున నుంచి - భక్తిమెయి స్వచ్ఛంబైన పన్నీటఁద
ప్ఛ్రీ పాదంబులు కడ్గి తజ్జలములన్ శీర్షంబునందాల్చి సే
వా పారీణతఁజెంత నుండెను సఖీవారంబు వేష్టింపఁగన్ 91

నారదుఁడెంతయున్ మదిని నాటిన హర్షముతోడఁ "దల్లి! దై
వారిన నీదు భక్తికిఁ బ్రవర్తిత సజ్జనరక్తికిన్ మహో
దార ముదంబుగల్గె - నిదె తావక భావి మహర్దశా విశా
లోరు విశేష సంగతుల నొద్దికఁ దెల్పెదఁ జేయిఁజూపుమా!" 92

ఆవిధి మౌనిపల్కువినిఅల్లన వామ కరంబు సాఁచి ప
ద్మావతి చెక్కుటద్దముల దంతురితంబులు సిగ్గు దొంతరల్
తీవలు సాఁగ మానసము తీయని ఊహలఁదేల - జంకుతో
భావములేని బొమ్మ చెలువంబున నౌదల వంచి యుండఁగన్ 93

ఆయతిలోక దివ్యపరమాద్భుత రేఖలుగాంచిమౌని ఔ
రా! యిటువంటి గీఁతలు ధరాస్థలి మానవ మాత్రులందు నెం
దే యెడనైనఁగల్గు నాకొ? యెవ్వరికేనియుఁగల్గెనే? సరో
జాయతనేత్ర లక్ష్మి భువియం దవతారముఁదాల్చెఁగాకిటన్ 94

అని తలపోసి చుట్టుఁగల అంబుజ నేత్రలఁ గాంచినారదుం
డనునయమార "ముజ్జగములందున నిట్టి సలక్షణాఢ్యమై
తనరు కరంబుఁజూడ - వినుతంబగు శ్రీ గిరిజా సరస్వతీ
వనితల పాణిపద్మముల పాటిదిగాక మరొండు కల్గునే? 95

సాముద్రిక శాస్త్రంబున
నేమాడ్కిం జెప్పఁబడి రహించునొ అటులే
యీ మానిని కరరేఖలు
ప్రామాణ్యములై చెలంగుఁబరమాద్భుతమై 96

ముల్లోకంబుల నేలఁజాలు విభవంబున్ దెల్పు నీరేఖలీ
ఫుల్లాంభోజముఖీ ప్రభావగరిమంబున్ నెమ్మి వర్ణింప వా
గ్వల్లీ వల్లభుఁడైన పద్మభవుఁడోపంబోఁడు - దైత్యారికే
యిల్లాలై రమణీయ వైభవ కళా హేలారతిన్ గ్రాలెడున్ 97

పరమ శుభలక్షణోపేత సరళరేఖ
లద్భుతంబయి కనువిందు లగుచుఁదోఁచుఁ
బద్మ ఝష శంఖ మకరాది భవ్యరేఖ
లలరు చున్నవి యీ తల్లి హస్తమందు" 98

అని యిటులాడు దివ్యముని ఆననముంగని యొక్కకంజలో
చన వచియించె "నార్య! సురసంయమి! యీరతనాలబొమ్మ శో
భన తను లగ్న సుందరత భావి మహర్దశ వెల్లడింపదే?
హొనుపడు సుందరాకృతి ప్రభూత మహా విభవంబుఁదెల్పదే? 99

వ॥ అని పద్మావతీ సౌందర్యము నా మందయాన అమంద వాక్సుధా బిందు సందోహంబు వెల్లిగొన - సుందర మందిరంబుగా - మకరంద రసప్రవాహ తరంగ సంకులంబుగా నీ విధి వర్ణింపఁ దొడంగె 100

నెఱమచ్చఁగలిగిన నెలరాజు నంద మీ
వన్నెలాడి మొగంబు నెన్నఁగలదె?
రాత్రులు ముకుళించు రాజీవ మీమె వి
శాల నేత్రములకు సాటి యగునె?
ఊదిన మలినత్వ మొందు దర్పణ మీమె
నును చెక్కిళుల సౌరునెనయఁగలదె?
చిలుకకొట్టిన ప్రీలి చెలువేదు దొండ పం
డీయమ యధరమున్ డాయఁగలదె?

చిప్పలం దుద్భవించిన చిన్నరాలు
ము త్తియములీమె పలుబంతిఁ బోలఁగలవె?
తళుకుమని తోఁచి వెంటనే మలఁగి పోవు
మెఱుఁగు తీవలీచెలి తనూగరిమకీడె? 101

జగతినుపమాన వస్తు సంచయముతోడ
నలువ మాచెలి నునుమేను సలుపఁబోలుఁ
గాక యుండిన లోపమొక్కటియులేక
బ్రహ్మ సృష్టి యింతకు ముందు వరలెనెందు? 102

అనుచుఁ బద్మావతీ సఖి యమృతబిందు
తుందిలములగు వాక్కులఁదోయజాక్షి
అంద చందాలు వర్ణింప నాలకించి
తలను పంకించి జడదారి పలికె నిట్లు 103

"దేవతలెల్ల మెచ్చ జలధిప్రియ నందనవోలెనొప్పు ప
ద్మావతి సర్వలక్షణ సమగ్ర సువిగ్రహ గాన సర్వలో
కావన దక్షుఁడైన జలజాక్షుఁడె యీమెను పెండ్లియాడు నా
యీ వచియించు మాటల కొకించుక భిన్నము కల్గనేర్చునే? 104

కులశైలంబులు తల్లక్రిందయిన దిక్కుడ్యంబులే వ్రీలినన్
జలధివ్రాతము లింకిపోయిన ధరాచక్రంబు వక్రించినన్
జలజాతాప్తుఁడు కాంతిఁబాసినను నక్షత్రేశుఁ డల్లాడినన్
లలనా రత్నములార! పొల్లగుచుకల్లల్ గావు నావాక్యముల్" 105

అనుచు మహతి మీటుకొనుచు నారదుఁడేఁగె
నామె యెడఁదఁదలఁపు లందగించెఁ
బ్రాప్తమున్నచోట ఫలము తప్పదటంచుఁ
జెలులు కౌతకమునఁ జెలఁగిరపుడు 106

ధరణి దేవియు నాకాశ ధరణి విభుఁడు
తనయకును బెండ్లి సేయఁగాఁ దలఁచి తమకు
నర్హ సంబంధ బాంధవ్య మరయు కొఱకు
విప్రవర్యులఁబంపిరి వేరవేర 107

స్థిరముగ రాజపుత్రకుల చిత్ర పటంబులు తేరఁబంచి గ్ర
చ్ఛలఁబరికించి అందమును చందము కల్గినవానినెంచి క్ర
మ్మర తమకూతు రూపగరిమంబున వానినిపోల్చిచూచి యే
వెరవున నైనఁబోలమికి వెక్కసమంది పునఃప్రయత్నులై 108

దేశదేశాలఁ బద్మావతీ వధూటి
కన్నివిధముల నీడు జోడైనవాని
మహిత నృప సూను వెదుకంగ మరల మరల
అధిపదంపతుల్ పంపిరి యవని సురుల 109

ఎన్నొప్రయత్నముల్ సలిపి రెంతకుఁగూఁతుకుఁదగ్గ రూప సం
పన్నుఁడు సర్వదిగ్వలయ భాగములన్ లభియింపకున్న - ఆ
తెన్నుఁదలంచి యాధరణిదేవి విషాద నిషణ్ణ చిత్తయై
యున్న ధరాధి నాథుఁడు సముద్గతిముగ్నై దురంత చింతలన్ 110

ఈడు వచ్చిన పిల్ల నింకెన్నినాళ్ళు
పెండ్లిగావింప కింటిలోఁ బెట్టుకొనుట
నవ్విపోదురు జనులన్న నొవ్వుతోడ
రాజదంపతుల్ దిగులొంది రోజ చెడఁగ 111

ఆశయ పాశబద్ధుఁడు గుణాగ్రణి నారదుఁడొక్కవేళ నా
కాశపథాన సాఁగి నరకాంతుని కొల్వునకేఁగుదేర ఆ
కాశధరాధి నాయకుఁడు గౌరవభక్తి వినమ్ర భావనా
వేశత పూజలం దనిపి విశ్వమునీంద్రుని గాంచి యిట్లనున్ 112

"సారదమౌనిచంద్ర! కరుణాగుణసాంద్ర! గతార్తపుణ్యమే
పారఁగఁబండి మీరిటకు వచ్చితిరింక మదీయ భాగ్యమే
నూరకఁజెప్పనేల?పునరుక్తిగదా! మముఁబోఁటిబద్ధ సం
సారులనుద్ధరించుట ప్రశస్త చరిత్రుల లక్షణంబగున్ 113

స్వామీ! తాపస వంద్య! మా దుహితయౌ పద్మావతీ దేవికిన్
శ్రీమంతంబగు పెండ్లియీడు చనుదెంచెన్ - దన్మహారూపరే
ఖామాహాత్మ్యముచెంత శీతకరరాకా కాంతిలో దివ్వెలై
భూమీ శాత్మజలింత మాత్రమయినన్ బోల్పంగ రారేమిటన్ 114

మీరుసదా త్రిజగత్సం
చారులుగద మీవిహార సరణుల నర్హుం
డౌ రాజకుమారుఁడు సమ
కూరిన నెఱిఁగింపవె మునికుల సూత్రామా!" 115

వ॥ అని విన్నవించు నారాజలలాముంగనుంగొని 116

దేవమునీంద్రుఁడీ పగిదిఁదెల్పెను "ఓ ధరణీ తలేంద్ర! ప
ద్మావతి లక్ష్మి యంశమున ధాత్రి జనించెను - విష్ణువేజగ
త్పావనశీల నీదుసుత పాణి గ్రహించును అల్లువానికై
నీవిటులార్తిఁగుందకుము నిక్కము నాపలు కాదరింపుమా! 117

అరయన్ వేదవతీసతీ తిలక మత్యంతంబు నీపట్టియై
ధరణింబుట్టె రమాధినాథు వరముద్రన్ జిత్తమందుంచి - వేం
కరలాడంబని లేదు శ్రీహరియె యీ వామాక్షిఁ బెండ్లాడు - భూ
వర! కల్యాణముహూర్తకాలము సమీపంబందె వర్తించెడున్ 118

కావున విచారమేఁటికిఁ?
గావలసిన కార్యమెల్లఁగడతేరు" నటం
బావలికేఁగెను నారదుఁ
డావిభుఁడానంద వార్థియందు మునింగెన్ 119

## సోపానాంతము

శ్రీ లక్ష్మీ హృదయామృతాంబుధి చరత్క్రీడామరాళా! ప్రసూ
నాలంకార మనః ప్రమోదితకళా! ఆనంద రాజ్యప్రదా!
కాలాకార! జగన్నివాస! కరుణా గంభీర దుగ్ధార్ణవా!
గోలాంగూల సహాయ నిర్మథితరక్షోవంశ నీరాకరా! 120

దయావన ధరాజనా! తరుణ శుభ్రవీక్షారుణా!
ప్రియోన్నత కళాధవా! వివిధ వేదభావోద్భవా!
భయార్తి వినివారణా! భవసముద్ర సంతారణా!
క్రియాచరణచారణా! శ్రితమనోజ్ఞ వాక్తోరణా! 121

దయావారిరాశీ! సుధావాగ్విలాసీ!
జయాలంకరిష్ణు ప్రశాంత ప్రకీర్తీ!
నయోద్దామ విజ్ఞాన నవ్యప్రశస్తీ
వియచ్చుంబి తానంత పృధ్వీప్రవాసీ 122

# పద్మావతీ శ్రీనివాసీయము

## పంచమ సోపానము

శ్రీ గరుడగిరి నివాసా!
నైగమ వీధీవిలాస! నవ్యవికాసా!
సాగరఫేన సుహాసా!
వేగాధిక ఖగశతాంగ! వేంకటనాథా 1

అవధరింపుము 2

సకల విద్యాసనాథుండు - సరస చతుర
వచన రచనా ధురీణుండు - ప్రబలకీర్తి
వర్ధనుండు పౌరాణిక ప్రథముఁడైన
సూతముని(జూచి జటివరస్తోమ మెల్ల 3

"తదుపరికథ నాలింపఁగ
మదినుత్కంఠ మొలకెత్తె మంజుల వాక్పం
పద వివరింపుడు విద్యా
వదనా! హయసదన చరణ సరసిజభజనా!" 4

అనుచు వచియింప నానంద మందిసూతుఁ
డాతతజ్ఞాన కౌశలా న్వితుఁడగుచు
శ్రీనివాస కల్యాణ పుణ్యానుభవము
కలుగ నేర్చునే? గతజన్మ ఫలములేక 5

వ॥ ఆవలికథ వినుండని సంయమి పుంగవులకిట్లు వచింపందొడంగె 6

వకుళామాతృ సపర్యలన్ సుఖముగా వర్తించుచున్ సర్వనా
యక శైలంబున శ్రీనివాసుఁ డొకనాఁడాఖేటకేళీ కళో
త్సుకుఁడై శేషనగాగ్రకందర మహాదుర్దాంతకాంతార సీ
మకునేఁగం దలపోసి మాత్రనుమతిం బ్రార్థించె నెయ్యంబునన్ 7

ఆయమ పల్కెనిట్లు "తనయా! చెరలాడెడు క్రూరసత్త్వముల్
పాయక వ్యాఘ్రసింహకరి భల్లుక సర్పలులాయముల్ వనిన్
శ్రేయముకాదు వేట - పెరచింతలు మాని భుజించి యింటిలో
హాయిగ నుండలేక తగునా? ఇటువంటి యనర్థ కృత్యముల్" 8

అనినన్నవ్వుచు శ్రీనివాసుఁడు ప్రియంబారంగ "నోయమ్మ! నీ
తనయుండెంతటి వీరవిక్రమ రసాధారుండొ భావింపలే
కనుమానంబు వెలార్తు వీ మృగములుద్యద్దావకీలాతతిన్
జను శుష్కాటవిఁబోలె దగ్ధమగు నా నారాచ ధారాహతిన్ 9

అవి నన్నుం జెనకంగఁజాలవు భయం బావంత లేకుండఁదే
కువ వేటాడఁగఁ బంపుమమ్మ! జననీ ఘోరాటవిం గ్రూర జం
తువులంజంపి మహర్షి వర్యులకు సంతోషంబు తోఁబాటు ని
త్య వనీ చారులకుం బ్రకృష్టమగు భద్రంబేను కల్పించెదన్ 10

కావున నమ్మి నాకడఁకఁ గాదనకమ్మ' అమోఘమైన నీ
దీవనలిచ్చి పంపు" మనఁదృప్తమతిన్ వకుళాలలామ "పు
త్రా! వెనక్షేమ మారఁజని లాభమునం జనుదెమ్మనన్ బ్రియం
బావహిలన్ మహాదృఢ శరాసన నిష్ఠుర బాణపాణియై 11

కత్తళముఁదాల్చి పదనైన కత్తిఁబూని
వీపునందుఁదూణీరమున్ బిగియఁగట్టి
అఖిల జగముల నేలు శేషాద్రి విభుఁడు
ఖిల్ల యువవేషధారియై వేడ్క మీరి 12

వడికాకోదర శైలసానుగహన ప్రాంతంబులంజేరి అ
ల్లడి పెంపొందఁగ నారిఁగూరిచి ధనుష్టంకారముంజేయఁగాఁ
బిడుగుల్ గుంపులు పడ్డ మాడ్కిధ్వనియుర్వీవ్యోమ మధ్యంబు ద్ర
బ్బిడవేయన్ భయదోగ్రజంతు తతి బెంబేలెత్తి పర్వెత్తఁగన్ 13

ఆ విధిఁజెల్లా చెదరగు
నావన సత్త్వముల దుర్భ రార్తారవముల్
తీవరమైరోదోంతర
మావేశించెను శిఖరి గుహలు మార్మ్రోయన్ 14

కాంద్రుకాంద్రు మటంచు గాండ్రించు నున్మద
శార్దూల సంఘాలఁ జంపి చంపి
ఘోరగర్జన దిశా కూలమ్ము లగలించు
కొదమ సింగంబులఁ గూల్చి కూల్చి
క్రూర భీకరమైన మోరలు పైకెత్తు
కారెను బోఁతులఁ గడపి కడపి
వాయువేగంబును బాటించి పర్వెత్తు
అడవి పందుల పీచమడఁచి యడఁచి

లేఁటి కదుపుల చెర్లాట మాటి మాటి
ఖడ్గమృగ తండములఁబట్టి కసిమసంగి
శ్రీనివాసుండు మృగయా విశేషకేళిఁ
గరము విహరించె నడ్డమాకయును లేక 15

సాఁ లెకు నిట్లు వేట కొనసాఁగుచునుండ మదేభఘోర ఘీం
కారము వీనుదోయిఁ బడఁగా ధ్వని వచ్చెడు దిక్కునెంచి - తీ
వ్రారముఁడై యధిజ్య విశిఖాసనుఁడై గుణనిస్వనంబు ది
గ్వారము వ్రక్కలింపఁ జని వారణముంగనె నాతఁడచ్చటన్ 16

గొనయం బెక్కిడి దానిని
దునుమఁగ వెనువెన్కవచ్చె దుముకుచు నాతం
డనువుగ పరువిడి ఆకరి
కనుపింపకపోయె నిబిడ కాననసీమన్ 17

తానట యెల్లెడన్ వెదకి దప్పి జనింపఁగ వేంకటేశుఁ డెం
తేనియుఁ దూలిసోలి గజమేడకుఁ బోవును? మానసంబు స్వా
ధీనము కాదు దాహమును దీర్పకొనందగునంచుఁ జెంతను
ద్యానములోనికేఁగె మలయానిలమాలిక స్వాగతంబిడన్ 18

ఆ వనవాటి స్వేచ్ఛగ విహారమొనర్ప సఖీ సమేత ప
ద్మావతి వచ్చెనాఁ డటకె దైవవశంబున వారలెల్ల సం
భావన మీరఁబూ పొదలఁబాదు లొనర్చి జలంబుపోసి వ
ల్లీవళులన్ మనోజ్ఞ రసలీల రసాలములంటఁ గూర్చుచున్ 19

కొమరారు నీలి ముంగురుల నేలెడు గండు
తుమ్మెద కదుపులఁ ద్రోలి త్రోలి

తఱచుగాఁ దమపలువరుస స్నేహముగోరు
మల్లెపూమొగ్గల గిల్లిగిల్లి

తమ కన్నుగవహొయల్ తమి దొంగిలించెడు
కుముద కోరకములఁ గోసికోసి

నతనాభి బిలముల జతఁగోరు సుడిగుండ
ముల సరోజలకేళిఁగలఁచి కలఁచి

పాణితలముల నీడుగాఁ బాటుపడెడు
చివురుటాకుల జొంపముల్ చిదిమి చిదిమి
పూవులం గోసి కుప్పలువోసి పోసి
ఆటపాటల గడిపి రుద్యానవాటి 20

కైవసమైనశ్రాంతిఁ జెలికత్తెలతో విహరింపమాని ప
ద్మావతి తారకానికర మధ్యమునన్ శశిరేఖగా సుధా
స్రావ కటాక్షవీక్షణ పరంపరసాఁగ సఖీసమేతయై
పూవులతావులీను తరుమూల శిలాగ్రమునన్ వసించియున్ 21

రాలుకరుగంగ మధురమరంద ధార
లూర మోడులు చిగురించి సొరు మీరఁ
గోకిలల్ పాటవిరమించి కొసరి వినఁగ
గాన మొనరింపఁదొడఁగె నాకంబు కంఠి 22

అరుసంబారఁగ శ్రీనివాసుఁడు తదుద్యానాంతరాంచ త్సరో
వర నీరంబులు గ్రోలి - తత్సరసి యభ్యర్ణప్రదేశంబునన్
దరు మూలంబునఁ జంద్రకాంతమణి సంధా శుభ్ర పీఠంబు పైఁ
బరమానందత విశ్రమించె మృగయా ప్రాప్తశ్రమల్ పాయఁగన్ 23

అట్లు కూర్చుండి మృదుమలయానిలోర్మి
వీచికలఁదేలి మెలమెల్ల వీనుదోయిఁ
దేనియలు పండఁ బులకలు తెట్టువులుగ
నలరు గాంధర్వ సంగీత మాలకించి 24

తీవలఁ బూవుతావులను తీయఁగ సాఁగు మనోజ్ఞగాన వీ
చీ వలయంబునన్ మునిఁగి చిత్తము రాగరసార్ద్రమై కళా
జీవనదీ తరంగ రసశీకరమైత్రి వహింప - మాధురీ
సేవధి శ్రీనివాసు చెవిఁజేకొని తన్మయతన్ ఘటింపఁగన్ 25

ఆరాగం బనురాగ రంజితముఁగా నారామ మార్గంబులన్
జేరంబోయి సఖీపరీతయగు రాజీవాక్షి పద్మావతిన్
దారామధ్యమునన్ హిమాంశుకళగా దర్శించి లోకోత్తర
శ్రీరమ్యంబగు నామె చక్కదనమున్ జిత్తంబునన్ మెచ్చుచున్ 26

ఆహా! మానవ లోకకాంతలకు నీయందంబు పెంపొందునే?
యూహింపన్ దివిజాప్సరోరమణులీ యొయ్యారి కాల్గోటికిన్
సాహ స్రాంశముఁబోలఁజాలుదురె? విశ్వస్తుత్య సౌందర్య సం
దోహంబున్ విధిరాశివోసి సలిపెంబో యిట్లు బాలామణిన్ 27

చను మొగ్గలా? కాదు మనసిజు నునుచేతి
జాళువా బంతుల జంటగాని

కన్నులాయివి? కావు వెన్నెల వాగులో
విరిసిన చెంగల్వ విరులుగాని

ముంగురులా? కాదు మోము దామరలోని
తేనె సోనలు గ్రోలు తేంట్లుగాని

కటిబంధమా? కాదు ఘనశైల పతయాళు
ఝరిఁదోఁచు సైకత స్థలము గాని

మోవియా? కాదు నునుజుంటి బావిగాని
వదనమా? కాదు వెన్నెల పాదుగాని
ఆరగునె? కాదు మారు కటారి గాని
కన్నెయా? కాదు పసిఁడి పూ దొన్నెగాని 28

ఈ శృంగారవతీ శిరోమణిని స్వాభీష్టంబు లీడేర సౌ
ఖ్యాశావల్లరి పల్లవింపఁగ వివాహం బాడు నెవ్వండొ? వా
డే శాసించు జగత్త్రయంబుఁబ్రభువై - ఈ ముద్దుగుమ్మన్ సుధా
రాశిం బంగరు బొమ్మనే వలపు లూరన్ నెమ్మిఁ బెండ్లాడెదన్ 29

ఇంతకు నీమె కన్యకయొ? యెవ్వని నైనను బెండ్లియాడెనో?
సుంత యెరుంగ - నెట్లు పర సుందరిపైఁ బ్రసరించు నామనం?
బింతటి యింగితం బెఱుఁగదే హృదయం? బిఁకయీమెయే ధరా
కాంతుని పుత్త్రి కామణియొ? గ్రక్కున నిక్క మెఱుంగఁ గోరెదన్ 30

చాటును మాటులేల? పెలుచన్ పిరివీకులు సాకులేల? యీ
పాటలగంధి సన్నిధికి వైళమనేఁగి తదీయ వృత్తమున్
నీటగు నీమెనోట విని నిక్కమెఱింగెద నంచు నాజగ
న్నాటక సూత్రధారి గమనత్వరఁజొచ్చుకు వచ్చు చుండఁగన్ 31

ఆనృపజాత బోఁటులకు నాతనిఁజూపి "వధూటులార! ఈ
జానగు రాచతోఁటఁజొరఁ జాలదు సుమ్మొకపోతుటీఁగయున్
మానవనాథ సైన్య పరిణద్ధ నిరంతర రక్షితంబ - యి
ద్దానిని చొచ్చి ప్రాణములు దాల్చి యెవండు ధరిత్రి నుండెడున్? 32

ఈ విధి వచ్చుచున్న యితఁడెవ్వఁడొ? వేషముఁజూడ వేటగాఁ
డీ వనవాసికిందెలియునే మననాగర సంప్రదాయముల్?
కావిరి క్రమ్మెనే కనులఁ? గన్యలకున్ విహరింప నర్హమౌ
ఈవనిఁబూరుషుల్ చొరఁగ నెట్లు సహింపఁగవచ్చు నెమ్మదిన్? 33

ధరణి ధవుఁడెఱుఁగ నుసురులు
సరగునఁజను వీనిదేహ సంధుల వెంటన్
వెరవెరుఁగక యే పనికై
యరుదెంచెనొ తెలిసి వచ్చి యంతయుఁజెపుడీ!" 34

అని పద్మావతి ఆనతీయ చెలు లత్యంతోరు వేగానఁద
త్క్షణ మందచ్చటికేఁగి అతనిని సందర్శించి త్రైలోక్య ర
క్షణ భారావహ చాతురీ విభవతా గంభీరసౌందర్య భా
జన తేజోమయ సూనసాయక సహస్ర స్వచ్ఛకాంతిప్రభున్ 35

 మొవ్వ వృషాద్రిపతి

అతులాసక్తి శరీరమెల్లఁగనులై ఆమన్మథాకారు - స
న్నుత సంచారు - మునీంద్ర వందితముఖేందువ్యాప్త తేజోమయా
క్షత విజ్ఞానవిహారు - సర్వజన రక్షాదక్ష సంసారు - నం
చిత వేదప్రతి పాదితక్రమకళా చిత్రప్రచారాక్షరున్ 36

కని "యోభిల్లవరేణ్య! యెవ్వఁడవొ? యే కార్యంబుఁగాంక్షించియీ
వనికేతెంచితొ? నామధేయ మెదియో? వాసస్థలం బెద్దియో?
జనపాలాగ్రణి యానతిందలఁపవో? సంప్రీతి రాజాంగనా
గణ మిందున్ జలకేళి హాయిగఁ జెలంగన్ నీవురాఁజెల్లునే?" 37

అని ప్రశ్నించినఁ "గాంతలార! విషయంబామూల చూడంబుగా
వినిపింతున్ వెనమీ నృపాత్మజకు సంప్రీతిన్ బొదం"డంచుఁదో
డ్కొని పద్మావతి చెంతకుంజన మహా కోపంబుతో నామె శ్రీ
శునిఁదాఁబోల్చు కొనంగలేక మృగయక్షుద్రుండుగా నెంచుచున్ 38

"ఏదేశంబు నివాసభూమి? వనితా హృద్యానవద్యప్రియా
హ్లాద స్వైర విహార సుందర పురోద్యానంబు సుమ్మిద్ది బ్ర
హ్మాదుల్ గూడను కన్నులెత్తి కనరీ యారామ సౌందర్య మీ
వేదో వచ్చితి మళ్ళిపొమ్ము బ్రదుకీ వేమాత్ర మాశించినన్ 39

ఆ మాటలకుఁ బరంధాముండు ముదమంది
వ్యాజ పూర్వకముగా బదులుపలికె
ఒంటరివాడ నావెంట నొక్కఁడులేఁడు
అందరి వెంట నే నుందు సతము

ఇచ్చోట నెలవన నెచ్చటయునులేదు
ఈ విశ్వభువనముల్ నావి సుమ్మ

తొల్లిలక్ష్మిదేవి తోడుండె - నిపుడామె
తొలఁగి పోవుట దరిద్రుండనైతి

ఇద్ది నా చరిత్ర ముద్దియ! నీతల్లి
దండ్రు లెవరు? జనన ధాత్రియెద్ది?
అంద మెసఁగు నీదు నభిధాన మెయ్యది?
తెలుపుమమ్మ బేల! దివ్యబాల!" 40

వ॥ అనినఁ బద్మావతీదేవి మాయా కిరాతున కిట్లనియె 41

"ఓయి! బోయవాఁడ! శ్రీయుతుండాకాశ
రాజు నాదుతండ్రి - రమ్యశీల
ధరణిదేవి నాదుతల్లి - పద్మావతి
పేరఁబిలుతు రెల్లవారు నన్ను 42

హెచ్చుగ జాగుసేయకిపుడీ యెడఁబాసి చనంగమేలు - నీ
చొచ్చినచొప్పు తేఁడెఱుఁగు చో మెడపైఁదలయుండఁజాల - దీ
ముచ్చటలింకనేల? వ్యథఁబొందిన లాభము కల్గఁబోదు - నీ
యిచ్చకు వచ్చినట్లు చరియించినఁదప్పనె రాజదండనల్?" 43

అనవిని శ్రీనివాసుఁడు ప్రియంబున నవ్వుచు "శ్రీ వికుంఠప
త్తనమును వీడిపేరలుక ధాత్రికి వచ్చిన లక్ష్మివంచు నా
మనమున నెంతు నిన్నుఁదరమా నిను వర్ణనసేయ బ్రహ్మ - కా
తని సతికిన్ ఫణీంద్రునకుఁ? దన్వి! నరాంగనవా? నిజంబుగన్ 44

ఓయతిలోక సుందర మహోజ్జ్వల దివ్యతనూవిలాస! నీ
ప్రాయము సౌకుమార్యముఁబ్రవర్తన చక్కదనంబు సర్వని
శ్శ్రేయస లక్షణంబులును బృథ్విని మానవకాంతలందు ను
న్నే? యిఁక నిన్నువీడి చననేర్తునె? పోవఁగఁగాళ్లు సాఁగునే? 45

చాపరికం బికేల? ప్రమదా! ప్రమదంబును గూర్చె నీతనూ
ద్దీపిత దివ్యసుందరత - తీవ్రతమంబగుచుండె నామన
స్తాపము - నీవులేక మనఁజాలను కోపము మాని సత్కృపా
రోపిత చిత్తవై ప్రణయరూఢి వరింపుము ప్రేమమీఱఁగన్" 46

అనిపలుకు శ్రీనివాసుని
వినఁగాఁజవిగాని వాక్య విన్యాసమునన్
మిను మన్నులంట మండుచుఁ
గను దోయింకెంపు లడరఁ గసరుచుఁబలికెన్ 47

"ఓయి! వేటగాఁడ! యెక్కింత తారత
మ్యమ్ము నెంచకుండ నడలె దీవు
ప్రణయ మానసేయ ప్రళయమ్ము జృంభించు
వెఱ్ఱిమొఱ్ఱ లిట్లు ప్రేలెదేల? 48

ఏరా! మూర్ఖుఁడ పెండ్లియాడవలెనా యేనిన్ను? దుశ్చింతతోఁ
బోరాముల్ కడుకూయఁచుంటి వకటా! భూమీశుఁడాలించుచోఁ
గూరాకున్ వలెఖండ తుండెములు గాఁగోయించు నీనాకలున్
ఘోరారణ్యములందుఁ బిట్టలనిటుంగొట్టంగ శూరుండవా? 49

అడవులందుఁదిరుగు తడవింటి బోయకుఁ
బృథ్విఁజేనికూఁతుఁ బెండ్లియాడ
వలసివచ్చె నేమి పలుకంగ నోచెల్ల!
తొలఁగిపొమ్ము బ్రదుకఁదలఁచితేని?" 50

తీవ్రమైన క్రోధమునఁ దిట్టినతిట్టును తిట్టకుండఁబ
ద్మావతి తిట్టుచుండ నతిమాత్రదరస్మిత వక్త్రుడై ప్రపం
చావనుఁడైన స్వామి "భవదద్భుతరూపవిలాస విభ్రమ
శ్రీ విలసిల్లి నన్నువెతఁజిక్కఁగఁజేసెను గాదె సుందరీ! 51

ప్రేమకు మానసంబె ప్రభవింపఁగహేతువు - నీదుసంపదల్
మామక జీవనప్రణయ మాధురికెట్లవలంబ? మవ్వినా
కేమియు వద్దు - నిన్ను వరియింపక జీవతమే వృథాకదా!
కోమలి నాదుమాటవిని కూర్మిననున్ వరియింపవేడెదన్" 52

అనుచుంజెంతకు వచ్చువానిఁగని "ఆహా! యింకసైరింపరా
దనువుండప్పెడు వీఁడటంచు నతుల వ్యగ్రాగ్రహోదగ్ర భీ
షణమై "యీతనిరాళ్ళఁగొట్టి బలిమింజంపుండు పొం" డంచు నా
జ్ఞ నొసంగెన్ దనచెల్మి కత్తెలకు తీక్ష్ణంబైన వాగ్వైఖరిన్ 53

రాజకుమారి యాజ్ఞ తొలిరాయివలెన్ వెలువడ్డ వెంటనే
ఆజవరాంద్ర పిండు విలయాంబుద బృందమువోలె రాలనెం
తో జడివానగాఁగురియ నూపిరియాడక శ్రీనివాసుఁడు
త్తేజముఁదక్కెఁ గాయమును తీవ్రవపుగాయము లాక్రమింపఁగన్ 54

మొవ్వ వృషాద్రిపతి

తాళఁగలేని దెబ్బలకుఁ దాల్మివహించుచుఁజేయిఁజేసి కోఁ
జాలక స్త్రీలపై భుజగశైలముఁజేరఁగనేఁగెఁ బొంగి ధా
రాళముగా స్రవించుచును రక్తపుధారలు తచ్ఛరీరమున్
బాలు గొనంగ నొప్పెజలపాతము శృంగముఁగప్పుకై వడిన్ 55

ఆనందంబున వేటకుంజని విషాదాక్రాంత చిత్తంబుతో
న్యూనంబైన మనోవికాసగతిఁ జెన్నుంబాసి కీలాల ధా
రానిష్యంద తనూవికారుఁడయి చేరన్వచ్చు శ్రీవాసు దూ
రానం గన్గొని కొందలించుమది నార్తచ్ఛన్నయై డాసియున్ 56

"ఓయికుమార! వేటకొఱకుత్సుకతంజని నాఁడవిట్లు నీ
కాయమునిండ శోణితము క్రమ్మిస్రవించెడు హేతువేమి? యీ
గాయములేమి? పోయగము కాంతిని బాసిన చందమామగా
రాయిడి చెందియున్న యదిరా! యిదియేమి తనూజ! చెప్పరా! 57

క్రూరమృగంబులేవయిన క్రుమ్మెనొకొమ్ములతోడ? దంష్ట్రికా
వారముతోడఁజీరినవా? వాఁడి నఖంబుల గ్రుచ్చియెత్తెనో?
దారుణ దుష్టవృత్తిబలితంబుగ దుష్టుఁడెవండొ కొట్టెనొ?
వేరయొకండు పద్ధతియొ? వేగమతెల్పుము దాపకుండఁగన్ 58

ఎంతగనిట్లువేడ బదులేమియుఁబల్కక వెచ్చనూర్పుచున్
జింత వహించి మోహమునఁ జిక్కితపించుచుఁబుల్కు పుల్కనన్
వింతగఁజూచు పుత్రుఁగని వేదన సైపఁగలేక దీనయై
చెంతకుఁజేరి యావకుళ చెప్పెనెపంబిడివంతఁ గుందుచున్ 59

"అక్కట! యొక్కమాట బదులాడవు - చూడవు - తల్లిపాటు నీ
కక్కరలేదు తల్లిపయి నబ్బిన గౌరవమిట్టి పాటిదా?
తక్కక కష్టసౌఖ్యములు తల్లికిఁజెప్పకొనంగరాదె?యే
మక్కువ జూపినన్‌సరె స్వమాతనె? పెంపుడు తల్లినేకదా!" 60

అనుచున్ నిష్ఠురమాడు తల్లిఁగని "అమ్మా! నీవు నాతల్లివే!
విను నీయొద్ద రహస్యముల్ గలవె? నేవేటాడఁగాఁబోయి కా
ననసీమన్ బహుదాహపీడితుఁడనై నానాశకుంతోత్కర
ధ్వని సంకీర్ణ దిశామనోజ్ఞమగు నుద్యానంబునంజొచ్చితిన్ 61

అందులనొక్క నిర్మల జలాశయమందు జలంబుఁద్రావి అం
దందు చరించు పూవిలుతు నమ్ముల దిమ్మనడంచు సుందరీ
బృందముఁగాంచి - యందు దివిరిక్కల చక్కలిగింతఁదేల్చు ది
వ్యేందు కళాభిరేఖయన నింపును నింపెడు కన్నెఁగాంచితిన్ 62

అద్ది ఆకాశరాజు నుద్యానమంట
అమ్మ! నేఁగన్న చిన్నది యతని కూఁతు
రంట - సౌందర్య దివ్యశిల్పాభిరామ
పేరు పద్మావతి యటంచు వింటిఁదల్లి! 63

అట్టి చక్కని చుక్కనే నరయలేదు
ముజ్జగమ్ముల నాయమకుజ్జిలేరు
ఆమెనే పెండ్లియాడఁ బేరాస కలిగె
నాయభీష్టము వినిపించి నాఁడఁదనకు 64

ఆయమ నాదుమాటకు దురాగ్రహ విగ్రహ యౌచుమండి "ఈ
బోయను గొట్టిచంపు"డని బోటుల కాజ్ఞ యొసంగ వారలున్
గోయని అర్చిరాళ్లగొని కొట్టిరి బిట్టుగ నన్నునింకనేఁ
జేయున దేమిలేక యిటవెచ్చెర వచ్చితి - నిల్లు చొచ్చితిన్ 65

ఆమె అందచందాలు నాయంబకముల
యందెవ్రేలాడు చున్నవి - ఆమె పొందుఁ
జెందలేకున్న వ్యర్థము జీవితంబె
శాశ్వతముగ నుండెద బ్రహ్మచారినగుచు 66

నావుడు "శ్రీనివాస! తగునా? యిటువంటి ప్రమాదకార్య మం
దీవిధిఁగాలు వెట్ట? మనమెచ్చట రాజకుమార్తెయేడ? భూ
మీ విభుఁడిద్ది విన్నఁదలమీఁదికి వచ్చును తారతమ్యముల్
భావన సేయకుండఁబొరపాటున దుందుడుకుల్ పొనర్తురా? 67

స్థానాస్థానము లుండఁగా వలదె నిద్దంబారఁ బ్రేమింప? ఏ
గానీలేని దరిద్రుఁడల్లుఁడనఁగాఁగ్రై కొందురే అష్ట భా
గ్యానందుల్ వసుధాధినాథులు? కుమారా! మానుమీయూహలన్
వీనిన్ గొంతెమ కోర్కులంచు జనులెంతేగేలిఁగావింపరే?" 68

అని బోధించి హితంబులంగఱపి తానౌచిత్య వంతమ్ముగా
వినయస్ఫూర్తి నయమ్ముదెల్పుజననిన్ వీక్షించి హర్షించి నె
మ్మన మాద్యంత కృపాప్రరోహితముగా మన్నించి మాయాప్రవ
ర్తన శీలుండు స్వతత్త్వమున్ దెలుప సత్యశ్రీ యుతుండిట్లనున్ 69

"అమ్మా! నీకు రహస్య తత్త్వ మొకటాద్యంతంబు విన్పింతు లో
కమ్ముల్ బ్రోచెడు పద్మనాభుఁడ నెదో కార్యంబునన్ భేదభా
వమ్ముల్ నెక్కొన లక్ష్మినన్ విడిచి యేవంబోయినన్ దద్వియో
గమ్మున్ సైపఁగలేక శేషగిరి శృంగం బందు వాసించితిన్ 70

రాముఁడనై నిశాచర విరాముఁడనై స్థిరధర్మ రక్షణో
ద్దాముఁడనై యరణ్యమునఁ దాపసవంశ సముద్ధృతి క్రియా
ధాముఁడనై జనస్థలి ముదంబున నుండఁగ రావణుండు దు
ష్కామ దురంత వర్తనుఁడు కల్మష చిత్తుఁడుదగ్ర వంచనన్ 71

నా నిజజీవితం బయిన నాతిని సీతను దొంగిలించి లం
కానగరంబు నందుఁగడఁకన్ బదిమాసములుంచె నీచతన్
వానర వీరసైన్య పరివారుఁడనై చని వార్ధిఁగట్టి ఆ
దానవు నాజిఁజంపితిని తద్ధిత మంత్రిచమూయుతంబుగన్ 72

లోకులు కాకులించుకయు లోపములేకయె కాఱులాడి వీ
కాకొనరింతు - రట్టి యెడఁగంటికిఁదాఁకెడు పుల్లయున్న దు
ర్వాకులు ప్రేలకుండుదురె? వాని నెఱింగి చరింపమేలు - నే
నాకులపాటడంగ జనకాత్మజ శీలముఁ జాటనెంచితిన్ 73

ఆ విధినెంచి మైథిలి మహాంచిత లోకపవిత్ర వంద్యమౌ
పావనశీల వర్తనము భావనందు నెఱింగియున్ మహా
పావక కీలలం జొరఁగఁబాడిఁదొరంగి వచించినాఁడఁద
ల్లీ! వసుధాపవాదభయ మింతటి దుర్ణయమున్ వహించెఁబో 74

సీతమహాగ్ని గంధ సరసింబలెఁ జొచ్చిన నిద్దరన్ ధరా
జాతల జాతవేదుఁడు ప్రజాపతి యబ్బుర మందఁదెచ్చి" యీ
నాతియెసుమ్ము - వేదవతి నా జను కన్నియ - లంకలోన భూ
జాతకు మారు నిల్పెను నిశాటకులాధిపు మోసగించుచున్ 75

నా కడదాచితిన్ జనక నందన సీతను - శ్రీరాఘూద్వహా!
ఆ కమలా వధూటి యిటు లాకృతులన్ ధరియించె రెండుగా
లోకమునందు నిద్దరుచెలుల్ వృషభంబులు మూఁడు కల్గినం
జేకురు సౌఖ్య సంపదని చెప్పుదురార్యులు - గైకొనం గదే! 76

అనునెడ సీత నన్నుఁగని "ఆర్యసుతా! దశకంఠు బందియై
అనుపమమైన వేదనల కగ్గముగాఁబలుపాట్లు పొందెనీ
వనజదళాక్షి - నిశ్చల తపంబొనరించెమిమున్ వరింపఁగ
న్నన ననబోఁడి కప్పుబడినారము నీవును నేను తీర్పఁగన్ 77

కావునఁ బాణిగ్రహణము
కావింపుమ యీమెననుచుక్ష్మా సుతవేడన్
భావంబున గడువిస్మయ
మావేశింపంగ బొమ్మయనఁగ నిలిచితిన్ 78

ఎంత యుపకృతింజేసినఁ
గాంత మరొకకాంత సతిగఁగైకొను మంచున్
సొంతమగని వేడునెథర?
నింతకు వీరిద్దరొకటియే యనుకొంటిన్ 79

సోపానము

వీతి హెూత్రుండు సీతను వేదవతిని
దెచ్చి చూపించి వేదవతీ లలామ
పొనరఁజేసిన యుపకారములు వచింప
హృదయసీమ కృతజ్ఞతా హ్రదమునయ్యె. 80

సీ సుధారసము కాల్వలు గట్టఁగ నాత్మభక్తి మై
కేసినట్టి యుపకారము కూరిమిఁబెంపుసేయఁ గన్
తజ్ఞతా భరముఁజాటుచు వారల వంకఁజూచి యీ
విప్పి చెప్పితిని తేనియ వాకల జోకలైచనన్ 81

తారమందు నొకటేసతి - యొక్కశరంబె - యొక్కటే
ాటు - సత్యమయ వర్తన మక్షయ మార్గదర్శకం
ారు లోకముల కన్నిటి - కీనియమంబు భంగమై
ం కోర్వఁజాల నిదెతోయధులింకిన భూమి జంకినన్ 82

మె నీ కలియుగంబున శేషనగేంద్రసీమ - భ
క్షు. సంచరిలునప్పుడు తప్పక స్వీకరింతు నా
కంబు వ్యర్థమగు టెన్నదుఁగల్గ" దటంచుఁదెల్పి సం
ారవారలను బంపితి - మాటను నిల్పుకోవలెన్. 83

పూతచరిత పద్మావతి పుడమి యందు
దొరికెనాకాశ రాజను ధరణి పతికి
ఆమె మానవకాంత కాదనఁగ వేర
యేమి సాక్ష్యంబు కావలెనింక జనని! 84

మొవ్వ వృషాద్రిపతి

నెమ్మి రామావతార కాలమ్మునందు
వారికిచ్చినమాట కాపాడుకొనఁగఁ
గంటవత్తులు నిడుకొని కాంచుచుంటి
నామెకొఱకయి సకల దిగంతములను 85

నేఁడు పూఁదోఁటలోఁదమి వాడునామెఁ
గాంచి గుర్తించి పలుక వాంఛించినాఁడ
ఆమెనన్ను గుర్తించినయట్లు లేదు
ఆమెనెటులైనగాని పెండ్లాడవలయు 86

తల్లివియైన నాకిపుడు తండ్రివియైనను నీవకావె? నా
యుల్లము పల్లవింపఁజని యుర్వీపతింగని యీ విశేషముల్
తెల్లమొనర్చి పెండ్లికిని తెన్నుఘటించి బిరానరమ్మ ఓ
తల్లిరో! నీకుగాక విదితంబుగ నేరికిఁ జెప్పుకొందునో?" 87

ఆ విషయాళిఁదా ననునయంబున నెమ్మదిఁ బూసగ్రుచ్చిన
ట్లా వకుళామతల్లికకు నర్మిలిఁ జెప్పియు నానుపూర్విగాఁ
బూవుతుటారిజోదు విరిపూపల తూపుల కోపలేక పె
ల్లావటిలెన్ వియోగ బడబానల కీలలకొగ్గి గ్రుమ్మగుచున్ 88

శ్రీనివాసుండు రక్త సంసిక్త దేహుఁ
డగుచు నటు బాసి చనిన క్షణాంతరమున
రాకుమారి తపించి విరాళిఁదూలె
వెఱకు సింగాణి దొరచేతి చిలుక వోలె 89

ఆతఁడు వేటగాఁడను భ్రమాన్వితయై ప్రహరింపఁబంచెఁగా
నీ తన కన్నుదమ్ముల వినిశ్చలతంగొనెఁగంటి పాఁపగా
వాతని రూప విభ్రమము - లాయమ కన్గవవిప్ప మూయసం
బ్రీతిగఁదోఁచు నీలనవమేఘ విలాస తనుప్రకారముల్ 90

"కావుఁడు నన్నటంచుఁ జెలికత్తెల వేడునా? సిగ్గుమాలియీ
యేవపు ప్రేమమున్జనని కేర్పడఁ దెల్పునా? తండ్రిగారికిన్
వావిడి చెప్పునో? పరులు నవ్వరొ? యిట్టివికారి యల్లుఁ డా!
దేవిరిగొట్టు వాఁడనుచుఁదిట్టరొ తల్లియుఁదండ్రి ప్రువ్వఁగన్ 91

కోరికతీర - దీమరులు గొన్నమనస్సు మరల్పఁజాల నే
తీరున వానిఁగూడెదఁ? బదింబదిఁబెద్ద లెఱుంగఁ దప్పగా
నేరముగాఁదలంతు" రని నెమ్మది నాతని విస్మరింప వి
స్తారముగాఁ బ్రయత్నములు సల్పెనుగాని ఫలింపదింతయున్ 92

ఆతని విస్మరించుటకు నామెకు సాధ్యముకాకపోయె ని
ర్హేతుకరీతి నన్నము సయింపదు నోటికిఁ - గంటిమీఁదఁగూ
ర్కేతరిఁబట్టదయ్యెఁ - బలుకేమరి బంగరువయ్యెఁ దత్సఖీ
వ్రాతము చెంతఁజేరినను బల్కదు చూడదు సాశ్రునేత్రయై 93

తను శృంగారము మాటయెత్తదు - పురోద్యానాంచిత క్రీడలున్
వెనుకంద్రొక్కెను - మారతాపము కడుంబెట్రేగి మంచంబునం
దునఁగూలెన్ - గనుదోయి మూసి యెవియోనోరన్ బ్రలాపించుఁ దా
పునకేఁగన్ గనులెత్తి చూడదనుచుంబూఁబోండ్లు చింతింపఁగన్ 94

ఆవిధి స్వీయపుత్రిక మనోనుగతాధికి రాజదంపతుల్
తీవరమౌ కలంతఁబరిదేవనముం బొనరించి రాజవై
ద్యావళిఁబిల్వఁబంచి తమ ఆత్మజసోఁకిన వేఁకిఁదీర్పుఁడో
పావన శీలులార! యనిభక్తి నుతింపఁగ వైద్యులుద్ధతిన్ 95

ఆవరవర్ణినీమణిని నారసి నాడిపరీక్ష సల్పియే
వేవౌమహౌషధంబులను వేసిరి - మందులు ప్రూకులుంగటా!
భావజ సూనసాయక విపాటన మూర్ఛిత చిత్తవృత్తి ప
ద్మావతికిన్ బ్రమోదమణుమాత్రముఁజేయునె? బాధమాన్పునే? 96

అతులాందోళన చిత్తులై ధరణిదేవ్యాకాశరాజుల్ వ్యథా
న్వితులై పంచిరి భూతవైద్యతతి నన్వేషించి రప్పించి అ
క్షత మంత్రాక్షర యంత్రతంత్రవిధి స్వాస్థ్యంబింత చేకూర్పవా
రతి యత్నంబు లొనర్ప బూదినిడు నాజ్యంబై చనెన్ వ్యర్థమై 97

తనువునందు రోగము రొంపి మొనసెనేని
ఔషధములను సేవింప నదియడంగు
కాని జవసత్త్వములు క్రుంగఁ గాల్చివిడచు
మానసిక మహావ్యాధికి మందుగలదె? 98

చూడఁగ దైవమాయవలెఁ జొప్పడు నియ్యది - యత్నముల్ వృథా
పాడగుచుండెఁ దత్కరుణఁ బాయుననిష్టమటంచు విద్యలం
బ్రోడల విప్రముఖ్యుల నపూర్వ వచస్కులఁ బిల్వఁబంచి "యో
బాడబులార! కోవెలల భక్తి నొనర్పుడు మీరలర్చనల్. 99

శివునకును జల క్షీరాభిషేకములను
బుండరీకాక్షునకుఁ బుష్ప పూజనములు
నఖిల దేవతానిలయమ్ములందు జాత
రలను సలుపంగఁ బ్రార్థించెఁ బ్రభుఁడువారి 100

వారలును మహాన్యాస పూర్వకముగాఁగ
నమక చమకములను జేసిరమిత భక్తిఁ
జెలువుగ నవగ్రహ జపంబు సలిపిరపుడు
ప్రబలె సుందరకాండ పారాయణములు 101

ఎన్నివిధములఁ జేసిన నింతయైనఁ
గుదుటఁబడదయ్యె బలముగాఁ గుదురుకొన్న
రాజ తనుజా మనోజ రుజాజవమ్ము
మందులొడలికి నగుఁగాని మనసుకగునె? 102

వ॥ ఈ విధముగా నిటఁ బద్మావతి మనోజవేదనందూలుచుండనట
శేషాద్రి నగాగ్రంబున శ్రీనివాసుండు కందర్ప వేదనాదోదూయ
మాన చిత్తుండై యలమటింపఁ దొడంగె. 103

బళ్లనఁ దెల్లవారినది పట్టదు నిద్దుర కన్నుమూయఁగాఁ
దెల్లముగా వనంబున గతించిన దృశ్యము లొక్కటొక్కటే
మల్లడి సేయుచుండె నిజమానసమందున - జాగరంబుతోఁ
గ్రల్లవడంగ శ్రీహరికి రాత్రి మహాశివరాత్రియై చనెన్ 104

అత(డావేళ మనంబునం దల(చె "నౌరా! యేమి పద్మావతీ
సతి సౌందర్యము అచ్చు(గుద్దినటులై స్వాంతంబు తానాక్రమిం
చి తదారాధన తత్పరున్ సలిపె నిస్సీ! నేను నాఖేట నో
చిత వేషంబుననుండ( గన్గొని తలంచెన్ సుమ్మునన్ఖిల్లుగన్ 105

అతిలోకోత్తర విద్విలాస - తరుణీహాస(బు న్యాసంబగున్
శతసంఖ్యాక తటిల్లతాతతికి కైశ్యంబౌర! వశ్యంబు సం
గత సుస్నిగ్ధ మనోజ్ఞ నీలవిలసత్కాదంబినీమాల - క
ద్భుత తన్ముగ్ధ లలాటరేఖ తరుణేందు శ్రీ సుహృల్లేఖయౌ 106

తనివారన్ నునుబోడిమేనిజిగి( దప్తంబయ్యె( గార్తస్వరం
బనునై మేషమునన్ శతహ్రదము మాయంబయ్యె - ముక్తాఫలం
బను తాపంబున భస్మమాయె - విరులత్యంతంబువాడెన్ లతా
గణ మల్లాడె( బరాభవంబు సయిపంగాలేరు సుమ్మొత్తముల్ 107

పరువంబూర(గ ముంగురుల్ పొదల( - దీవ్రంబౌరొదల్ సేయుచుం
బరువుల్వారె మిళింద బృందములు - సార్భాటించి ఘోషించియం
బరముం జొచ్చినితాంత బాష్పజలమున్ వర్షించె(గాలాబ్దముల్
హొరిధూమ(బులు వంకరల్ తిరుగుచుంబోవున్ నభోవీథికిన్ 108

కులుకుమిటారి గబ్బి చనుగుబ్బల పోడిమినోడి జక్కవల్
కళకుచురేయి యంతయు( గలంగుచునేడ్చెడు - హేమకుంభముల్
దళమగు తాపభారమున ద్రావకమయ్యెను - శైలశృంగముల్
పలుకులు పల్కులై పడెడు - వారణకుంభము మొద్దుబార(గన్ 109

నానిజరూపమారసిన నాతి క్షణంబున నాదుకౌఁగిటన్
దానుగవచ్చి వ్రాలెడిది తన్మయతన్ జగమున్ మరాచి - వి
న్నాణముతో సుఖైక పరిణామముతో వికసిల్లు - సత్యమున్
బూనిక డాచి ఆపదలఁ బొందితిఁ - దీరనియార్తిఁగుందితిన్ 110

అనిచింతించుచు రాత్రి జాగరణసేయన్ "నీవు విశ్వైక వే
దన నిష్కాసన శక్తియుక్తుఁడవుకాదా? నీవె యిల్లాలికై
చనునే యిట్లు తలంకఁ బామరునియోజన్ - చాలు - నజ్ఞానభా
జనతీవ్రాంధముబాయు" నంచు జగతీచక్షుండు తోతెంచినన్ 111

వికలంబై కనుపించు పుత్రు మొగమున్ వీక్షించి యాందోళనా
ధిక చిత్తంబునఁ దల్లియిట్లనె "సుతా! దీనత్వమింకేల? తా
వక వైవాహిక దౌత్యకృత్యమును దీర్పన్ దూతినై రాజు చెం
తకు నేనేఁగెద భారమెల్ల విధిమీఁదన్ మోపి సంప్రీతిమై 112

కాలము కర్మమున్ గలిసికట్టుగ వచ్చిన నెల్లకార్యముల్
గ్రాలు కరస్థమౌ బదరిగా వెదుకం జనుచున్న తీవయే
కాలికిఁ జుట్టుకొన్నటులఁ గావున బుద్ధివిధిం బృహస్పతుల్
కాలము బ్రహ్మరూపమని కాదె వచింతురు సత్యవిజ్ఞులై 113

ఆ పద్మావతి రాగరంజిత మనోవ్యాపారయై మోహసం
తాపోద్దీపితయై స్మరప్రదర విద్ధస్వాంగయై ప్రేమ ని
న్నే పెండ్లాడెడు రీతి శక్తికొలదిన్నే నెమ్మి యత్నించెదన్
బ్రాపై యాపయి దైవమాదుకొనినం బ్రాప్తించెడున్ శ్రేయముల్ 114

కావునఁ బోయివచ్చెదను కాఁగల కార్యభరమ్ము నెంచి నీ
వీ వనటన్ దిగన్ విడిచి యెప్పటిపోలికఁ గౌతుకంబుతో
దైవము నమ్మియుండుము సుతా! మనయత్నము మూఁడుపాళ్లు పై
దైవ మదొక్కపాలు - మిళితంబయి వచ్చు ఫలంబు భోగ్యమై 115

అఖిల సౌభాగ్యమస్తు - దీర్ఘాయురస్తు
భవ్య కల్యాణ శోభన ప్రాప్తిరస్తు
స్వీయ చిత్తవాంఛా ఫలసిద్ధిరస్తు"
అనుచు దీవించి వకుళ నెయ్యమున వెడలె 116

నారాయణపుర వరమును
జేరం బయనించుచుండె శీఘ్రగమనయై
యారాజ దంపతులు వకు
ళారామామణి వచింప లక్ష్యమిడుదురే? 117

వ॥ అని తన మనంబున సంశయించి శ్రీనివాసుండు 118

కనకాంబరముచీరఁ గటిసీమ ధరియించి
రక్తవర్ణంబైన రవికఁ దొడిగి
మోముదామరయందు ముంజేతిపైనెల్ల
బొమ్మలుగాఁ బచ్చబొట్లు తనర
భ్రూమధ్యమున నెఱ్ఱబొట్టును సవరించి
తనపుక్కిటఁ బొగాకు తమ్మనుంచి
కన్నుఁగొలఁకులందుఁ గాటుక సరిదిద్ది
ముంజేత దంతంపు మురుగులుంచి

పండ్లదాసినవేసి - నిబ్బరముగాఁగ
నెత్తిపై సోదెబుట్టను నిలిపియుంచి
శ్రీనివాసుండె యెఱుకల సానియగుచుఁ
ద్వరితగతుల నారాయణ పురముఁ జేరె 119

ఆవిధి రాజమందిరపుఁ బ్రాంగణ సీమలఁజేరి క్రేవలన్
బోవుచుగొంతునెత్తి" తలపోసిన వన్నియు నున్నవున్నటుల్
ప్రావ యెసంగ సత్యమును పల్కెద సోదియఁజెప్పఁ బిల్వ రా
రే వివరంపు గద్దెవినరే! యని సారెకుఁగేక వేయఁగన్ 120

మోజుపడి పిల్చి ఆకాశరాజ పత్ని
ధరణి దేవి - పద్మావతి సరసనిలిచి
సోదె నడుగ నిరుగుపొర్గు పైదలులును
జుట్టుఁ జేరంగ నెఱుకత తట్టఁదించి 121

మంచి ముత్యాలు చేటఁ బోయించి గద్దె
పలకకుఁ బసపుఁ గుంకుమములను బూసి
పుల్లఁజేకొని రాసుతఁ బుట్టముందుఁ
గూరుచుండంగఁ బెట్టి దిక్కులకు మ్రొక్కి 122

పుల్లకొనయొండు తనచేతఁబూని - వెనుక
చివరఁ బద్మావతీదేవి చేతఁబెట్టి
పుడక యామె నిటల భాగమునకు సోఁక
నిలిపి మెలమెల్ల నీరీతిఁ బలుకసాఁగె 123

"ఏడుకొండలమీఁద యెలసినవోఁడ!
ఆదివరావుండ! ఆదిదేవుండ!
మదురమీనాచ్చమ్మ! మామంచియమ్మ!
మదిలోన నిలుసుండి - మాటాడరమ్మ!
శీశైల శికరాన సెలువోరువోఁడ!
దేశాల నేలేటిదేవ! యీసురుఁడ!
కంచికామాచ్చమ్మ! కామారిబొమ్మ!
మించిమమ్ములను పాలించవేయమ్మ!
గనమైన బెజవోడ కనకదుర్గమ్మ!
చనవుగా దయతోడఁ గనవమ్మ తల్లి!
ఓ కొండదేవరా! మాకండయగుసు
సేకొను బద్రాద్రి సీరామశంద్ర!

వ॥ సత్తెంజెబుతా - ఇనుకోవేతల్లా! నీమతిలో ముక్కోటి దేవుళ్లకు మొక్కుకోవే అమ్మా!

ముక్కోటిదేవతల్ మొక్కులాలించి
నిక్కంబు నీకోర్కి నెరవేర్తురమ్మ!
మనసులో వున్నట్టి మాటసెబుతాను
ఇనుకోయె నాతల్లి! యినుకోయె మళ్ళి
తోఁటలో నీ కంటిపాటు సెద్రింది
యేటగాఁడొక్కండె యెంటబడ్డాడె
కోపతాపాలతోఁ గొట్టించినావె
ఆపసోపాలతో అడలగొట్టావె
అతనిఁ బ్రేమించావె అతివరో! నీవు
వెతతోడ మంచాన వేఁకిఁబడ్డావె

సెలువ! బోయఁడుగాఁడు సీనివాసుండె
సెలువొందు శేసాద్రి యెలుగొందువోఁడె
కాయౌనా? పండౌనా? కలికి! సెప్పెదను
కాయకాదది పండె కచ్చితంబుగను
ఆదిదేవుఁడు నిన్ను ఆదరించాఁడె
సేదతీరఁగ నిన్నె సేవించుతాఁడె
మగువరో! నిన్నెంచి మనసిచ్చినాఁడె
వగలు పోతున్నాఁడె సెగలుమీరంగ
లలన! నిన్నెంచంగ లచ్చివేకాని
అలర మానవకాంత వగుదువే నీవు?
పెద్ద ముత్తైదువ వెసవచ్చు నిటకు
సిద్ధిగా ఆమెతో సెప్పిపంపమ్మ!
తప్పదే మీరింక దంపతులగుట
తంపుల బెమ్మయ్య తలరాసినాఁడె
ఒప్పులకుప్ప నీవొప్పుకోవమ్మ!
ముప్పోకలానికి ముద్దతీరంగ
మంచి కట్నాలిచ్చి పంచవేతల్లి!
పెంచిపొప్పన్నంబు పెట్టించు పెళ్ళి
సూరీడు సెంద్రూడు దారితప్పినను
మారదే నాసోదె - మారదే తల్లి!" 124

అనుచు సోదె చెప్పి యెనలేని కానుకల్
సంగ్రహించి యెఱుకుసాని చనియెఁ
గుదుటపడక మనసు కోందలపాటొంద
రాగజలధి మునిఁగె రాకుమారి 125

వేడ్కతో నెఱుకలసాని వెడలినంత
ధరణి దేవి యాకాశరాడ్ధవునికడకు
వెడలి యెఱుకత చెప్పిన విషయములను
బూసగ్రుచ్చిన మాదిరి పొసఁగఁజెప్పె 126

నావిని రాజవల్లభుఁడు నారదమౌని వచించినట్టి "లో
కావనశక్తియుక్తుఁ డమరాధిపధాతృ గిరీశవందితా
త్మావహిత ప్రపూర్ణుఁడగు నచ్యుతుఁడే వెసఁ బెండ్లియాడుఁ బ
ద్మావతి" నన్న వాక్యములు మానససీమఁ దలంచి యిట్లనున్ 127

"ప్రణుతాత్మీయతఁ దెల్పె దేవముని" ఓ ప్రాణేశ్వరీ! సాధు స
జ్జన సంత్రాణుఁడు వెన్నుఁడే మన తనూజాతన్ వివాహంబగున్
మన పద్మావతి బాలికాకృతి మహాక్ష్మాగర్భ నిక్షిప్తకాం
చన మంజూషలభించెఁ గాన రమనా సందేహమిందేటికిన్? 128

అంతటి యీ తనూజ కడు నాధియు వ్యాధియుఁ బెల్లడంప నొ
క్కంత శరీరమే యెఱుఁగ కీగతి మంచమునన్ వటించు - నే
వంతుననైన సుంతయిన స్వాస్థ్యముకల్గినఁ జాలుఁ దన్మన
శ్చింతనఁ బట్టిపోవుటయె శ్రేయముగా మనకున్ సఖీమణీ! 129

ఆ శేషాద్రి నివాసునందె మనసైయమ్మాయి వాంఛించుచో
ఆశల్ త్రుంపఁగనేల? వారలకుఁ గల్యాణంబు గావింత మే
కోశంబందొక చింతలేక శుభముల్ క్రొంగ్రొత్తలై నిత్యమున్
రాశీభూతములై చెలంగుత సుఖారంభ క్రియామూలముల్" 130

ధరణీదేవి తదీయ వాక్యములఁ జింతంబొంది నిర్వేద వి
స్తరయై మూఁతినిఁద్రిప్పి యిట్లనియె "నాథా! యింత యన్యాయమా?
అరరే! కాలమదెంత వక్రమయి డాయన్వచ్చె? ప్రాణాధిక
స్థిరతం బెంచిన తండ్రియేయిటుల యోజింపంగ నింకేమనన్? 131

కడఁగి చెట్టు చెడెడు కాలంబునకుఁ గుక్క
మూఁతిపిందెలన్న పోల్కి తనర
మన తనూజ భావిఘనత యెట్లున్నదో?
యిట్టి బుద్ధి మీకుఁ బుట్టె నధిప! 132

కొండలఁగోనలం దిరుగు కోయకు బంగరు వంటి బిడ్డకై
దండనొసంగి - యిట్లు పసిదానిది గొంతును గోతురేమి? పూ
చెండని కాలసర్పమును శీర్షతలంబునఁ జుట్టెదేమి? భూ
మండలమందు నిట్టి దెసమాలిన వియ్యము నియ్యకొందురా? 133

సరసతఁబెంచి చిల్కను గసాయికి నప్పన చేసినట్లు సుం
దర సుకుమారదేహ మననందనఁ గానన సీమయందుఁ గాఁ
పుర మొనరింపఁ బంపుదురొ? మూఁగిన పాపఫలంబు గాక యీ
దురిత దరిద్ర బాంధవపుఁ ద్రొక్కుట మెక్కడ దాపురించెనో? 134

రాసుతు లింతకుంగలుగరాధర? లోకము గొడ్డువోయెనా?
మీ సరివారులేక కలిమిన్ బలిమిన్? దమ చేతులారఁ గ్రూ
రాసుర సత్త్వదుర్గమ మహాటవియం దుటజంబు నీడలో
వాస మొనర్పఁ బంపుదురొ? వాగులవంకల నీరు తేరఁగన్ 135

ఆడుబిడ్డల బాధ్యత యనుఁగుఁ దండ్రి
కంటెఁ దల్లి కెక్కువకదా! కన్నకడుపు
తీపికన్నఁ బెంచినప్రేమ తీవ్రమగుట
వివరముగఁ జెప్పుచుంటిఁ బృథ్వీతలేశ! 136

అత్తవారింట నన్నవస్త్రాళిలేక
తనయ యల్లాడుచుండంగఁ దల్లియనుభ
వించు క్షోభ పురుషులకే విధిని తెలియు?
నెఱిఁగి యెఱిఁగి యెవ్వండైన నేటఁబడునె? 137

నాదుమాట మన్నించి మంతన మొనర్చి
మంచి సంబంధమును జూచి మనుజ నాథ!
మనుజపుంగవు సుతున కెవ్వనికో యిచ్చి
పెండ్లి చేసిన సుఖియించు బిడ్డ" యనిన 138

ఆమె వచించు పద్ధతికి నబ్బురమంది నృపుండు పల్కె "దే
వీ! మనబిడ్డ వైభవ మభీప్సిత సౌఖ్యముఁ గాలఁదన్ని యే
స్తోమత లేనివానికిడి చూచుచుఁ జూచుచు బిడ్డ జీవితం
బేమరుపాటుతో నెటుల యేటను ద్రోసెదఁ? బ్రేమఁ బాసెదన్? 139

నీవు దిగులొందవలవదు నేనుమాత్ర
మిట్టి కార్యాలఁ దొందర యెట్లు పడుదుఁ?
గాని విధిని తప్పింప శక్యంబుకాదు
స్వర్గమందునె పెండ్లిళుల్ జరుగునండ్రు 140

వెలఁది! యెన్నియో జన్మల విడువరాని
బంధమునుబట్టి కల్యాణబంధ మొదవుఁ
బుణ్యమునుబట్టె పురుషుండు పొదలునన్న
సూక్తి వినవటే! మన యిష్టముండదిందు" 141

అని ఆకాశ ధరాధినాథుఁడు కళత్రాన్వితుఁడై నెమ్మదిం
జనెఁబద్మావతి మందిరంబునకు మంచంబందుఁ గందర్పవే
దనకగ్గంబయి యేన్గు తొండము. తుదిందారాడు పద్మంబుగాఁ
గనిపించెంగడు బక్కచిక్కి సగమై కల్లోలితస్వాంతయై 142

అపుడారాజకులైక భూషణుఁడు రాగాంభోధి వీచీ సుధా
తపుఁడై వత్సలతా ప్రపూర్ణుఁడయి చేతస్స్ఫూర్తిఁ బద్మావతీ
శఫరాక్షిన్ దరిఁజేర్చిమైనిమిరి శీర్షం బార్తి ముద్దాడి ని
ద్దపు వాక్యంబుల నిట్లనెన్ విమల వాత్సల్యంబు పొంగారఁగన్ 143

"నయతన్ పుత్రికవైనఁ బుత్రుఁడవెయైనన్ నీవకావా? భవ
త్ప్రియముల్ తీర్పఁగ మేములేమె? యిటులీ దీనత్వముం బొందనే
ల? యిలా లభ్యము లెవ్వియైనఁ దనయా! లావొప్పఁదెప్పింపమే
నియతిన్ నీవు తలంప? నిట్టుల మము న్వేధింప భావ్యంబటే? 144

తనయా! సంతతి లేకలేక భగవద్దాక్షిణ్య రూపంబుగా
నినుగైకొంటిమి ప్రాణపంచకమిదే నీమీఁదనేయుంచి మా
కను పాపన్వలెఁ బ్రోచి పెంచితిమి లోకంబెల్ల నీయాకృతుల్
గని నీ కంటనుబడ్డ ధూళికణముల్ మాగుండె దూలాలుగన్ 145

ఈవు కోరిన సాధింపమే యెద్దైనఁ?
గొంచుతెత్తుము కొండపైఁ గ్రోఁతినైనఁ
దివిరి కుంచేటికొమ్ము సాధింతు మిసుక
నేనిఁ దైలమ్ము తీయమే! యిందువదన 146

నీదు సుఖంబె మా సుఖము నీ యభిలాషమె మా యభీష్టమిం
కేది విచారకారణము? నేనెపుడైనను నీదుమాటకున్
భేదముగాఁ జరించితినె? వేరు తలంపులు మాని నీ మనః
ఖేదమదేమొతెల్పు" మని కేల్గొని తాఁబ్రతిమాలుచుండఁగన్ 147

తననేత్రంబులు బాష్పబిందు తతిఁజిందన్ దండ్రి వక్షస్స్థలం
బున నెమ్మోమునుడాచి యామె "జనకా! పూజాసుమంబట్లు చ
ల్లని రేయెండకుఁ గందిపోదునను లీలం బెంచి పోషించి పె
ద్దను గావించిన దానికిట్లుపకృతిన్ దండ్రీ! యొనర్తుంగదా!" 148

ఎగ్గును సిగ్గు లేక యెటులీ విషయంబును తల్లిదండ్రులం
దగ్గఱియుగ్గడించు టను దారుణ వేదన యొక్కప్రక్క పూ
మొగ్గ తుటారి తూఁపుదొర పుష్పశరాహతికొగ్గు మానసం
బిగ్గగఁ బట్టలేని బలహీనత యింకొకవైపు ద్రిప్పఁగన్ 149

"ఎనలేనట్టి మనోవిచారమును మీకీరీతిఁ గల్పించి శాం
తిని లుప్తంబొనరించినట్టి నను మన్నింపంగఁ బ్రార్థింతు నా
వనటన్ మీకునెగాక అన్యులకుఁ జెప్పంబోలునే? లోకమం
దున మాతృణ పితృణ బంధన విముక్తుల్ కల్గఁగా నేర్తురే? 150

తల్లిదండ్రులె ప్రత్యక్ష దైవతములు
వారియొద్దనేదైన దాఁపరికమేల?
అన్యులార్తురా? తీర్తురా? అదనుజూచి
హేళనము సేయఁబూనుదురింతెగాని" 151

అంతవఱకుఁ బలికి యామీఁద వివరింప
నోరు రాక కనుల నీరుజారఁ
జెలిని జూచి సైగచేసి యూరకయుండ
నామె సఖి వచించె నవలి గాథ 152

"ధరణిపాలులార! తనరు నుద్యానాన
వేటగానివోలె విహృతి సలుపు
పురుషు నొకనిగాంచి తరిమించినదిగాని
అతనిరూపమెడఁద హత్తుకొనియె 153

అతడు కలలందు నెన్నొ మాహాత్మ్యములను
దనకుఁ జూపించెనఁట కాఁడు మనుజుఁడాతఁ
డన్న నమ్మిక కలిగెఁ దానెన్నఁడైన
అతనినే భర్తగాఁగొన నాత్మనెంచె 154

కనులు మూసినంత గతకాల సంబంధ
గాథలెన్నొ చెప్పఁగడఁగునంట
కనులు తెఱచిచూడఁ గనుపాపవలెఁ గంటి
యెదుటఁ దాండవించు నెదకలంగ 155

రామకృష్ణాదిరూప సంరంభపరత
వ్యక్తమొనరించు నఁట మనోహర్ష మెసఁగ
ఎన్ని విధములఁ జింతింతుమేని యతఁడు
మానవాతీతుఁడన్న నమ్మకముఁబెంచి" 156

అరయఁ బద్మావతి మనస్సునందు నున్న
విషయమెల్ల నామూలాగ్ర విశదభంగిఁ
దెలుపు తత్సఖీమణి వాక్యములకు నలరు
చున్న కూఁతు మోమునుగాంచి చెన్నుమించి 157

ఆమె మనోరథం బెఱిఁగి అచ్చెరువందుచు రాజదంపతుల్
ప్రేమ సమాదరించి "సువివేకతఁ జేసిన నీదు నిర్ణయం
బే మెటు కాదుకూడదన? వృద్ధులతోడుత సంప్రదించి నీ
కామితమున్ ఘటించుటకుఁగా యతనం బొనరింతుమో సుతా! 158

పెండ్లియన నీదు బొమ్మలపెండ్లియటవె?
పెండ్లి నూరేండ్లపంటయౌఁ బెద్దలున్న
వారు వారి విచారింపవలదె? నీదు
క్షేమమునకన్నఁ బ్రభుత మాకేమివలయు?" 159

అనుచు నా రాజదంపతులవధి లేని
వత్సలత బుజ్జగించిరి ప్రాణపదము
గాఁగ భావించి కూఁతు - నీ కర్మ భూమి
బంధములకంటె భిన్న జీవనముగలదె? 160

## సోపానాంతము

రవిసోమాంబక! భానుమండల విహారా! ప్రాజ్ఞయోగీశహృ
ద్భవ తేజోమయ విశ్వరూప! కరుణాపాంగ త్రిలోకావనా!
శివపద్మోదర ముఖ్యదైవత నుత శ్రీపాద పంకేరుహా!
నవతాపేశల వాక్ప్రమోదచరితా! నారాయణాద్రీశ్వరా! 161

శ్రీ యల మేల్మం గాహృ
త్తోయజ సంచార భృంగ! దూరితసంగా!
మాయాలేపనభంగా!
ధ్యేయ శ్రేయోంతరంగ! ద్విజపతురంగా! 162

జగద్రక్షణాయత్త సామర్థ్యమూర్తీ!
ఖగాధ్యక్ష పక్షాగ్ర కాంక్షావిహర్తీ!
ప్రగల్భోచిత వ్యాప్త రాజత్సుకీర్తీ!
మృగాకీర్ణసప్తాద్రి శృంగానువర్తీ! 163



# పద్మావతీ శ్రీనివాసీయము

## షష్ఠ సోపానము

శ్రీ బీబీనాంచారు మ
నో బింబిత నిజ విలాస! నుత మాహాత్మ్యా!
ప్రాబోధక సూక్తి విరా
జీ! బలుపులుఁగు దొరతేజి! శ్రీ బాలాజీ! 1

అవధరింపుము 2

సకలతాత్త్విక వ్యాఖ్యాన చతురుబుద్ధ్యు
పేతుఁడగు సూతు వాగ్ఝరీ వీచికాళి
మగ్న మానస మస్కరి మండలంబు
వేంకటేశ్వర గాథా సుధాంకమగుచు 3

సూత ఋషిచంద్ర! విశ్వవిఖ్యాతిసాంద్ర!
తదుపరి కథావిధాన సుధానిధాన
తృప్తులను జేయవే మమ్ముఁ గృపతలిర్ప
వేంకటేశ్వర కల్యాణ వినుతిఁజేసి 4

అని ప్రార్థించిన సూతుం
డను పదమున గురుపదంబులాత్మఁ జెలంగన్
వినిపించె నవలివృత్తము
మునికోటి శిరంబులూచి పులకలఁదేలన్ 5

ఆవేళన్ ఫణిరాజ తల్పుని మనోవ్యాసక్తి సంప్రేరణన్
వేవేగన్ వకుళా మహాసుగుణ సాధ్వీ శీర్షరత్నంబు పృ
థ్వీవాల్లభ్య విశేష వైభవ కళావిర్భూత తేజంబుతో
ఠీవిన్ భాసిలు రాజమందిరము పొంటెన్ డాయఁగానేఁగినన్ 6

పరఁగన్ యోగిని యొండువచ్చినది రాట్ప్రాసాదముంజేర నం
చరుదౌ వార్తను విన్న తత్క్షణము నందాకాశరాడ్దంపతుల్
పరమామోదముతోఁ దదౌచితికి నేభంగంబులేకుండఁ గ్ర
చ్చరఁదోడ్తెచ్చిరి యామె నంతిపురికిన్ సాకల్యమర్యాదగన్ 7

తపనీయోన్నత పీఠిపైనునిచి సత్కారంబు లౌచిత్య భా
గ్విపుల ప్రీతినొనర్చి రాజు వినయావిష్టుండునై "తల్లి! స
త్కృప రూపించెడు నిన్ను యోగినివిగా నెంతున్ మనోవీథి నె
య్యపు నీ రాకను ధన్యమయ్యెను మదీయ ప్రాజ్యసామ్రాజ్యమున్ 8

నీ నిజవాసమెద్ది? కమనీయము నీయభిధానమెద్ది? మా
స్థానము నిట్లు చేరఁగఁగతం బదియేమి? త్వదీయపాద సం
ధానరజంబు సోకి కడుధన్యతఁ గాంచెను వంశమెల్ల నో
మానిని! నీదురాకఁగల మర్మముఁ దెల్పుము తీర్పఁబూనెదన్ 9

వ॥ అనిన వినయనయ సంభరిత తదీయ వాక్యంబుల కత్యంత
ప్రమోదంబునొంది ఆవకుళా సాధ్వీలలామ ప్రతిపదంబున సుధా
మరందబిందు సందోహంబు చిందులాడ నా ధరణీ దేవ్యాకాశ
రాజదంపతులతో నిట్లనియె. 10

"ఓ రాజా! విను మీరు దంపతులు పుణ్యోదారు - లేలందువా
క్షీరాంభోనిధి కాత్మజాతయగు లక్ష్మీదేవి సత్పుత్రియై
గారాబం బనురాగ రంజితముగాఁ గల్మిన్ భవద్గేహ మిం
పారన్ బాడుచు నాడుచుండెఁ దమ భాగ్యంబెన్న సామాన్యమే? 11

కావున మీరు పూజ్యులనఁగాఁ బునరుక్తియెకాదె? మిమ్ము సం
భావనఁ గన్నులారఁగని భవ్యరహస్య మొకొండు తెల్ప మీ
తావునకేఁగుదెంచితిని" ధాత్రి సమస్తము నేలఁజాలు ప్ర
జ్ఞావధియైన పుత్త్రకుఁడె యండగ శేషగిరిన్ వసించెదన్ 12

శ్రీనివాసుఁడనఁగఁ జెలువారు కొమరుండు
విపినమునకు వచ్చి యుపవనానఁ
ద్వత్తనూజయైన పద్మావతిని గాంచి
మదను బారిఁబడియె మనసుపడియె 13

ఇరువదియైదు వర్షముల యీడుగలాఁడు సముచితాంగుఁడు
ర్వర నటువంటివాని గనరాదు సమర్థుఁడు కాని కారణాం
తరములవల్ల సంపదలు దక్కి దరిద్రతఁ జిక్కినార మి
త్తరి సిరిపాసెనన్న సడితప్ప మరొక్కటి లోపమున్నదే? 14

వసుధాధీశ్వర నా కుమారుఁడని చెప్పం జిట్టలౌ సర్వతా
పసవంద్యుండు - త్రిలోకరక్షణ కళాపారీణుఁ డబ్జోదరా
ది సమస్తామర శీర్షరత్న విలసద్దివ్యాంఘ్రియుగ్ముండు దై
వ సమానాద్భుత చిత్రవర్తనుఁడు సంభావ్యుండు సత్త్వస్థితిన్ 15

అతఁడు శ్రీనివాసుఁడను సార్థకనాముఁడు - ధర్మమూర్తి - సం
ప్రీతి భవత్తనూజనిడి పెండిలి సేయుము సంశయింపఁబో
కాతత నిత్య సంపదలనంది - శుభైక సుఖాభివృద్ధితో
భూతలమందుఁ బూజలను బొందెడి నారవితారకమ్ముగన్ 16

నీదు దుహితను జూచిన నిముసమందు
నుండి పద్మావతిని దప్ప నొండుకన్నె
పాణిగ్రహియింపఁ బోనని ప్రతినఁబూని
అన్నపాన వివర్జితుండై వటించు 17

లీలామానుష విగ్రహుండగుచుఁ గేళీలోలుఁడబ్జాక్షుఁడీ
హేలన్ శేషనగేంద్రవాసుఁడనఁగా నేతెంచె లక్ష్మీకళా
జాలాంశంబున నీ కుమార్తెగ భువిన్ జన్మించెఁ బద్మావతీ
స్త్రీలోకాఖిల శీర్షరత్నము - నృపా! చింతింప నింకేటికిన్?" 18

ఆమె వచించు మాటలకు నబ్బురమందిన రాజదంపతుల్
మోమున జ్ఞానతేజము ప్రమోదము నింపఁగ నామెఁగాంచి "అ
వ్వా! మధురామృతోపమ మహాస్త్ర వివాదము సత్యబద్ధ సం
ధామములైన నీ మృదుపదంబుల పొందిక మెప్పుఁ గూర్చెడిన్ 19

నేమముఁ బ్రేమమారఁగ ననిర్వచనీయ మహానుభూతి యే
దో మదియందు వ్యక్తమగుచున్నది - యెన్నడొ స్వప్నసీమ నా
స్వామి మహత్త్వ దర్శనము ప్రాప్తిలినట్లుగఁ దన్మయత్వమౌ
రా! మముఁ గ్రమ్మె చున్నదతివా! యివె దివ్య పరత్వ చిహ్నముల్ 20

ప్రీతి మా పెద్దలను విచారించి మేము
వర్తమానంబు వేగపంపంగలార"
మంచు సాఁగనంపిరి యామె నచటినుండి
ఆమె సుతునకు నెఱిఁగింప నరిగె వడిగ 21

వకుళాసాధ్విని పంపి యా నృపతి సంభావించి దేవేరితో
సకలార్థంబులు చర్చఁజేసి తనయా స్వాంతంబు సాంతంబు మ
చ్చిక గుర్తించి గణించి మంచిచెడు లాశేషాద్రిసంవాసు పు
ట్టుక పూర్వోత్తరముల్ కనందలఁచె గుట్టున్ రట్టుగాకుండఁగన్ 22

తన తమ్ముండగు తొండమాను నొక దూతంబంపి రప్పించి "నా
యన! పద్మావతికిన్ వివాహమును జేయంబూని శేషాద్రినా
థున కీయందలఁపోసినా మతని యాస్తుల్ పాస్తు లిళ్లున్ ధనం
బును నా బ్రహ్మపదార్థ మట్లెవరికిన్ బోధ్యంబుగా దింతయున్ 23

మనకున్ ముఖ్యుఁడు - తాపసేంద్రుఁడు మహామాహాత్మ్య సింధుండు పా
వనశీలుండు త్రికాలవేది విదితాన్వర్థాభిధానున్ శుకున్
గని మా మారుగ వందనంబులిడి సౌఖ్యక్షేమ సంప్రశ్నఁ ద
న్మునిశార్దూలుఁ బ్రసన్నుఁజేసికొని నేర్పుంజూపి భక్త్యున్నతిన్ 24

ముని శీతాంశుని తోడితెమ్మి చటకున్ బూజించి వందించి - ఆ
యన విచ్చేసిన సంశయంబులు మరుద్వ్యాఘాత జీమూత రీ
తిని చెల్లాచెదరై చనున్ - విషయముల్ తెల్లంబుగా వ్యక్తమౌ
ననఘా! ఆతఁడు రాజవంశ హితమత్యంతంబు కాంక్షించెడున్" 25

అని పంపన్ వెసఁ దొండమానుఁడు నృపాలాజ్ఞావశంవర్తియై
చని ఆ సంయమిసోము నాశ్రమము నాశ్చర్యంబుతోఁ గాంచి యా
యన సత్త్వస్థితి కిచ్చ మెచ్చుచు రసార్ద్రానంద తుందాత్ముఁడై
వనమెల్లం గలయం గనుంగొనియె భావం బద్భుతంబందఁగన్ 26

శుకము లాచార్యులై శ్రుతి పాఠములు సెప్పఁ
బిల్లులు వటువులై వల్లెవేయ
శిఖిదేశికుఁడు నాట్యశిక్షణ మిడఁ బాప
కన్నియగమి నృత్యగతుల మెలఁగ
ముది యేనుఁగుల తొండములఁ బట్టి సింహార్భ
కాళిజృంభించి యుయ్యాలలూఁగఁ
బూజకై క్రోఁతులు పూమొగ్గలను కోయ
నెలుఁగులు తత్పాత్రములు వహింప

జింక బాలెంతరాలిని చెంతఁజేరి
పులుల పిల్లలు పాల్ద్రావి కలయఁదిరుగఁ
గాంచి హర్షించి పులకించి కడఁగి తొండ
మానుఁడు మహర్షి శక్తికి మ్రానుపడుచు 27

వినయ వినమ్రుఁడై యరిగి విశ్వచరిత్రము విస్మరించి యో
గ నియతిఁ గన్గవన్ మొగిచి గాఢసమాధి నిమగ్న చిత్తుఁడై
మనమును బుద్ధియింద్రియ సమాజము నొక్కటిఁజేసి హృద్గత
ప్రణవ మయాత్మ తేజమున బ్రహ్మపదార్థముఁ గాంచు నాతనిన్ 28

కని - ఆ మౌని సమాధ్యవస్థవిడి లోకజ్ఞాన సంధానుఁడై
చను వేళన్ గమనించి తత్పదజలేజద్వంద్వ మర్చించి ఆ
ర్తిని సాష్టాంగ నమస్కృతుల్ సలుపఁగా దీవించి మారంద వా
హినులుప్పొంగి స్రవింప రాజహిత లక్ష్మీభూత దృగ్జాతుఁడై 29

వ॥ రాజ్యహితంబును ప్రజాశ్రేయంబును నృపాల కుటుంబ కుశలాది
కంబులు గురించి పృచ్ఛింపఁ దొండమానుండు వినయ వినమి
తోత్తమాంగుండై కరకంజంబులు మోడ్చి ప్రాంజలించి నిలువం
బడి నిర్మల వాక్పూజావారిజంబుల నాపారి కాంక్షి పదనీరజంబు
లర్చించు వడువున నీ పగిది నుడువందొడంగె. 30

“ఓ యతి సార్వభౌమ! శుకయోగి మహాత్మ! మదగ్రజుండు భూ
నాయకుఁ డాత్మనెంచెడన నందన పెండిలిసేయ - మాహిత
ధ్యేయ మనస్కులైన మిము తీసుకురమ్మని నన్నుఁబంపె మే
మే యదియైన మీరనుమతిచ్చిన పిమ్మటగాదె చేయుటల్ 31

కుందనపుబొమ్మ ధవళిత కుందరదన
గ్లౌవదన - శాస్త్ర విద్యావికాససదన
యైన పద్మావతీకన్య అనఘ! మీయ
మోఘ దివ్యాశిషంబులఁ బొలుపుఁగాంచె 32

అనుమ వచియించు నాతని వినయమెంచి
ధర్మరక్షా ధురీణుఁడౌ ధరణిధవుని
హితము లోనెంచి భావిసంగతులు గాంచి
కార్యనిర్వాహకత్వ దక్షత వహించి 33

తొండమానుని మిగుల సంతోషపరచి
అతఁడు తెచ్చిన బంగారు టరదమెక్కి
భావి సూచ్యార్థ శకున సంపదల నరసి
ఆశ్రమము వీడెను తపఃపరిశ్రముండు 34

శుకయోగీంద్రుఁడు - కీర్తిసాంద్రుడు - సుధీసుశ్లోక పూర్ణానురా
గ కళాచంద్రుఁ డెకాయెకిన్ గదలి యాకాశావనీ నాథు చెం
తకురా విప్రులఁ బూర్ణకుంభముల వేదస్తోత్రపాత్రంబుగా
నకలంకాంకితమైన స్వాగతము నీయంబంచి భూనేతయున్ 35

సతితోఁగూడి తదీయపాదములకున్ సాష్టాంగముల్ చేసి సం
తత పూజార్హములైన మౌని పదపద్మద్వంద్వమష్టాపదా
క్షత పాత్రంబుననుంచి శుభ్రముగఁ బ్రక్షాళించి తన్నీరము
ద్ధతిఁ బ్రోక్షించి శిరోగ్రభాగములఁ దద్ధాత్రీశ్వరుండిట్లనున్ 36

మీరలమేయసత్త్వులు - సమీహితతత్త్వులు - సర్వకార్య ని
ర్ధారిత మానవత్త్వులు - మదప్రముఖాంతర వైరిజిత్వరా
చారసుధీ పరత్త్వులు - ప్రచారవిరక్తులు - భూతవర్తమా
నోరుభవిష్యదర్థ విషయోత్థ విచార మహత్త్వ లెన్నఁగన్ 37

తమ వాక్యంబులు వేదమంత్రములు క్షేత్రంబౌను మీ పాద ప
ద్మము లున్ముద్రితమైన భూమి - తమ బోధంబే ప్రబోధంబు దు
ర్దమముల్ మీయను శాసనంబులు శిరోధార్యంబులౌ మాకు - సం
యమి సుత్రామ! త్వదాశిషంబులగు మా హస్తాగ్ర సందీపికల్ 38

మౌనిమహేంద్ర! నెచ్చెలుల మండలితో వెరవారఁగాఁబురో
ద్యానవనీ విహారసముదంచిత కేళివిలోల భావనా
ధీన మనస్కయై చనె మదీయ తనూజ - అయోనిజాత - లీ
లానవ వల్లరీక వనలక్ష్మియనన్ మధుమాస వైఖరిన్ 39

ఆ సమయంబునందు మృగయారతుఁడై ధనువొండుదాల్చి సం
భాసిత దేహధారియయి భార్యరతిన్ విడనాడి భూమిపై
వాసిగ సంచరించుటకు వచ్చిన మన్మధుఁడో రమాసతిన్
బాసి చరించు విష్ణువోయనన్ దగునొక్కనిగాంచె మక్కువన్ 40

మార రసాల పుష్పశరమంజుల వేదనఁజొక్కి నిద్దపుం
ధోరణి వానియందుఁగడు నూల్కొనినట్టి మదిన్ మరల్పఁగా
నేరకవాఁడి వత్తయయి నెట్టన నాతనిఁ బెండ్లియాడఁగాఁ
గోరి తపించుఁ దల్పమునఁ గోర్కులు సుళ్ళగఁ గ్రేళ్లువారఁగన్ 41

శేషమహాగిరీంద్ర ఘనశృంగ తటంబు నివాస - మాసుర
ద్వేషికి మిత్రుఁడంట మునిదేవకులోత్తమ వంద్యుఁడంట పు
ష్పేషు మనోజ్ఞమూర్తియఁట యీ జగతీత్రయ పాలనైక జై
గీషువు శ్రీనివాస పరికీర్తిత నాముఁడటంచు వింటిమే 42

ఈ విషయాళి తప్ప నితరేతర మాతనిగూర్చి సుంత మే
మేవి యెఱుంగఁజాల మతఁడెంతటి శక్తి కళాధురీణుఁడో
దేవ! త్రికాలవేత్తలుగదే! తమరద్భుత దివ్యదృష్టితో
నీ వివరంబులెల్ల వచియింపుఁడు తెల్లముగా దయామయా! 43

అతనికిఁ బిల్లనీయఁ దగునా? యెవరాతని తల్లిదండ్రుఁడు? లం
చితమగు వంశమెద్ది? గుణసేవధియానాకొ? అన్నదమ్ములున్
హితులును తోడఁబుట్టువులు నెచ్చట? మీరలెఱుంగరాని వీ
చతు రుదధి ప్రవేష్టిత రసాస్థలి లేవుకదా! మునీశ్వరా!" 44

అని యీరీతిగ ముచ్చటించు నృపవాక్యంబుల్ సుధామాధురీ
ఘనధారాతతివోలె నిర్భర సుఖైకప్రాప్తిఁ గల్పింప స
ద్వినుతంబౌ నరమోడ్పు కన్నుగవతో దీపించు చిర్నవ్వుతో
క్షణమట్లుండి నితాంత హర్షమయ భాష్పశ్రేణి వర్షింపఁగన్ 45

"తావకాన్వయము కృతార్థతను భజించె
జీవితపుటాశ ఫలియించి సిరులు పొంగె
సిద్ధ జననాంతర తపోవిశేష పుణ్య
మిట్లు ఫలవంతమయ్యెనోయీ! నృపాల! 46

ధరణీజాని! అదృష్టమన్న నిదికాదాయేమి? పద్మావతీ
వరకన్యామణి ధన్యురాలు - జగతిం బాలించు నారాయణుం
డరుదౌ నీ గతజన్మ పుణ్యవశుఁడై అల్లుండుకానుండె నీ
కరరే! యెంతటి నోము నోచితొకదే ఆత్మీయభావంబునన్ 47

అతని కాళ్లకడిగి అధిప! కన్యదాన
మాచరింప సుకృత మాచరించు
దరతరాల కీర్తి చిరతరంబై మీదు
రెండు వంశములకుఁ బండువగును 48

ఏము తపోవిధేయమతి నేండ్లును బూండ్లుఁ దదీయ దర్శనో
త్కాముఁలమై తపించినను గానఁగరాఁడని తల్లడిల్లుచు
న్నాము మనోంతరంబున జనార్దనుడిట్లు భవత్తనూజకై
భూమిప! వచ్చుచుండె మనపున్నెము పంటలుపండె నిండుగన్ 49

ఆహా! యిన్నాళ్లకీనాఁటి కబ్బె గాదె
అఖిల కల్యాణకర్త కళ్యాణ శుభ మ
హోత్సవముఁ జూచు సద్భాగ్య, మొదవుకతనఁ
గన్ను లాతనిఁగనుగాక కరవుతీర 50

అజ్ఞతాంధకారముఁ బాసి యరుణకిరణ
సుప్రభాతమయ్యెను నేఁడె శోభమిగిలి
జన్మ సఫలత గాంచెనో జనమహేంద్ర!"
అనుచుఁ బులకించె శుకయోగి ఘన విరాగి 51

అంతట మౌని వాక్యముల క్రమమునొంది నృపుండు సోదరుం
డెంతకుఁబిల్చి "నీవ కడు శీఘ్రమ స్వర్గముఁ జేరనేఁగి అ
త్యంతము శ్రీ శుకాఖ్యముని యానతియంచు బృహస్పతిన్ సుధీ
మంతునిఁదోడి తెమ్మని సమంజస రీతిని బంపెఁ దమ్మునిన్ 52

అగ్రజు నానతి స్వీయ శి
రోగ్రము నందున ధరించి అరిగిజవానన్
వ్యగ్రమతిం గాంచె మనో
నిగ్రహమున నమరలోక నిఖిలముఁ బ్రీతిన్ 53

ఎచ్చటఁ జూచినన్ నవకళేందు కరామృత సేచనాగ్రహే
మొచ్చ ఫణీంద్రరత్న నిచయోజ్జ్వలకాంతి విశాలకుంభ సం
పచ్చయ చంద్రశాలలు నపార పరీమళ పుష్పమంజరీ
స్వచ్ఛ నికుంజపుంజములు భవ్యకళా తపనీయ శిల్పముల్ 54

పూర్ణసుధాతరంగ పరిపూత విశాల సరోవరంబు లా
కీర్ణ లసత్ప్రఫుల్ల మధుకీలిత పంకజపాళితోఁ బ్రియో
దీర్ణ మనోజ్ఞగీత పరితృప్త చరన్మధులిడ్గణాళితో
నర్ణవతుల్యమై యలర నందుఁ జరించు జలాండజావళుల్ 55

ముప్పదియేండ్లు పైఁబడక భోగసమర్థ వయోవిశిష్టులై
యొప్పుచు నిర్జరుల్ తరుణయోగ్య విలాస విహారభావముల్
చిప్పిల నందనోపవని చెంత సురాపగ సైకతంబులన్
ముప్పిరిగొన్న మోహమునఁ బున్నమిరేలఁ జరింపఁ గాంచుచున్ 56

రాకా సుధాకర రమణీయ చంద్రికా
వీచికా నికరంపు వెల్లువలను
ఆకాశ మందాకినీకూల పులిన స్థ
లంబుల మందార లతల నడుమ

 మొవ్వ వృషాద్రిపతి

నందనవాటికా సుందరకల్ప పు
ష్ప నికుంజపుంజోరు సౌరభములఁ
చక్రవాక మరాళ సారసబకముఖ్య
జలపక్షి కలకల స్వనములెసఁగ

మెలఁగు రంభా తిలోత్తమా మేనకాది
దివిజకాంతలు ప్రియులతో వివశలగుచు
నృత్య సాహిత్య శృంగార హేల లలర
సంచరింపఁ గాంచి యతండు సంతసించి 57

"అమరావతి - అమరావతి
యమరావతి యనుచుఁ బృథ్వి నతిసామాన్యుం
డు మొదలు రాజన్యులవఱ
కమితముగఁ బొగడుట దీని యందమునఁగదా! 58

ఇందుఁగలయంద చందంబులెల్లఁ జూడఁ
గలుగవలయు మోమున వేయికన్నులైన
దీనిగుణములు లెక్కింపఁ బూనుకొనిన
నుండవలె నోట నాల్కలు రెండువేలు" 59

వ॥ అని తదీయ సౌందర్య మహిమాతి శయంబునకు మానసంబున మిక్కిలి అక్కజంబంది స్వర్గ మహీధామంబెల్ల నిరర్గళ జవన ప్రచారంబులఁ గలయం దిరిగి-అందలి విశేషంబులెల్ల సంతోషంబున నిశ్శేషంబుగా నవలోకించి 60

ఆవిధిఁ దొండమానుఁడు మహాద్భుత దృశ్యములెల్లఁ గాంచుచున్
గ్రేవల సంచరించు గుణవృద్ధుల సిద్ధులఁగాంచి భక్తి "నో
దేవతలార! జ్ఞానజలధిన్ కృతబుద్ధి బృహస్పతిన్ గనం
గావలెఁ దద్గృహంబెచటఁ గల్గునొ సత్కృప నానతీయరే! 61

అనినన్ వారలు తొండమానుగని "ఆర్యా! అల్లదే నీలమే
ఘ నిభప్రోద్భవ హోమధూమ వలయాకారంబు లాకాశమం
దనయం బెచ్చటనుండి లేచెడినొ? నిత్యం బగ్నికుండంబులం
దనలుండుజ్వలుఁడై ప్రసన్నగతులన్ వ్యాపించుఁ దానెచ్చటన్? 62

ఇయ్యది భోగభూమియగు నేనియు నెవ్వని నిత్యకర్మపు
న్నెయ్యమునంది నిర్భర వినిశ్చల కర్మధరిత్రిగా యశం
బొయ్యనఁగాంచె?" నా సురలయొజ్జ గృహంబదెయంచుఁ జూప న
క్షయ్య భయాద్భుత ప్రమద సంకుల చిత్తతనేఁగి యాతఁడున్ 63

కొందఱు ఋత్విజుల్ సవనకుండములన్ సమిధాళివైవ నిం
కొందఱు వేదమంత్రములుకూడి పఠింపఁగఁ గొందఱాహుతుల్
పొందుగ వ్రేల్చుచుండ సురముఖ్యులు చుట్టునుజేరి భక్తియు
క్తిందగఁ గూరుచుండి తిలకించుచునుండిరి తత్క్రతుక్రియల్ 64

'స్వాహా' నినదంబులతో
ఆహుతులను వ్రేల్చుచుండ నా ఋజ్నాదం
బోహరిసాహిరి క్రమ్మెను
వైహాయస వీధులందు స్వరపక్వంబై 65

ఆకృతిఁ దాల్చినట్టి చతురాగమసారమొ? త్రేతరూపమో?
స్వీకృత సత్తపః ఫలిత విగ్రహమో? యనఁదేజరిల్లుచున్
బ్రాకృత కర్మదూరుఁడు విరాగి జనాగ్రణి శిష్యసంవృతుం
డైకృప బోధఁజేసెడి బృహస్పతిఁగాంచె కళానిశాపతిన్ 66

కనియాగీష్పతి దివ్యపాదయుగళీ కంజాగ్ర కింజల్కముల్
తనశీర్షంబు నలంకరింప వినతుల్ గావించి - స్తోత్రప్రస
న్నుని గావించి" నిరంతర క్రతువిధానున్ జ్ఞానసంధాను - పా
వన చారిత్రక ధన్య పుణ్యధను దేవా! నిన్ను దర్శించితిన్ 67

కన్నులున్నట్టి ఫలితంబు కలిగెనేఁడు
ఆర్తి నీదివ్య మంగళమూర్తి నిచటఁ
గరవు తీరంగఁ గనఁగొంటిఁ గల్మషములు
వాయుహతి దూదిపింజెలై బాసిపోవ 68

దేవా! నాదు సహోదరుండు ధరణీదేవాంఘ్రి భక్తుండు ధ
ర్మావేశుండు నృపాల శీర్షమకుటుం డాకాశ భూమీశ్వరుం
డావిర్భూత నిజాత్మజాతవర కల్యాణైక వాంఛన్ శకా
ఖ్యావిచ్ఛిన్న తపః ప్రశాంతుఁ గొనిరా నంపించె నన్నున్ వెసన్ 69

ఆతఁడువచ్చి సర్వవిషయంబుల నల్లన నాలకించి సం
ప్రీతి బృహస్పతిన్ గురువరేణ్యు నవశ్యముఁ దోడితెండు ని
ర్ధూత కళంకు భాస్కర విధూననతేజు నఖండ గౌరవో
న్నీతు సభక్తియుక్తముగ నిశ్చల శీల వినమ్ర చిత్తతన్ 70

అనుచుఁ బంపింప వచ్చితినయ్య! తబిసి
బెబ్బులీ!" యంచును ప్రపత్తి వినుతిఁజేయ
సురగురుఁడు దివ్యదృష్టితోఁ జూచి హర్ష
పారవశ్యాన కన్నీరు వరదలైన 71

అనఘుండై అరమోడ్పుకన్నుగవ నాత్మానంద చిన్ముద్రుఁడై
అనయంబాశ్రమ హోమ రక్షణకు శిష్యశ్రేణి శాసించి - ఆ
తనితోఁ గూడి విమానయానజవమున్ దల్లన్ను వేగప్రధా
న నభోమార్గమునన్ దపోమహిమ విన్యాసంబుగా నేఁగఁగన్ 72

తొండమానుండు - తేజఃప్రచండ దీప్తిఁ
దపనుఁ దపియింపఁ జేయుచు దైవపథిని
రెండవ యహస్కరుండన మండుచున్న
సరస ధిషణాధిపతిఁ గాంచి చకితుఁడయ్యె 73

విమల సంభాషణల జగావేగమంది
నిముసకాలాన ఆకాశనృపగజేంద్రు
చంద్రశాలాగ్ర తలమునఁ జక్కదిగిరి
సత్త్వగుణ మహాత్ములకు నసాధ్యమెద్ది? 74

వచ్చిన దేవసంయమికిఁ బాద్యమునర్ఘ్య మొసంగి భక్తితోఁ
దచ్చరణంబులంటి ప్రణుతంబగు గౌరవముల్ పొనర్చి సొం
పచ్చుపడంగ గాంచనమయాసనమం దుపవిష్టుఁ జేసి వై
యచ్చరమౌని కిట్లనియె నానృపుఁడంచిత దంతదీప్తులన్ 75

"దేవమునీంద్రచంద్ర! గణుతింపఁగ శక్యముగాని దివ్యమా
యావృతమైన వాతభుగగాధినివాసు మహత్త్వ తత్త్వమున్
దా వివరంబుగాఁ దెలిపెఁ దాపస చంద్రముఁడీశుకర్షి త
త్పావన శాసనంబుఁ దలఁదాల్చి తిరంబగు నిర్ణయంబునన్ 76

నా తనూజాత పద్మావతీ తరుణిని
శ్రీనివాసునకిడి పెండ్లిఁ జేయ నెంచి
మిమ్ము పిలిపింప శుకమౌని నెమ్మిఁబంప
మీకు శ్రమ నిచ్చినాఁడ క్షమింపుమయ్య! 77

అనఘా! తాము సుధీనిధానులు త్రికాలాబాధ్య విజ్ఞాన కా
రణు లత్యంత కృపావిధేయు లనుచున్ బ్రార్థింతు మన్నించి మ
త్తనయోద్వాహ శుభప్రదోహల ముహూర్త శ్రీ నిరూపించి పా
వన లగ్నంబును నిశ్చయింపుడు - గ్రహ వ్యాపార భద్రంబుగన్ 78

మునిశక్రా! తమ చేతిమీఁదగనె మత్పుత్రీ వివాహంబు ను
ర్వి 'నభూతోనభవిష్యతి' స్థితిని నిర్విఘ్నంబుగా సాఁగ దీ
వనలొప్పన్ శుభలేఖ వ్రాయుఁడు భవత్ప్రారంభ కార్యాళి కెం
దును విఘ్నంబులు రావనంగఁ బునరుక్తుల్ కాదె మున్మాటికిన్" 79

అని భూపాలకమౌళి - మౌళిపయి హస్తాబ్జంబులన్ మోడ్చి ఆ
ననమున్ వంచి వినమ్రుఁడై యడుగ నానందాద్రి శృంగాగ్ర కాం
చన పీఠిన్ వసియించి దేశికుఁడు "భూజానీ! భవత్పుణ్య మెం
తని వర్ణించెదఁ? పండె నీదు గత జన్మాయాత భాగ్యోన్నతుల్ 80

జలజాతాసన పాకశాసన ముఖాశాపాలకార్చాలయో
జ్జ్వల పాదాబ్జ సువర్ణపీఠుఁడు - మునీశవ్రాత హృత్కందరా
విలసత్కాంతి నితాంతఖేలనుఁడు - శ్రీ ప్రేమాంత రంగుండు - న
త్యలఘుశ్రేష్ఠ చరిత్రుఁడైన హరి నీ కల్లుండుగా నుండెడిన్ 81

ఆకులఁ గందమూలములు నంబువులున్ బవనంబుఁ దిండిగాఁ
గైకొని రేబవళ్లు నవికార కఠోర తపంబు వేల యేం
డ్లే కత మందొనర్చు ముని లేమహనీయుని గాంచ నేరరో?
వాకుల కందరాని భగవానుఁడు తానయితచ్చె నల్లుఁడై 82

ఎంత తపంబుఁజేసి జనియించితివో? రమ నీదు బిడ్డయై
చెంతల ముద్దుముచ్చటల చెల్మిఁజరించెడు - మోక్షలక్ష్మి య
త్యంతము మీదు దంపతుల హస్తమునం బదరీఫలంబు - రా
జ్యాంతమునందు నీకు నధిపా! వరకంబను మాటలేదయా!" 83

అని ఆకాశధరాధి నాయకుఁ బ్రియంబారంగ శ్లాఘించుచున్
వినయోదాత్తత శ్రీ శుకాఖ్యమునితో స్నేహంబు వాటించి గై
కొని పంచాంగము లగ్న నిర్ణయ విధాకూలంకష ప్రజ్ఞతోన్
కనియెన్ శ్రద్ధగఁ దద్వధూవరుల జన్మక్షేమ నక్షత్రముల్ 84

కనుఁగొని నిష్కళంకమును ఖగ్రహచక్ర మహోచ్చతాస్థితిన్
బనిగణియించి శుద్ధమగు భవ్యముహూర్తము నిశ్చయించి నె
మ్మనము ప్రశాంత సుందర సమంచితరీతిఁ జెలంగ వ్రాసె నీ
యనువున మౌక్తికోపమ కళాక్షరపంక్తుల లగ్నపత్రికన్ 85

# ఆకాశరాజ దంపతుల పెండ్లిపిలుపు

శేషభూధరవాసి శ్రీ శ్రీనివాసున
కాద్యంతరహితున కమరహితున
కాకాశరాజు నెయ్యముమీర వ్రాయించు
శుభలేఖ సౌఖ్య విస్ఫూర్తిరేఖ
తమ దివ్యమాహాత్మ్య తత్త్వగాథాతతిఁ
బెద్దలచే వింటిఁ బ్రేమఁగొంటిఁ
బావనశీల సౌభాగ్యవతియుఁ జిరం
జీవిని పద్మావతీ విశిష్ట
నామధేయను నా తనయనిచ్చి నీకుఁ గ
న్యాదాన మొనరింప నాత్మనెంచి
సుఖదమీ వైశాఖ శుద్ధ దశమి - శుక్ర
వారములగ్నంబు భవ్యమనుచు
ఈ ముహూర్త మార్యులు నిశ్చయించినారు
బంధుహితమిత్ర పరివార భరితులగుచుఁ
దనర వచ్చి కన్యాదానమును గ్రహించి
మముఁ గృతార్థులఁ గావింప మనవులివియె 86

మీరలేతేర భక్తితో మేమొసంగు
పూజ్య చందన తాంబూల ముఖసపర్య
లందుకొని మమ్ము నానందమందఁజేసి
ప్రీతిఁ జనుడంచు మిగులఁ బ్రార్థింతు మిమ్ము 87

ఇట్లు
ధరణీదేవి
ఆకాశరాజు

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

మంగళం మహత్

శ్రీ శుకమహర్షి - శ్రీ బృహస్పతిముఖ సమస్త దేవ మునిపుంగవ
శుభాశీర్వాదములతో

ఆ శుభలేఖఁ జేఁగొని ధరాధిపశక్రుఁడు భక్తిఁదాపసా
ధీశ శుకాఖ్యుఁగన్గొని "మునీశ్వర! విన్నపమాలకించి వా
తాశనరాడ్గిరీంద్ర శిఖరాగ్ర నివాసుని శ్రీనివాసుఁ బు
ణ్యాశయు నింటికేఁగుమని హస్తములన్ ముకుళించి వేడెదన్ 88

ఈ శుభలేఖ నిచ్చి ప్రకృతీతర తత్త్వ మహత్త్వ - సర్వదే
వేశుని శ్రీనివాసుని యభీష్టము స్పష్టముగా నెఱింగి త
ద్వేశము - సంపదల్ - విభవవిస్తృతులం బరికించి వాని సం
దేశముఁ దెల్పు - డంతటి ప్రదేశము నన్యులు చేరనేర్తురే? 89

మంచికిఁ జెడ్డకైనఁ దమ మాటనుదాటము - కంటిముందుఁ గ
న్పించెడు దైవమీవె - కరుణించిన నోంచినమీరె - కాన ఈ
యంచిత దివ్యకార్యమున కన్యులఁ బంపఁగలేక మిమ్మె య
ర్థించితిఁ బాలముంచెదవొ? దేశికపుంగవ! నీటముంచెదో? 90

తమ కరుణాకటాక్షరస తర్పిత పావన జీవనుండ - సు
క్షమ పథమందు మీ యడుగుజాడలుపట్టి చరించు శిష్యుఁడన్
యమివర! త్వత్ప్రసూచిత పథాంతర నీతివిదుండఁ గాన ని
క్కముఁ దలఁపోసి యీ చనవుఁ గైకొన మిక్కిలి సాహసించితిన్ 91

ఎన్ని తప్పులు పొనరించెనేనిగాని
తనదు దాసుల తప్పులు దండముననె
సరియ యందురు మా తప్పులరయఁబోక
పుత్రవాత్సల్యమున మమ్ముఁ బ్రోవుమయ్య!" 92

అని ప్రార్థించు ధరాధినాథుఁగని హాసాంకూర చాంద్రీద్యుతుల్
తన మోమున్ దనియింప మౌనివరు "డో ధాత్రీశ! యీ లీల వా
కొననేలా? భవదీయ పాలనఁ బ్రజాకోటుల్ సుఖోపేత మం
డనులై కడ్పునఁ జల్లయుం గదలకుండన్ బేర్మి జీవింపరే? 93

పండ్లబరువున వంగిన పాదపంబు
కల్లువ్రేటులు పెను శిలాఘాతములను
పొందుచునె సుధాఫలంబుల నందియిచ్చు
నట్లె ప్రభువును వర్తించు నహరహమ్ము 94

మండుటెండకుఁ దన నెత్తి మాడుచుండ
నాశ్రయించు ప్రాణులకెల్ల నశ్రమమున
చల్లనగు నీడనిచ్చి రక్షణము సలుపు
వృక్షములెదారిఁ జూపుఁ బృథ్వీశ్వరులకు 95

వైరుల డండయాత్రల నభంగుర సాహస విక్రమార్కులై
వీరవిహారులై రిపుల పీచమడంచి సమగ్ర సౌఖ్యముల్
కూరుపఁగా వలెన్ బ్రజకుఁ గొంచెముపాటి యసౌఖ్యమబ్బ దు
ర్వార వచఃపరంపర నృపాలుర సర్వులుఁ బ్రువ్వఁదిట్టరే? 96

ఒకవేళఁ బరాజయ బా
ధ కలుగ భూపతి దురంత దారుణగతులన్
సకలంబు భరింపఁగవలె
నకటా! సుఖమొరులపాలు - ఆపద తమకున్ 97

దుష్ట జనంబులచే బహు
నష్టంబులు పొరయనీ కనారతముఁ బ్రజన్
దుష్టివహింపఁగఁ జేయుట
కష్టంబగుఁగాదె రాజగణములకెల్లన్ 98

అటవీప్రాంత నివాసముల్ శరభసింహ క్రోడ శార్దూల మ
ర్కట గోమాయు మదేభ ఖడ్గవృక ఋక్షశ్వావి దత్యంత సం
కట హింస్రైక మృగ ప్రకీర్ణములు - దుఃఖప్రాప్య బాధావిశం
కటముల్ భూపులవల్లఁగాదె హిత సౌఖ్యంబిచ్చు మాబోంట్లకున్ 99

మునులకు మన్నుతేండ్లకు నపూర్వపు బంధమునేఁడు పుట్టెనే?
వినయవినీతి పంక్తిరథ పృథ్వీధవుండు వసిష్ఠుఁ గొల్వఁడే?
ఘనుఁడు రఘూద్వహుండు మునికౌశికు పాదములాశ్రయించి పా
వన విభవంబుఁ గైకొనఁడె? వజ్రిబృహస్పతి యండఁజేరఁడే? 100

జననాథా! అలనాఁడు ద్వాపరమునన్ సాక్షాత్తు విష్ణుస్వరూ
పుని శ్రీకృష్ణునిఁ గోరి మోహజనితాపూర్వానురాగాన రు
క్మిణి పంపింపదె స్వీయదేశికుని నగ్నిద్యోతనున్? నేఁడు త
ద్ఘన భాగ్యంబు లభించె నాకును భవత్కన్యా వివాహంబునన్ 101

కావున నన్యభావములు క్రందుకొనంబనిలేదు - మత్పురా
పావన జన్మ పుణ్యఫలబంధము లీవిధిఁ బండె రాజ! శే
షావనిభృన్నివాసు నిగమాంత విలాసునిఁ గాంచి వచ్చి దీ
క్షావిధి నీదు కోరికప్రకారము సర్వము నిర్వహించెదన్" 102

అని యా శుకముని శుభలే
ఖనుగొని యత్యంత శీఘ్రగమనము మనమున్
వెనుకకు నెట్టఁగ వడివడిఁ
జనియెను జీవుండు దైవసన్నిధి కనఁగన్ 103

ఆవిధిఁ బోయిపోయి ముని హంసుఁడు కాంచెనభః ప్రచుంబిత
శ్రీవితతాభ్రసంగము - ప్రసిద్ధశుకాదిఖగ ప్రసంగమున్
జీవ నదీప్రవాహ వరణీయ తరంగము - సిద్ధరంగమున్
భావిత జన్మకర్మ పరిపాక విభంగము - శేషశృంగమున్ 104

ఆ ధరణీ ధరాగ్రమున నందములొల్కెడు పర్ణశాలలో
శోధిత వేదసార పరిశుద్ధుఁడు బంధిత సర్వసిద్ధుఁడు
ద్బోధిత సత్త్వబుద్ధుఁడుఁ బ్రపూర్ణ జగత్పరిపాల నేద్ధుఁడున్
శ్రీధరుఁడుండె మాయయను చేలము కప్పిన జీవుకై వడిన్ 105

అంజనాచలసాను కంజాప్త బింబమో
యన రొమ్ము నందొప్పు మణిఁగలాఁడు
చంద్రబింబమునందుఁ జంద్రికారోచిగా
మోమునఁ జిరునవ్వు మొలుచువాఁడు
వికచాబ్జములమీఁదఁ బెనుతేఁటి దాటన
దృగ్వి మోహనపక్ష్మరేఖవాఁడు
మత్తేభకర పుష్పమంజరి యోనాఁగ
హస్తకేళీ పద్మమమరువాఁడు

అరయ మరుదేశ పీయూష సరసియనఁగ
మధ్య నాభిని పద్మ సంపదఁ గలాఁడు
శ్రీనివాసుండు శేషాద్రి శృంగ పర్ణ
శాలఁ బ్రత్యక్షమయ్యె మస్కరికరికిని 106

వ్రతములు దానధర్మము లపారతపంబులు చేసిచేసి య
క్షతమగు దీక్ష యజ్ఞముఖకర్మకలాపము లాచరించి స
న్నుతమగు వేదవాఙ్మయ మనూనగతిం బఠియించి యోగ సం
తతధృతిఁ గానలేని పరతత్త్వముఁ గాంచె శుకుండు భక్తిమై 107

చెంతకుఁజేరు మౌనికులశేఖరుఁ గన్గొని శ్రీనివాసుఁ డ
త్యంత సుధాప్రసన్న ముఖుఁడై భవితవ్యము నిర్ణయించి సం
భ్రాంత మనుస్కుఁడై యెదురువచ్చి వినిర్భర గౌరవాదర
స్వాంతవితీర్ణిఁ దోడుకొని పర్ణకుటీరముఁ జొచ్చి నమ్రతన్ 108

మృదుదర్భాసనమందు నుంచి వినయంబేపారు వ్యాపార సం
పద హస్తాంబుజ యుగ్మమున్ మొగిచి "దేవా! నీవు విచ్చేయ న
స్మదభీష్టంబులు పండె - నీ పద రజస్సంఘాత సంస్పర్శఁ బె
ల్లొదవెన్ బూజ్యత మా గృహంబు సిరికెంతో ఆటపట్టై తగున్ 109

బ్రతుకు కృతార్థతంబడసె స్వామి! మదన్వయ కర్తలెల్లరు
న్నత పదసిద్ధులైరి - పరినందిత మానసయై యదృష్ట దే
వత యిట గోచరించెఁ దమవంటి తపస్వులు మమ్ముఁ బోల్గృహ
వ్రతుల కుటీరముల్ దరియవచ్చుట మమ్ములఁబ్రోవనేకదా! 110

అని వాంచయమి పాదపీఠికడ సాష్టాంగంబు లర్పింపఁ గ్ర
క్కున మౌనీంద్రుఁడు "శీఘ్రమేవభవతే కల్యాణమ" స్తన్న దీ
వన తోడన్ శుభలేఖ నాతని కరాబ్జాతంబు నందుంచి "ఓ
అనఘా! దీనిఁ బఠింపఁ దెల్లమగు నీకామూల చూడంబుగన్" 111

సరసన్ మౌనము నూనియున్న వకుళాసాధ్వీ శిరోరత్న మం
తరమున్ గన్గొని పారికాంక్షి పదపద్మ ద్వంద్వ మర్చింపఁ "ద్వ
చ్చిరవాంఛాఫలసిద్ధిర" స్తనుచు నాశీర్వాదముం జేసి మ
స్కరి శార్దూలుఁడు యజ్ఞపూత శుచితేజః కల్పుఁడై యుండఁగన్ 112

అంతట శ్రీనివాసుఁడు ప్రియంబిగురొత్తఁగ లేఖ విప్పి యా
ద్యంతముఁగన్ తుదన్ జదివి హర్షవిధా పులకీకృతాంగుఁడై
చెంతలనున్న తల్లికిని జెప్పఁగ నాయమ కన్నుఁగోనల
శ్రాంత ముదశ్రు బిందుతతిఁ జార్చెను మౌక్తికహారరేఖగన్ 113

పరమానందుఁడు శ్రీనివాసుఁడు పరబ్రహ్మాత్మునిన్ శ్రీ శుకున్
గరుణాలోకన పారవశ్య వపునిం గావించి "పారాశరీ!
అరయన్ నాదగు పెండ్లికూర్పరులు మీ - రైశ్వర్యదానక్రియన్
దరమే మీ ఋణమీఁగ నాకు మరణాంతంబార్తి సేవించినన్ 114

తమ యీ యుపకారమునకు
సముచిత బహుమానమిపుడు సలుపఁగఁ జాలన్
బ్రమదమున నా నమస్కా
రములను గ్రహియింపుమార్య! వ్రతికులవర్యా!" 115

అన విని నవ్వుచున్ శుకమహర్షి ప్రసన్నముఖాంబుజాతుఁడై
కని "మహనీయ! ఈ యఖిల కారణభూతుఁడ వీవకావ? నీ
మనమునఁ గల్గు నూహలకు మారట రూపముగాదె యీ జగ
ద్గణ మఖిలంబుఁ? దత్సకల కర్తవు భర్తవు హర్తవీవెగా! 116

నిగమంబుల్ - స్మృతి - దర్శనంబులును నీ నిర్దిష్టరూపంబు నెం
తగ యత్నించియుఁ దెల్పలేక 'జగదంతర్యామి సర్వాకృతుం'
డగునంచున్ బ్రతిపాదనంబు సలిపెన్ యాదార్థ్య తత్త్వం బెఱుం
గఁగ వాణీఫణిరాడ్విరించి శివముఖ్య ప్రాజ్ఞ శక్యంబొకో? 117

నీ సంకల్పమునన్ వికల్పమెటలేనేలేదు వాగర్థముల్
శాసింపంబడు నీదుభావమున నిచ్ఛామాత్ర లోకత్రయీ
వాసోద్దైన్యము సంభవించు - వెస సంప్రాప్తించు క్షేమంబు లో
హెూ! సామాన్యుఁడ నీ మహత్త్వ పటిమంబూహింప శక్తుండనే? 118

సనకసనందనాది మునిచంద్రుల కందవు - వేదశాస్త్రముల్
నినుగనలేవు - నీదు మదినిల్పిన మేరువు గడ్డిపోఁచ - త
త్తృణమెసుపర్వ పర్వత విధింగొను - భావనచేసితేని నీ
క్షణమున విశ్వగోళములు సర్వము రూపఱుఁగాదె ఈశ్వరా! 119

ఏను నిమిత్త మాత్రుఁడను నీవె క్రియాళికిఁ గర్తవౌ - దవా
జ్ఞానన గోచరుండవు - జగత్సకలంబున నీవుకాని దే
దీ? నను నీ మనోభిరతి నిష్టము వచ్చినరీతిఁ ద్రిప్పి నీ
వానిగఁజేసి కొంటివి - ప్రపన్నుని నన్నిటు లాదరింపఁగన్ 120

ఇందునాదు కర్తృత్వ మింతేనిలేదు
దయ దలిర్ప నాకాశరాడ్భవున కిపుడు
తమయభిప్రాయ మెఱిఁగింపఁదగినలేఖ
వ్రాసి యనుమతిఁ బంపవే! పరమపురుష" 121

వ॥ అని యనేక రూపంబుల శుకయోగి ప్రార్థించిన

ఆ స్తోత్రఫణితికి హర్షించి శ్రీనివా
సుఁడు వ్రాసె నీవాసి శుభమెసంగ
"శ్రీ మన్మహారాజ! శ్రీరాజ పరమేశ
బిరుదాంకుఁ డాకాశధరణి పతికి
శేషాద్రి నిలయుండు శ్రీనివాసుఁడు వంద
నము చేసి వ్రాయు విన్నపములార్య!
శుకునిచేఁ బంపిన శుభలేఖఁ గైకొంటి
ఆనందమున మింటి నంటుకొంటి
మీరు కోరినయట్టి ప్రకారముననె
నడచుకొనఁగ సంసిద్ధుండఁ బుడమిఱేడ!
తన్ముహూర్తము వేళకుఁ దరలివత్తు
బంధుహితమిత్ర పరివార బంధురముగ" 122

అనుచు లేఖను విరచించి యడుగునందు
వ్రాలుగావించి తనతల్లి వకుళ కీయ
దాని కొనలందు నిడి హరిద్రాద్రవంబు
ముని కొసఁగ కన్నులకు నద్దుకొని యతండు 123

ఆ ప్రత్యుత్తరమున్ గ్రహించి యకలంకాధ్యాత్మికజ్ఞాన పూ
ర్ణ ప్రజ్ఞాన్వితుఁడైన యాశుకుఁడు శీఘ్రంబైన యానంబుతో
విప్రానందకరైక శీలుఁడగు పృథ్వీభర్త ఆకాశరా
జప్రాసాదముఁ జొచ్చి తన్నృపుని వాత్సల్యంబునం గాంచఁగన్ 124

ధరణీశుండు నమస్కరింప శ్రుతి మంత్ర శ్రీకరాశీస్సుధా
క్షర వర్షంబున ముంచి శేషగిరివాస ప్రాభవాధిక్య ని
ర్భర తత్త్వామృతవృత్తమున్ దెలిపి కార్యంబెంచి యిచ్చెన్ యశ
స్కర శోభావహదివ్యరేఖ శుభలేఖన్ లోక రక్షాకృతిన్ 125

ఇచ్చినలేఖఁ గైకొని ధరేశుఁడు కన్నులకద్దుకొంచు లో
మెచ్చి మునీశ్వరాంఘ్రుల సమీపమునం బ్రణమిల్లి లేచి వి
ద్వచ్చరితుండు మౌనికుల వర్యునుజ్ఞను లేఖ విప్పి పెం
పచ్చుపడన్ బఠించి విషయార్థ వశీకృత శాంతచిత్తుఁడై 126

ధరణీదేవిని జేరఁబిల్చి గళగాద్గద్యం బవార్యంబుగా
అరులారంగ ముదశ్రువుల్ దొరల లేఖాంశంబు లాద్యంత మా
దరమారన్ వినిపించి "ఓ సఖి! ముహూర్తంబింక సామీప్యమై
పరువుల్ వారెడుఁగానఁ బెండ్లిపనులన్ బ్రారంభముం జేయుమా! 127

అని వాక్రుచ్చిన భూపు నానతిని శీర్షాగ్రంబునం దాల్చి ఆ
యనదేవేరి పరంపరాగతములౌ ఆచార గోచార భా
జన వైవాహిక సంప్రదాయముల నాసాంతంబుగాఁ బెద్దవా
రును ముత్తైదువులున్ వచింప విని తాఁబ్రోత్సాహ సందోహయై 128

మామిడియాకు మండలను మంగళతోరణముల్ ఘటించి శా
లా మహితంపు ద్వారము లలంకృతిఁజేసి సువాసన ప్రసూ
నామల మాలికా సముదయంబులమర్చియు రెండుప్రక్కలన్
శ్యామలపర్ణయుక్కదళి కాంకురముల్ నిలఁబెట్టి మక్కువన్ 129

మౌక్తిక దామకంబులు సమంచితరీతి నలంకరించి - వ్యా
సక్తత ద్వారబంధములు సాది హరిద్రరసంబుపూసి సం
రక్తి లతాంతవల్లరులు రమ్యముగా విలిఖించి రంగులన్
వ్యక్త మొనర్పఁజేసిరి గృహంబులు లక్ష్మికి నాటపట్లుగన్ 130

రాజుగారింట నేఁడు పేరంటమనుచు
అతుల వర్ణ విచిత్ర భూషాళిఁ దాల్చి
పుణ్యయువతు లింటింటికిఁబోయి పిలువ
వచ్చినారు ముత్తైదువుల్ ప్రబలసంఖ్య 131

వరుసఁ బేరటాండ్ర పదాలఁ బసపుఁబూసి
మొగములందునఁ గుంకుమ బొట్లుపెట్టి
గంధమలఁది పన్నీరుపైఁ గలయజల్లి
రాణి స్వయముగ మిగుల మర్యాదఁజేసె 132

కప్పురఁపు బలుకులును - వక్కలును జాజి
కాయ లొప్పెడు తాంబూలకము లొసంగి
క్రొత్త రవికగుడ్డలుపెట్టి కోర్కిదీర
భూపుపత్ని పుణ్యస్త్రీలఁ బూజఁదనిపె 133

ఆవిధిఁ బేరటాండ్రు పడయంగల గౌరవమెల్లపొంది ప
ద్మావతి కాశిషంబులిడి మంజుల గానముతో విపంచికా
రావము విందుసేయఁ గపురంపు నివాళులనెత్తి స్వీయగే
హావళికేఁగుచుండ నధిపాంగన కాన్కలొసంగె వారికిన్ 134

పసుపుఁ గొట్టిరి ముత్తైదువలు కరాలఁ
గంకణంబులు శ్రావ్యమై ఘల్లుఘల్లు
మనుచు నినదింప శ్రుతిపక్వమైన గాత్ర
ములను సారించి పెండ్లిపాటలను పాడి 135

వెల్లవేసిరి గోడలకెల్లఁ - బెండ్లి
వస్తు సంభారములు తెచ్చి పదిలపఱచి
తనరెపరివారమెల్లను ధరణిదేవి
తానుగాఁ బర్యవేక్షించె దగ్గరుండి 136

అకసమంటు పందిరుల నభ్రపథంబును మూసివైచి ప్ర
త్యేకపు ఛాందినీ విభవమేర్పడఁ గట్టి పసందు జాళువా
జోక కడాని జాలరులఁ జొప్పడు నిద్దపు నైగనిగ్యముల్
సోఁకి దిగంతముల్ పసిఁడి జొబ్బిలు కుడ్యములై విరాజిలన్ 137

తిరమై యొప్పు విశాలవేదికలు దిగ్దేశంబుఁ గ్రమ్మంగ న
బ్బురమై కస్తురి గోమయంబు మిళితంబుంజేసి యల్కించి స్వ
ర్ణ రజోలేపమలంది దివ్య మణిరత్న క్షోదసందీప్తితోఁ
గరమున్ మ్రుగ్గులు తీర్చి గంధజలమున్ గల్యంపిగాఁ జల్లియున్ 138

పందిరిమట్టు భాసుర సువర్ణ మయాంచిత దీపతోరణా
లిందు మనోజ్ఞకాంతి వెలయింపఁగ రత్నగణంబు గోడలం
బొంది రవి ప్రకాశరుచి పొంపిరివోవ సుగంధ వీచికా
బృందము చిందులాడ విరిపేరులు వ్రేలఁగఁ జేసిరంగుగన్ 139

వేదికిమధ్య నెత్తయిన పెండిలి మండపమొండు గట్టి ర
త్నాదికహార సంతతుల నందముగానిడి స్వర్ణకుంభముల్
వేదికి రెండుపార్శ్వముల వెండి యమర్చి యరంటి బోదలన్
మోదము మీరనుంచి యతి మోహవిధాన నలంకరింపఁగన్ 140

వేయి వేవెలుఁగుల వెల్గు లీ యిలాస్థ
లంబుముంచెనో? శీతరుగ్బింబకోటి
యొక్కసారి నభస్థ్సలి నుదయమందె
నౌర! యన నొప్పె నంతఃపురాంగణములు 141

ఈరీతి నంతఃపురారామములఁగళా
లలితంబుగాఁ బెల్లలంకరించి
రాజధానీ నగరంబు శృంగారమ్ము
క్రమ కక్షోద్దిష్ట గతులఁ దీర్చి
పునుఁగు జవ్వాదియు ఘనసార మృగమదం
బులఁగల్పి కలయంపిఁ గలయఁజల్లి
నవరత్నములపిండి సవరించి వీధుల
నకలంక రంగవల్లికలు దిద్ది

గేహ కుడ్యముల్ నవరత్న కీలితములు
కాఁగ ఘటియించి చూపఱ కనుగవ మిఱు
మిట్లు గొలుపంగఁ దీర్చిరి మేదురముగ
రాజ విభవంబు లింతలై గ్రాలుఁగాదె 142

భవ్య పద్మావతీ శ్రీనివాసులకును
జరుగఁబోయెడు కల్యాణ సరసవార్త
గాలికిని తెక్కలదికిన కరణి నఖిల
దిక్కులం గుప్పుమని క్రమ్మె నొక్కసారి 143

నుడిఁగొని యా సువార్త చెవి సోఁకెనొ? సోఁకదొ? నారదుండు నె
వ్వడిఁజని శేషభూధర నివాసునిగాంచి నమస్కరింప నా
తఁడుఁ గడు గారవించి విశదంబుగ స్వీయ వివాహ సంగతుల్
నుడివి మనస్సునం దిగులు నూల్కొన నల్లనఁబల్కె నీ గతిన్ 144

"నారద! పెండ్లి ఖర్చులకు నాకడ లేదొక చిల్లిగవ్వయున్
వారిజగర్భగేహ నను బాసి చనెంగద నాఁటినుండి సం
సారసుఖంబులేదు పెలుచన్ గడుపారఁగఁ దిండిలేదు - కన్
గూరుకులేదు - చెప్పటకుఁగూడ నొకించుక సిగ్గుమొగ్గెడిన్ 145

వైరులకైనఁగూడ దిటువంటి భయంకరమౌ దరిద్రతా
పార మనోవికారము - విపత్తులు వీడక యొండొకండుపైఁ
బారఁగ నోర్వలేక పలుబాములఁ గుందుచునుంటి లోకమం
దారయ లేమికన్నఁ గలదా? మరి వేరొక చిచ్చుకాల్పఁగన్ 146

ఆలుంబిడ్డ లనాదరింతురు - చెలుల్ హార్దిక్యముం జూపరే
లీలన్ బంధులు లెక్కసేయరు - మహాక్లేశంబు లాసించినన్
జాలింజూపరు సాఁటివార లకటా! బావేశరణ్యంబు గా
దా? లేమింబడి గ్రుగ్గుకంటెను మనుష్య శ్రేణికిన్ - నారదా! 147

నారద! యెచ్చటైనను ధనంబు ఋణంబుగఁ జిక్కు మార్గమున్
బారఁగఁజూచి విఘ్ననిరపాయముగాఁ ద్రిజగచ్ఛుభంబు పెం
పారఁగ నెమ్మి నా పరిణయం బొనరింపుము దగ్గరుండి - యీ
తీరున వడ్డి యెక్కువని దిక్కులుసూడకు కార్యపద్ధతిన్ 148

డబ్బులు చేతలేక యకటా! యిట పెండ్లిపనుల్ పొనర్పఁగా
నబ్బదు - నీవ యన్నిటికి నండగనుందువటంచు ధైర్యముం
బ్రబ్బగనుంటి - నా వ్యధలు మాన్పి నిధుల్ సమకూర్చి మంచియున్
సెబ్బరలెంచి యీ పగిదిఁ జేయుము నన్నొక యింటివానిగన్ 149

డబ్బు లేనివాఁడు డుబ్బుకుఁ గొఱగాఁడు
ధనమె మూలశక్తి జనులకెల్ల
ధనమునందె యుండు దైవంబు దయ్యంబు
ధనములేక బ్రతుకఁ జనదుపృథ్వి 150

కార్యభారంబు నీ భుజాస్కంధమందు
నుంచి నిద్రింతు హాయిగా నోమనుమఁడ!
ఎట్లు కడతేర్తువో నన్ను నింక" యనెడు
శ్రీనివాసునిగని దేవమౌని నవ్వి 151

"తాతా! బేలతనంబుతోఁ బలుకు నీ దైన్యం పుటాలాపసం
జాతంబుల్ విన నవ్వు పుట్టెడిని - దుస్త్యాజ్యంపు దారిద్ర్య దా
వాతి జ్వాలల గ్రుగ్గు దీనజను లార్తారావముల్ సేయ నీ
చేతంబింతకరంగెనే? తమచెవిన్ జీమంతయున్ దూరెనే? 152

కడఁగి తనదాఁక వచ్చినఁగాని తెలియ
దందు రింతియెకద? రమా సుందరీమ
తల్లికనుగూడి యానంద తత్పరతను
మునిఁగినపుడు వింటివె పేదజనుల మొరలు? 153

అన్నవస్త్రంబులకు రోసి ఆఁకలెత్తి
చిక్కి నకనకలాడుచుఁ జేవలేక
బ్రతుకు భారమ్ముగాఁ గావరమ్మటంచు
నఱచు పేదలగోడు నీకర్థమగునె?" 154

ఈరీతిగ వచియించెడు
నారద వాక్యములు చెవుల నాటములుకులై
నారాయణుఁడిట్లను "నో
వారిజభవతనయ! యిట్లు పలుకఁగఁ దగవే? 155

బాధలలోన నున్న పగవారల సైతము మంచిమాటలన్
బోధలొనర్చి తేర్పఁదగునొచ్చెడు మాటల ముళ్లుగ్రుచ్చి చిం
తాధిక వృత్తిగూర్చి గతమంతయు జ్ఞప్తికిఁ దెచ్చుచున్ మనో
వ్యాధికిఁ బాలుసేయ నిదిభావ్యమె? పెద్దలకున్ స్వభావమే? 156

నాపయిఁ గక్షఁబూని జతనంబున సేయకు కార్యభంగమున్
దాపయి అప్పు పుట్టఁదగు తావును దెల్పుమ - అల్పు లట్టు లే
దో పగఁ జిత్తమందొకటి యుండఁగ వేరొకటెన్న - కెంత నీ
కీ పనిచేఁత? లోకమున నీఁతకు మిక్కిలిలోఁతు కల్గునే?" 157

అనుచు నర్థించు శ్రీనివాసుని నుతించి
బ్రహ్మరుద్రేంద్ర రవిచంద్ర వసు ముఖామ
రులను - నష్టదిక్పాలుర - నలఘు యక్ష
వరు - నవగ్రహముల శేషగిరికిఁ బిలిచె 158

వారలు నారదు నాహ్వా
నారూఢానంద చిత్తులై శీఘ్రమునన్
జేరిరి వైకుంఠపురీ
శ్రీ రమ్యంబై చెలంగు శేషాచలమున్ 159

వ॥ అట్లేతెంచిన బ్రహ్మరుద్రేంద్ర యక్ష సిద్ధ సాధ్యఖేచర గరుడ కిన్నరకింపురుష నాగనభశ్చరాది దేవతాయోనులకుఁ జెందిన ప్రముఖులందఱును శ్రీనివాసుని సన్నుతించియు - అభినుతించియు - స్తుతించియు - నమస్కరించియుఁ దత్తదుచిత ప్రకారంబులఁగావించి సముచితాసనాసీనులై ప్రభాభాసమానులై యుండిరి సుగంధబంధుర మృదుల మలయానిలంబులు వలయంబులై సమీచీనంబులై అల్లనల్లన విహరించె, ఆ సమయంబున సభ నంతయుంగలయం గనుంగొని సర్వవిషయ విశారదుండగు నారదుండు సుధామధుర వాక్యుండై యిట్లని యభిభాషించె 160

"దేవతలార! స్వాగతమిదే గ్రహియింపుడు - నింపుడీ త్రిలో
కావను మీదు దీవనల - నాదృతి నా పిలుపందుకొన్న మీ
రీవిధి వచ్చినందులకు నెంతొ కృతజ్ఞుఁడ - నిచ్చటొంటిగా
శ్రీవిభుఁడున్న సంగతులు చెప్పఁగనేఁటికి మీకు వేరుగన్? 161

శుభవిశుద్ధమీ వైశాఖశుద్ధ దశమి
శుక్రవారము శ్రీనివాసుండు హర్ష
మడరఁ బద్మావతిని బెండ్లియాడఁగలఁడు
మనకు నయ్యది మిగుల సంబరముకాదె? 162

అనుచుఁ గుబేరువంకఁ గని "ఆర్య! త్రిలోకములందుఁ ద్వత్సముం
డనఁదగు భాగ్యవంతుఁ డొకఁడన్యుఁడు కల్గునె? నీ సహాయమున్
గొనెడు కుతూహలంబున వికుంఠుఁడు పొల్చెడు - దాపకుండ నీ
మనమును విప్పిచెప్పుము - ప్రమాదములేదెటు లీవు చెప్పినన్ 163

ఖర్చులకుఁజేత నెట్టి యేగానిలేక
దిగులుపడినాఁడు స్వామి నెవ్వగఁగృశించి
లక్ష్మి దరిలేని తత్పతి లక్షణమిది
పరులగూరిచి వేర చెప్పంగనేల? 164

యక్షకులనాథ! తగిన ద్రవ్యంబునిప్పు
డప్పుగానిమ్ము వడ్డి యెంతైనగాని
నీకుఁగాని నీయనుమతి నెనయు వారి
కైన నడిగినప్పుడ యిచ్చునయ్య! విభుఁడు 165

అనినఁ గుబేరుఁ డెంతయు మహాముదమంది" మహాత్మ యిట్లు ప్రా
ర్థన మొనరింప నాశ్రితుఁడ దాసుఁడగానొకొ? క్రొత్తవాఁడనే?
ధనమును కుప్పఁబోయనొకొ తావకశాసనవర్తినై - యిదే
కొనుమని యిచ్చె శ్రీవరుఁడు కోరిన యర్థము మేరమీరఁగన్ 166

పద్మజాజాని యొకకోటి పదియునాల్గు
లక్షలగు రామ నిష్కముల్ వడిగ్రహించి
వ్రాసి ఋణపత్ర మిచ్చెనువాని - కతఁడు
కన్నులకు నద్దుకొని దాని కడు గ్రహించె 167

అందు రుద్రుఁ డశ్వత్థమ్ము నబ్జభవుఁడు
సాక్షులుగనుండి చేవ్రాలు సలిపి రంత
నెచటివార లచటికేఁగిరెంతొ వేడ్క
శ్రీనివాసు వీడ్కొని యభ్ర సీమలందు 168

## సోపానాంతము

ప్రణవాకార! వికార దూరచరితా! ప్రారబ్ధ నిర్మూలనా!
ప్రణుతామ్నాయ రసాలకానన చరద్వాసంత పుంస్కోకిలా!
గుణ భావప్రతిరూప! నిత్యకరుణాకూపార! సాయుజ్య కా
రణ నామైకజపప్రభావ! భుజగేంద్రక్ష్మాధ్ర శృంగస్థిరా! 169

సర్వ సజ్జన రక్షణైక విచార తత్పర! చిత్కరా!
పూర్వనిర్జర గర్వభంజన పూర్ణయత్న కళాధరా!
శర్వపద్మజ సుపర్వ సంస్తుత శక్తిసం భృతవర్తనా!
శర్వరీకర సూర్యనేత్ర! విశాల కీర్తి మహాధనా! 170

జ్ఞాన సత్యాకృతీ! గానలోలాదృతీ!
ధ్యాన సంకర్షణా! త్యాగసందర్శనా!
మాన సంరక్షణా! మాన్యహృద్వీక్షణా!
శ్రీనివాసస్థలా! సిద్ధయోగాఖిలా! 171



# పద్మావతీ శ్రీనివాసీయము

## సప్తమ సోపానము

శ్రీ నారాయణ గిరివా
సా! నానామ్నాయమంత్ర సన్నుత భాసా!
మానిత చంపక వాసా!
శ్రీనారీహృన్నివాస! శేషాద్రీశా! 1

అవధరింపుము 2

పరమ పౌరాణికోత్తమ చరితుఁడైన
సూత మౌనీంద్రుఁజూచి సుప్రీతులగుచు
శౌనకాది దివ్యర్షు లనూన వేంక
టేశ్వర కథాసుధాపాన హృష్టమతుల 3

"వాణీపుం రూపముతో
నాణెముగా వేంకటాద్రి నాథామృతగా
థానీకముఁ దెలిపితి వో
మౌనీ! నీ ఋణముఁ దీర్ప మా తరమగునే? 4

తదుపరి కథ నాలింపఁగ
నెదయెల్లను జెవులు మొలిచె నెంతయు పుణ్య
ప్రదమగు దీనిం దెలుపం
గదవే!" యని పలుకు మౌని గంధేభములన్ 5



మొవ్వ వృషాద్రిపతి

కనిమది నానందించుచుఁ
దనగురుని మనంబునందు ధ్యానించి మహా
వినయంబున సూతుఁడు వినుఁ
డని మునులను గూర్చి యిట్టు లభిభాషించెన్ 6

అపుడు సురుల్ కుబేరుఁడు విహాయసవీధుల నింద్లకేఁగ నా
విపుల తపస్వి నారదుఁడు వేంకటనాథుని గాంచి "దేవ! నే
నిపుడిటవచ్చినట్టి పనియెల్ల ఫలప్రదమయ్యె నింకన
ప్రపుఁదమి ముజ్జగంబులను వార్తలెఱుంగఁగఁ బోయివచ్చెదన్ 7

కావున నాకు నొక్క- యెడ గమ్మునసుండఁగఁ గాదు నీకుఁ బ
ద్మావతికిన్ వివాహమనిత్రై జగతీవలయానఁ జాటి నీ
భావమునం దనుందలఁప ప్రాలుదు టెక్కలు దాల్చి యెప్పుడేన్
గావలెనన్నబోఁ? దిరుగుకాలును తిట్టెడునోరు నాగునే?" 8

అన విని నవ్వి శ్రీనిలయుఁ "డబ్జజమానస నందనా! తపో
ధనుఁడవు సర్వలోకహిత తత్పర బుద్ధివి నీ పరిశ్రమం
బున నసురాళినోర్చి సురపుంగవులొందుదు రాత్మ సౌఖ్యముల్
గొనకొని నీవులేక యొనగూరునె వారల కొక్కకార్యమున్? 9

నా కల్యాణము సర్వలోకహిత సంధానమ్మె - విఘ్నక్రియ
ల్లే కాదర్శముగా ఘటింపు - మిది నా లీలావిలాసంబుగా
లోకంబందుఁ బ్రజల్ కథా రసముగాలోలాత్ములౌచున్ సతం
బాకర్ణించెడు నట్లు వర్తిలును వత్సా! పూర్ణ సత్త్వస్థితిన్ 10

ఎంతయు మేలొనర్చితివి యింతటి అప్పు లభించియుండునే
చెంతల నీవులేక? యిదె చెప్పుచునుంటిని నా వివాహ మా
ద్యంతము దగ్గరుండి సకలార్థ పథంబునఁ జేతిమీఁదుగా
నంతయుఁ దీర్చుమీవ - విమలాంచిత దివ్యకళా మయంబుగన్ 11

ఎక్కడనెక్కడఁ దిరిగినఁ
జక్కఁగఁ బ్రతిదినము నొక్కసారియెగానీ
యిక్కడకు వచ్చి" పొమ్మని
అక్కలహాశనుని బంపె హరి సత్కరుణన్ 12

నారదుఁ డేగినంత ఫణినాయక తల్పుఁడుదాత్తవృత్తి మా
యా రమణీయ చిత్రరచనాద్భుత శక్తికళాధరున్ ద్రిలో
కీ రసరాజ్య నిర్వహణకీలిత సత్ప్రతిభావహున్ సుధీ
సారుని విశ్వకర్మ ఋషి సారసగర్భుఁ దలంచె నాత్మలోన్ 13

జగతీ నిర్మాణ కళా
సాగరుఁడగు విశ్వకర్మ హరి సన్నిధికిన్
వేగమచని పొడఁగని చతు
రాగమ సూక్తుల నుతించి ప్రార్థించె నిటుల్ 14

"దేవా! నన్ మనసార నెంచుటకు ప్రత్యేకైక కార్యంబు లు
న్నే? విశ్వైక ధురంధరుండవు ధరన్ సృష్టింపఁ బోషింప లే
దా విధ్వంసమొనర్చు వేళలఁ ద్రిమూర్త్యాకారముం దాల్తువా
శ్రీ వాణీగిరిజా సతీమణులుగాఁ జిచ్ఛక్తి చెన్నారెడున్ 15

ఈ వొనరింపలేని దొకటేనిఁ జరాచరమందుఁ గల్గునే?
మావలనన్ హితంబు లణుమాత్రముఁ గల్గునె? కల్గెనన్నచో
నీవిటు పెద్దచేసి మము నెల్లజగంబుల గౌరవాదర
శ్రీ వెలయింపనేకద? వచింపఁగ సాధ్యమె నీ విలాసముల్?" 16

అనునెడ విశ్వకర్మ వదనాంబుజముంగని శ్రీనివాసు" డో
యనుపమకర్మ కౌశల మహాగణనీయ యశోవిశాల! నీ
వినయము మాకు మిక్కిలిగఁ బ్రీతి ఘటించె వినిర్మలక్రియా
చణుఁడవు నీకు నన్యు లొకసాటియె సర్వజగత్క్రియారతిన్?" 17

అని ప్రశంసించి విశ్వకర్మాఖ్యునకును
దన వివాహవిషయమెల్ల వినిచినంత
నందమైయొప్పు సుందర మందిరములు
విడిది గృహములు నిర్మించి విస్తృతముగ 18

నీటి యంత్రంబు లారామనిష్కుటములుఁ
గొమరు మిగులు విద్యుద్దీప గోళములును
గూర్మి వేంకటాచలమె వైకుంఠనగర
విధి నలంకరించె క్షణాన విశ్వకర్మ 19

అటులాతండు మనోజ్ఞ సుందరముగా నాద్యంతచోద్యంబుగా
జటులాలంకృతి శేషశైలమును దీక్షన్ నేత్రపర్వంబుగా
స్ఫుట చాతుర్యము మీరఁదీర్ప హరి తద్భూరి ప్రభావంబు నా
దట లో మెచ్చుచు విశ్వకర్మనుచితార్థ స్ఫూర్తి మన్నింపఁగన్ 20

ఆతఁడు చనియెను నచ్యుతు
చేత ననుజ్ఞాతుడగుచుఁ జేతః ప్రీతిన్
ప్రాతిగ శ్రీహరి వకుళా
మాతను దరిఁజేరి యిట్లు మనవి నొనర్చెన్ 21

"అమ్మా! పెండ్లికి బంధుమిత్రతతి నాహ్వానింపమో? చుట్టప
క్కమ్ముల్ వెంబడిలేక యిద్దరమె యేఁగన్ శోభ యేముండు? చో
ద్యమ్మంచున్ గనువారు నవ్వరె? విచిత్రంబంచు వియ్యాలవా
రిమ్మై ముక్కున వ్రేలువైచుకొనరా? యేమందువీమాటకున్?" 22

ఆమాటకు వకుళాసతి
ప్రేమాదరమారఁ జూచి శ్రీ వాసునితోఁ
బ్రామాణిక గేహవ్రత
సామాన్యవిధాన నిట్లు సాయించెధృతిన్ 23

"నాయన! శ్రీనివాస! పదునాల్గు జగంబుల నీకుఁగాని వా
రేయెడనైన నుందురొకొ? యెల్లరు నీ ప్రజలేకదా! శుభ
శ్రేయములొప్పఁగా బరులు స్నేహితులన్న విభేదమింతయుం
జేయక యెల్లవారలకు శీఘ్రమ పంపుము పెండ్లిపత్రికల్" 24

అన విని సంతసించి దరహాస ముఖాబ్జుఁడు శ్రీనివాసుఁడా
క్షణమున స్వచ్ఛసుందరముగా శుభలేఖలు వ్రాసి చిత్రమం
దున వినతాసుతున్ దలఁపఁదోడనె స్వీయ గరున్మరుద్గతిన్
వినుపథి రిక్కబాలు పృథివిందొరలం జనుదెంచెనుద్ధతిన్ 25

గరుడుండాగతి వచ్చిమ్రొక్కి" భవదాజ్ఞాపాల నోదారవే
గరతిన్ దేవరవారి కట్టెదుట తెక్కల్ దాల్చి నే వ్రాలితిన్
బరమోదాత్త విశేష మేర్పడక పిల్వంబోరు నన్నోదయా
భరితాంతః కరుణా! వచింపుమిట నావల్లన్ బనుల్ కల్గినన్" 26

అనుచు వినమ్రుఁడైన వినతాత్మజు మాటలకుల్లసిల్లి" యో
ఘన జవధిక్కృత ప్రళయకాల మహానిల! నా వివాహ వా
ర్తను జగతీత్రయైక జనతా విదితం బొనరించి వారి బో
రనఁ జనుదెంచు పెండ్లికి బిరాన నటంచును పిల్చిరావలెన్" 27

అని శాసించిన దివ్యమంచు గరుడుండాకాశ మార్గంబునన్
దన పక్షక్షతి మేఘమాలికలు నుద్యత్తూలికాపుంజమై
చన వేగంబునఁబోయి ధాత్రభవయక్షస్వామి దేవేంద్ర ము
ఖ్య నివేశంబులు డాసి వారికెల్ల శుభలేఖల్ పంచె నాహ్వానముల్ 28

నర సుర యక్ష కింపురుష నాగ నభశ్చర సిద్ధ సాధ్య ఖే
చర గరుడాది లోకములఁ జయ్యన డాసి ఫణీంద్రతల్పు స
త్పరిణయవార్తఁ దెల్పి ప్రమదంబుగఁ బెండ్లికి రండటంచు నం
దరిని ప్రియంబునం బిలిచి తారకలన్ గడువంగసాఁగుచున్ 29

ఘన శేషాద్రిని జేరి స్వామికి నమస్కారంబుఁ గావించి యా
యనకున్ దానటు పోయివచ్చినవిధం బామూల శీర్షంబుగా
వినిపింపన్ హరి విష్కిరాధిపతినిన్ వీక్షించి "పక్షీశ్వరా!
పనులన్ సర్వము నిర్వహింప నిచటన్ వాసింపుమీ" యీవనన్ 30

స్వామి యానతిఁ దలఁదాల్చి పక్షిరాజు
శేషశృంగాగ్రముల నిల్చి చెప్పినట్లు
పెండ్లి పనులెల్ల నొక్కఁడై వితత కౌశ
లమ్ము దైవారఁ గావించె సమ్మతముగ 31

శారదావల్లకీస్వనము విందులొనర్ప
బ్రహ్మ వచ్చెను హంసవాహనమున
హైమవతీసతీ హాసప్రభలు పర్వ
హరుడు వచ్చె వృషశతాంగమందు
ఐరావతముమీద నమరనాథుఁడువచ్చె
శచికైశ్య మందార సౌరభముల
దైవతాచార్యుండు తారామణిని గూడి
ఘన విమానంబుపైఁ గదలివచ్చె

నగ్ని స్వాహా ద్వితీయుఁడై యరుగుదెంచె
వరుణవాయుకుబేర నవగ్రహాళి
సూర్యచంద్రులు తమతమ భార్యలఁగొని
చేరివచ్చిరి గుంపులై శేషగిరికి 32

సాధ్వీ శిరోమణి సతి యరుంధతితో వ
సిష్ఠుఁడేతెంచె విశిష్ట తేజుఁ
డనువై పతివ్రతామణి యనసూయతో
అత్రి వచ్చెను స్తోత్రపాత్రుఁడగుచు

భవ్యవర్తనశీల పడఁతి యహల్యతో
గౌతముం డరుదెంచె ధూత పాపుఁ
డల్లదితిపులోమ లను భార్యలనుగూడి
భృగువు వచ్చెను తపస్సుగముఁ డగుచు
ధన్యజీవనశీల సుకన్యఁగూడి
చ్యవనుఁడేతెంచె ననునిత్య సవనుఁడగుచు
శ్రీనివాసుని కల్యాణ సిద్ధిఁజూడ
నతులితోత్కంఠ నిరతి శేషాద్రి దరికి 33

నారద విశ్వావసు లిం
పారఁగఁ దుంబురుఁడు నాదియగు వైణికులున్
బోరన వచ్చిరి వీణా
ధారులుకొందరు దిగంత ధారణకీర్తుల్ 34

స్తోత్ర సమర్థపాత్రులు విశుద్ధ చరిత్రులు నిత్యసూరులున్
క్షాత్ర విరాజితంబు గుణసాంద్రము జన్యమహోగ్రసైన్యమున్
క్షేత్ర పవిత్రమూర్తులు ప్రసిద్ధులు ముక్తులు వెంబడింపఁగా
సూత్రవతీ మనోధవుఁడు వొచ్చెను శేషగిరీంద్ర శృంగమున్ 35

మూషికవాహనుండు గుడమోదకలడ్డుకఖాది సర్వ రా
డ్భూషణ భూషితుండు గిరి పుత్రిక ముద్దులబిడ్డ - విఘ్న వి
ద్వేషి స్వభక్తరక్షకుడు వేలుపుఁబెద్ద గజాననుండు స
ద్భాషణుఁడేక దంతుఁడట వచ్చె ఫణీంద్ర గిరీంద్ర భూమికిన్ 36

వరతేజోనిధులైన శౌనక భరద్వాజాసురి వ్యాఘ్రపాత్
శరభంగచ్యవనాత్రి కణ్వబక విశ్వామిత్ర మాండుక్య సౌ
భరి శాకల్య సుతీక్ష్ణ దక్షరురు దుర్వాసోమతంగాక్ష పా
త్పురు కుత్సానఘ ఋశ్యశృంగమునిరాణ్ముఖ్యుల్ ప్రమోదాత్ములై 37

వామదేవ మార్కండేయ రోమహర్ష
కపిల మాండుక్య జాబాలి కక్షపాల
మాందకర్ణి వాధూల రోమశ విభాండ
కాది మునులు వచ్చిరి గరుడాద్రిఁజేర 38

నుత పాథోధి జలంబు సర్వమును గండూషించె నెవ్వండు? నా
యత వైహాయస వీథిఁ జొచ్చిచను వింధ్యాహార్య గర్వంబు ను
ద్ధతి భంజించె నెవండు? - నిల్వలునివాతాపిన్ ధృతిన్ ద్రుంచెనే
వ్రతి చూడామణి? యా యగస్త్యజటి లోపాముద్రతో వచ్చెఁదాన్ 39

మంజుఘోషా తిలోత్తమా మహిఘృతాచి
అబ్జవక్త్రోర్వశీ మేనకాద్యఖిల సు
రాంగనలు రంభతోఁగూడి ప్రబల రమ్య
నృత్యముల వచ్చి రెలమి ఫణీంద్ర గిరికి 40

నర సుర యక్ష కింపురుష నాగ నభశ్చర సిద్ధ సాధ్య ఖే
చర గరుడోరగ ప్రముఖ చారణ కిన్నర ముఖ్య దేవతా
వర నుతజాతివారు పరివార సమేతముగా ననంత భూ
ధర శిఖరాగ్ర భూమికి ముదంబునవచ్చి రమేయ శీఘ్రులై 41

వచ్చుచు నన్నవారి విభవైక సమర్థ నివాస హర్మ్యముల్
మెచ్చుగఁ గూర్చి సర్వసుఖ మేదుర మౌసదుపాయముల్ హితం
బచ్చు పడంగఁ జేయుచుఁ బ్రియంబున సూత్రవతీ మనోహరుం
డెచ్చటఁ జూడఁదానగుచు నేఁపునఁ దీర్చె సమస్తకార్యముల్ 42

చనుదెంచువారికి అనలుండు షడ్రసో
పేత భోజనములు విందొసంగె
మలయానిలుండు నిర్మల మృగనాభికా
దిక శుభద్రవ్యముల్ తెచ్చియిచ్చె
యక్షేశ్వరుఁడు మృదులక్షౌమ తపనీయ
హారకేయూర భూషాళి యొసఁగెఁ
బాకశాసనుఁడు కల్పక పారిజాత మం
దార దామమ్ము లుదారతనిడె
సాగరుండు రత్నఖచిత స్వర్ణపాత్ర
లందు గంగాది నదుల జలాళిఁ దెచ్చెఁ
బన్నగాధిప పర్యంక పరిణయంపు
వైభవముఁ జూడవచ్చిరి విశ్వజనులు 43

శ్రీనివాసుని మంగళస్నాన విధిని
సలుప నిది సమయంబని నలువ తెలుప
శారదారుంధతీ శచీ గౌరి ముఖ్య
సురతరుణులతో వకుళ సత్వరతసాఁగె 44

సకల నదీ నదాంబువులు సాగరనీరము రత్న హేమ పా
త్రికలను సంగ్రహించి జలధి ప్రభుఁ డుజ్జ్వల పుష్పగంధ పూ
ర్వక ఘనసార చందన జవాది మహామృగనాభి పంకముల్
ప్రకరము మేళవించి కొనివచ్చి యొసంగె నిమజ్జనార్థమై 45

ఆపయి దేవతా వనిత లక్షతముల్ తలమీఁదఁ జల్లి య
ష్టాపదపీఠమందునిచి స్వామికి దృష్టినితీసి చుట్టునున్
దాఁపులనిల్పి కొల్వ నవతామరసాకర మధ్యభాగ సం
దీపిత భాస్కరుండనఁగఁ దేజరిలెన్ ఫణిరాజ తల్పుఁడున్ 46

కస్తూరి జవ్వాది కలపంబు మెయిఁబూసి
కలికి ముత్తెపుఁ బిండినలుగువెట్టి
కాలపయోద బృందాలఁ దూలుచు జుట్టుఁ
జికిలియా కొనగోళ్ళఁ జిక్కుఁదీర్చి
పూవుటత్తరులు సంప్రోక్షించి తలయంటి
అరచేత మెలమెల్ల నలఁది రుద్ది
పసిఁడిగిండులతోడఁ బన్నీటిధారల
నొలికించి చక్కఁగా జలకమార్చి

పట్టు సరిగంచు నునువలిపంబుతోడ
నొడలి తడియార్చి మెత్తనై వెడఁదలైన
వెంట్రుకలకొన జార్ముడి వేసియొండు
పీఠి రీవిగఁ గూర్చుండఁబెట్టి హరిని 47

మంగళతూర్యరావములు మన్నునుమిన్నుఁ గలంగ మ్రోయఁ బు
ణ్యాంగనలేవి కప్పురపు టారతులెత్తి మనోజ్ఞ మాధురుల్
పొంగి స్రవింప గీతచయమున్ వెరవారఁగపాడి నాట్యపుం
భంగిమలొప్ప శ్రీనిలయు భవ్యవిధాన నలంకరింపఁగన్ 48

నునుపారు రత్నదర్పణ కాంతిఁ గ్రేణించు
చెక్కిలిపైఁ జాదు చుక్కఁబెట్టి
నెఱచందమామలో నెఱికందు కందువ
మోమునఁ గస్తూరిబొట్టు దిద్ది
పుండరీక విలాసమును హాస్యమొనరించు
కనులఁ గాటుకరేకఁ గలయఁదీర్చి
సకల దేవకిరీట శబలిత మృదుపాద
రాజీవములను బారాణిఁ బెట్టి

పట్టుపీతాంబరబులు కట్టఁబెట్టి
పుష్ప మణిహార కేయూర భూషలుంచి
పెండ్లికొడుకును జేసిరి వెలఁదులెల్ల
శ్రీనివాసుని - వైభవశ్రీ నివాసు 49

ఆ సమయంబునందనలుఁ డద్భుత పక్వరసప్రాపక ది
వ్యాసవ భక్ష్య భోజ్య పరమాన్నములన్నియు సంఘటించి వి
శ్వాసతఁ బెండ్లికిం దరలివచ్చినవారికిఁ బెట్టెఁ దృప్తిగా
వాసవిమీరఁగా నమృతభాజన సద్రుచిమత్పదార్థముల్ 50

శరదబ్జ సంకాశ సరస రాజాన్నంబు
నుపమాన రహిత సద్యోఘృతంబు
ఘనసార శకలాలఁ జెనకు మీఁగడ దధి
బహురుచి ప్రదములౌ పాయసములు
బీయూషసమములౌ పిండి వంటలు మృదు
వాసనాన్విత బహు వ్యంజనములుఁ
గమ్మని రుచి మీరు కంది పప్పును నాలు-
చవులూరు నొఱపుఁ బచ్చళ్ళగములు
నూరుగాయలు నోరూరు చారు లూరు
బిండు లప్పముల్ వడియాలు విమల మగుచు
నావఁబెట్టిన వరుగులు నతులితముగఁ
బంక్తి వడ్డించిరపుడు దేవతలు నిలిచి 51

తృప్తి తీరఁగ భుజియించి త్రేంచిలేచి
కప్పురమ్మును కస్తూరి కలసి కమ్మ
తావు లెగజిమ్ము తాంబూల సేవనమున
నెవరి విడిది యిండ్లకు వారలేఁగినంత 52

భోజన భాజనంబుల నపూర్వపుఁ దృప్తినిఁ బొంది దేవతా
రాజి ప్రయాణ సన్నహన రాగ మనస్కతఁ దొందరించుచున్
దేజులయాన సిద్ధముగఁ దీర్చిరి సర్వజగత్త్రయంబు న
వ్యాజ కృపాకటాక్షముల హాయిగనేలు మహాత్మ పెండ్లికిన్ 53

ఆసమయంబునందు వసుధాధిపపుంగవు నాజ్ఞ నొదలన్
బూసర మట్లు బూని గుణపూర్ణవిరత్న మనోజ్ఞ రత్నసం
భాసిత హేమ కంకణసమంచితహార కిరీట ముఃఖ్య భూ
షా సముదాయ మెల్లఁగొని సైన్య హితానుచరాను యుక్తుఁడై 54

శేష పర్వత శిఖరమ్ముఁ జేరవచ్చెఁ
దొండ మానుండు శౌర్య ప్రచండ శక్తి
చరితుఁడల్ల నారాయణ పురికి శ్రీని
వాసుఁ బెండ్లికిఁ గొనిపోవు వాంఛమిగుల 55

వచ్చిన తొండమానునకు వస్త్రములన్ జదివించి స్వర్ణసం
పచ్చయ తారహార బహుమాన పురస్సర గౌరవాదరో
ద్యచ్చతురంబుగాఁ దనివునందఁగఁ జేసియతండు ముందుగా
నిచ్చమెయింజనం దొడఁగిరెల్లరు పెండ్లికి వేడ్క హెచ్చఁగన్ 56

అధిరోహించెను శ్రీనివాసుఁడు విహంగాధ్యక్షుస్కంధంబుఁ బ్రా
క్కుధరాగ్రంబున నెక్కు భాస్కరువిధిన్ గుంఫించి తేజః ప్రభా
సుధ లత్యంతము విశ్వగోళ పరిధిన్ జుంబింపఁ బూవానవ్వః
పథముంగప్పఁగ దివ్యతూర్యరవముల్ బ్రహ్మాండమున్నిండఁగన్ 57

చతురాస్యుండు మరాళ వాహనముపై స్వర్ణాద్రి శృంగాగ్ర భా
సితరాకాహిమధాము నట్లు కొలువై జీమూతముల్ హంస ప
క్షతి వేగంబునఁ దూల వేద విహిత స్వానం బనూనంబుగా
సతి సేవింపఁగ శ్రీనివాసునకుఁ బార్శ్వంబందు నందంబుగన్ 58

రజతాద్రిం బురుడించు శ్రీవృషభ సమ్రాట్ స్యందనారూఢుఁ డై
నిజవేగోద్ధతి నబ్దమాలలు తృణానీకంబు లై తూల న
క్కజమై హైమధరాగ్రశృంగ విహరత్కంఠీరవశ్రీల లై
లజ వందింపఁగ శంకరుండు కదిలెన్ లక్ష్మీశుపార్శ్వంబునన్ 59

అమరేంద్రుండు గభీరసుందరముగా నైరావతంబెక్కి పో
డుము లేపార శతారధారరుచిగండూషింప నాశాంతముల్
ప్రమదారత్నము చెంత విభ్రమకళల్ వర్షింపఁగా వేయి నే
త్రము లానంద సుధాంబు వృష్టిఁ గురియన్ దర్పించి ముందేఁగఁగన్ 60

రంభాముఖ్య నిలింపవార వనితాప్రజ్ఞా విచేష్టాపరీ
రంభాస్తోక విలాస విభ్రమకళాప్రహ్లాద హేలాకళా
రంభానేక నవీన లాస్యరస విస్రంభంబు లానంద సం
రంభారూఢిగ సాఁగెఁ జూపఱకు నేత్రద్వంద్వ పర్వంబుగన్ 61

తుంబుర నారదుల్ తంబురల్ మీటుచు
ఆలోల జయగీతు లాలపింప
వందిమాగధ ముఖ్యబృందంబు ముందుగాఁ
గై వారము లొనర్చి కదలుచుండ
సర్వజనాళికి సౌకర్యములుకూర్ప
ధ్వజినీ విభుండు ముందర చనంగ
నిత్యసూరిగణంబు నెఱి పెండ్లి యాత్రలోఁ
ద్రొక్కిడికెడమీక తోడనడువ

అప్సరోంగనారమ్య నాట్యములు గనుచుఁ
బ్రణుత గంధర్వ సంగీతరవము వినుచు
దేవదుందుభిధ్వానంబు దిక్కులద్రువఁ
ద్రోవపొడవున విరివాన తొరగుచుండ 62

అపుడు దివౌకసుల్ రథములందు జవంబున శ్రీనివాసు నం
దపరిమితాభి మానధనులై యిరుప్రక్కల నభ్రవీథిఁ దో
రపుఁదమిసాఁగ బాలురును స్త్రైణ తపోవనితల్ ప్రవృద్ధులున్
విపుల సుధీగురూత్తములు వేగమ పల్లకులెక్కి పోవఁగన్ 63

భృగు గాధేయ వసిష్ఠ దక్షముఖ మౌనీశావళుల్ సుస్వరం
బుగ నామ్నాయ పవిత్ర మంత్రపఠన ప్రోత్సాహులై నిర్మలా
ధ్వగమందున్ శకునంబులారయుచుఁ దత్సాహ్యంబులౌ నర్థపుం
బ్రగతిన్ భావనసేయుచున్ దురితదూర ప్రక్రియాన్వితులై 64

అనుగతి నీగతి నారా
యణ నగరాభిముఖులై ప్రయాణించుచుఁ ద్రో
వను శ్రీ శుకమున్యాశ్రమ
మును గాంచిరి కనులఁదోఁచు పున్నెంబనఁగన్ 65

అపుడు శుకమౌని భక్తి
ప్రపత్తు లెద సంభ్రమింప రాజీవాక్షున్
విపులాగమలక్ష్యుఁబరం
తపు శ్రీవక్షున్ గురించి తానిట్లనియెన్ 66

"స్వామి! పెండ్లికొమరుఁడవై చనెడు నిన్నుఁ
గఱవుతీరంగఁ గంటినా కన్నులార
నాదు పర్ణశాల నొక క్షణంబు నిలిచి
విందుఁగొనియేఁగ నిదె వేఁడుకొందు నిన్ను" 67

అన విని స్వామి యిట్లనియె "ఆర్య! తపోధను లార్య సన్నుతుల్
జనగణవందిత ప్రముఖ సత్క్రతుపూత చరిత్రులున్నతుల్
వినుతవివేక సద్గుణ నివేశులు తీవ్రతపోభివాసు లేఁ
పున నిట నుండవారలను పొందని యే నొకరుండవత్తునే? 68

కాన మహాత్మ నావెనుకఁ గన్గొనుమీ! త్రిజగన్నివాసు లెం
తేనియు లెక్కకెక్కువగ నెందఱు వచ్చుచు నున్నవారొ? ఈ
శాన సరోజగర్భసురశాసన ముఖ్యనిలింప వర్యు ల
మ్లాన మహత్త్వులీ గగనమార్గమునుండి గమించుఁ గాంచితే 69

ఆతిథ్య మింతమందికిఁ
బ్రీతిగ నిడి వారి హృదయ తృప్తి ఘటింపన్
జేతనగునె యెవ్వనికిని
బ్రాఁతిగ నతఁడెట్టి భాగ్యవంతుండైనన్?" 70

అనిన శుకమౌని "స్వామి! నీ ఆదరంబు
కలుగ నిడియెంత? యెల్లలోకములు నీదు
గర్భగోళాన నెలకొనుఁ గనుక నీవు
తృప్తినందిన జగమెల్లఁ దృప్తిఁగనదె?" 71

అన విని శ్రీనివాసుఁడు నయంబున నాశ్రమసీమఁజొచ్చెఁ ద
న్మని మకరంద తుందిల వినూత్న ఫలంబులుఁ గందమూలముల్
చనవుగ నారికేళ సలిలంబులు నర్పణచేసి భక్తిభా
వన నిలుచున్న స్వామియుఁ గృపాపరతంత్రత నారగించినన్ 72

కని మఘవాది నిర్జరనికాయ మకారణ కోపమూని "యొ
ప్పనిపనిని ట్లగౌరవము పాలొనరించెఁ గ్రుధాప్రమత్తుఁడై
కనులనుగాన కీ మునిశిఖండి" యటంచు మహోగ్రహోగ్రులై
పనుపడ మౌని యాశ్రమముఁ బాడొనరింపఁగఁ బూనిరుద్ధతిన్ 73

సమదరిపూద్ధతిన్ గెడపజాలు మహాశనిపాత తుల్య దు
ర్దమ ఘనశాప వాక్పటిమ దైవతనాథ ముఖాది నిర్జర
ప్రముఖుల నుక్కడింపఁగల ప్రజ్ఞ చెలంగియు సత్త్వశాంతిసత్
క్షమ శుక పారికాంక్షి తన స్వాంతము నందుఁదలంచె నీగతిన్ 74

"అకటా! యీ సురలింత క్రోధఖనులా? అజ్ఞాన గాఢాంధ మో
హకులా? లోక సమస్త రక్షణ కళావ్యాపారులౌ వీరికీ
వికటక్రోధము చెల్లునే? యిటుల యీ పృథ్వీజముల్ ద్రుంపఁగా
సుకమేపారున? యిట్టి పోకిరిపనుల్ శోభించి లాభించునా?" 75

అనుచు శుకుఁడు చిత్తమందు నూహలు సల్పి
సర్వలోక విభుఁడె సాక్షిగానఁ
దన ప్రయోజకత్వమును చూపరాదంచు
మిన్నకుండె యోగి సన్నుతుండు 76

దానినెఱిఁగి వచ్చి శ్రీనివాసుఁడు తృప్తి
బ్రేవుమనుచుఁ ద్రేంచెఁ ద్రేపుతోడఁ
గడుపులుబ్బఁ దొడఁగెఁగడు తిండితిన్నట్లు
వాసవాది నాకవాసులకును 77

తాము చేసినట్టి తప్పును గ్రహియించి
వజ్రి ముఖ్యదేవపాళి శ్రీని
వాసు పాదయుగళిఁ బడి క్షమింపుఁడటన్న
శుకుని వేడుమనియె సకలవిభుఁడు 78

పశ్చాత్తాపమె సర్వపాప చయమున్ బాపన్ సమర్థంబు - చే
తశ్చింతన్ విడు డిట్టి కొంచెపుపనుల్ స్థానంబు దుష్కీర్తికిన్
దుశ్చారిత్ర మనర్థమూల మనుచున్ బోధించి మన్నించెఁదా
నిశ్చింతన్ శుకమౌని కొల్చు నమరానీకంబులన్ యోగ్యుఁడై 79

అచ్చటినుండిసాఁగి విపులార్ణవ వీచిక లుర్విచక్రమున్
గ్రచ్చరమింగవచ్చె నవురా! యనుభ్రాంతి ఘటింప వెల్లువై
వచ్చుచునుండి రెల్లరు వివాహముఁజూడ శిలోచ్చయాటవీ
స్వచ్ఛ నదీనదాళి సులభంబుగ దాఁటుచు నొక్కపంక్తిగన్ 80

వ॥ అట్లు ఊరేగింపుగాఁ బోయి ఆకాశరాజు రాజధానీ నగరంబైన నారాయణపురంబను పురవరంబును సమీపించె 81

నారాయణపురంబు స్వారాట్పురమునాఁగ
విబుధ మందార సంవృతము కాఁగ

వాసనామిళితమౌ పన్నీటి కలయంపిఁ
జల్లి ముత్యపురంగవల్లు లేర్చి

చలువపందిళ్ళ పచ్చల తోరములుగట్టి
అరటిబోఁదలు చుట్టు నలవరించి

మృదుపరీమళ పూర్ణ సదమల పుష్పమం
జరులు జరీలుగా వరుసఁజుట్టి

ఆకసంబంత పందిరి నవఘటించి
అరయ భూదేవియంతటి యరుగువైచి
స్వయముగా రాజదంపతుల్ పర్యవేక్ష
ణమ్ము సలుపంగఁబురి క్రొత్త సొమ్ములూనె 82

అట నంతఃపురకాంత లుత్సుకత భావ్యర్థంబు భావించి యు
త్కట శోభావహరీతులన్ వధువు సింగారింపఁగా నెంచి ము
చ్చట కస్తూరి జవాది సంకుమదముల్ సాధించి, ద్రవ్యంబులో
క్కట యోగ్యస్థితి నేర్పరించుకొని యా కంజాక్షి రావించియున్ 83

చలదభ్యంచిత చంద్రకాంత మణిపుంజ స్వచ్ఛకాంతిచ్ఛటా
లలితంబైన విశాల మజ్జనపుశాలన్ రత్నపుంఖ ప్రభా
వలితంబైన సువర్ణ పీఠముపయిన్ బద్మావతిన్నిల్పి రా
చెలికత్తెల్ తళుకొత్తు చిత్తమున దత్ శృంగారముల్ తీర్పఁగన్ 84

హరిచందన ఘనసారము
గురు మృగనాభియు జవాది కుంకుమ పంకం
బరుదుగనాయము తను వ
ల్లరికిని నలుగులను బెట్టి లలనలు వేడ్కన్ 85

తుమ్మెదగమిదిమ్ముఁ దొలఁగించు తద్దీర్ఘ
కేశముల్ కొనగోళ్ళ గీరిగీరి
దర్పణమ్ముల మహాదర్పంబు హరియించు
తత్కపోలములపైఁ దడవితడవి
విధుబింబగర్వంబు మథియించు ముఖపద్మ
మున హరిద్రరసమ్ముఁ బూసిపూసి
శంపాల తాత్విష్ వెంపఁ గొట్టెడు నామె
నునుమేనఁ జందనం బునిచి యునిచి

ఆకసమునేలు కౌనుఁజేనంటి యంటి
కలికి పాలిండ్ల సుమరజః కలపమలఁది
స్వర్ణకుంభాలఁ బన్నీట జలకమార్చి
రపుడు స్వర్ణకుంభ స్తనుల్ నిపుణరీతి 86

వెన్నెల పొరలొత్తు వెలిదువ్వలువఁ బూని
మెయిఁదడివోనొత్తె మెలఁతయొర్తు
తలవెంట్రుకలను పాయలుతీసి వెలిపట్టు
వలిపానఁ దడియార్చె బడఁతియొర్తు

కలికి మిటారి గుబ్బలసందు జిడ్డువో
వఁగఁబైఁట చేనద్దె మగువ యొర్తు
కై దండయిడి మెల్లఁగదలి పసిఁడిపీటఁ
గూర్చుండఁబెట్టెను కొమ్మయొర్తు
పూలపుప్పొడి మేదించెఁ బోలఁతియొర్తు
కాళ్ళపారాణి పెట్టెను కలికియొర్తు
వెండ్రుకలకొన ముడివైచె వెలఁదియొర్తు
పెండ్లికూఁతున కందంబు పెంపుఁ దనర 87

కాలపయోధరమాల మ్లానంబుగా
జలబిందువులు పిండి తలనుతుడిచి
భృంగసమూహమ్ము భంగంబు నొందంగ
సంపంగినూనె కేశములఁ బూసి
యమతస నిశిగర్వ మఖిలమ్ము ఖిలముగాఁ
జంద్రవంకను నెమ్మి సంఘటించి
బర్హి బర్హము తీవి వడి డీలు వడఁజేయు
సూర్యవంకను శిరస్సున ఘటించి
ఏన్గు దంతపుదువ్వెన నేర్పరించి
కురులు చక్కఁగ దువ్వి ముంగురులుదిద్ది
తరుణ సుమమాలికలను బద్మావతీవ
ధూటి నప్పుడలంకార పేటిఁజేసి 88

జిలుగుంబట్టు పసిండివన్నె జలతార్ చీరన్ గటిందాల్చి ని
గ్గుల బాలారుణ కాంతినేలు రవికన్ గుత్తంబుగాఁదొడ్గి సొం
పొలయన్ బుగ్గను చుక్కపెట్టి వదనాంభోజంబు దీపింపను
జ్జ్వల సిందూరపు నామమర్క నిభతేజంబారఁగా దిద్దియున్ 89

పచ్చలుతాపినట్టి మిహి బంగరుగాజులు తొడ్గి జాళువా
గచ్చుల రత్నపుంఖముల గ్రాలెడు పోగులుపెట్టి కంఠమం
దచ్చఁపుఁదార హారముల నందముగా నిడి యేఁడువారముల్
వచ్చు విభూషణంబుల నలంకృతిఁజేసిరి తద్వధూమణిన్ 90

శ్రీనివాసుఁడు దేవదేవుఁడు చేరవచ్చెనటంచు భూ
జాని వార్త నెఱింగి పట్టపు సామజంబు పయిన్ సరో
జాననన్ దనుజాతనుంచి శుభాప్తి మంగళవాద్యముల్
భూనభంబులు బోరుకల్గఁగఁబోయె వేగ నెదుర్కొనన్ 91

ఆవిధి రాజదంపతులు హర్షముతో నెదురేఁగి భక్తినా
నావిషయోపచార కరణంబుల నెల్లరకున్ మనోముదం
బావహిలంగఁజేసి తగు నర్ఘ్యము పాద్య మొసంగి తృప్తిఁ బ
ద్మావతి శ్రీనివాసులను తత్పుర సంఘముతోడఁ దెచ్చియున్ 92

వేరువేరగు వారణంబుల వీఁపులం జవుడోలులన్
సౌరు మీర నలంకరించి ప్రశస్త మంగళవాద్యముల్
బోరుబోరన మ్రోయఁ జౌరులు ముందు గుంపులుగూడ సొం
పారఁ బెండ్లికుమారుఁ బెండ్లికుమార్తెలన్ విరివానలోన్ 93

ఊరేగింపుగఁ గొంచుఁబోయిరి ప్రమోదోత్సాహ సన్నాహ మిం
పారం దీర్చి యలంకరించిన నవోఢారూఢ ముస్తాబుతో
శ్రీ రమ్యంబగు నూర విప్రజనితాశీర్వాద పూర్వైక మం
త్రారావంబుల యాత్రసాఁగె జనులత్యంతంబు దర్శింపఁగన్ 94

కైవారంబులు వందిమాగధజనుల్ కావింప - వారాంగనల్
ప్రావీణ్యాద్భుత నృత్య గానకలనా పాండిత్యముం జూపఁగా
దేవేశుల్ జయశబ్ద వాఙ్ముఖరి తాద్రిప్రాంత దిగ్భాగులై
పోవంజొచ్చిరి సందడించి దివమిూభూమిన్ వడిన్ వ్రాలెనాన్ 95

అంబరచుంబి సౌధ వితతాగ్రతలంబుల నిల్చి నేత్ర ప
ద్మంబులు విచ్చి కాంచుచు సుమంబులు లాజలునక్షతల్ ప్రమో
దంబునఁ బైనిఁ జల్లుచును తత్పురకాంతలు కంకణాచ్ఛ నా
దంబులు విందుసేయఁగ నుదారత హారతులిచ్చిరింపుగన్ 96

తారామండల తారకావితతులై తద్భద్ర నీరాజనో
దార జ్యోతుల కుట్మలంబు లలరన్ దత్కామినీవక్త్ర శో
భారాకాహిమధామబింబరుచి దిద్భాగంబులం గప్పఁగ
న్నారం గాంచెడువారి కన్గలువ లత్యంతంబు ఫుల్లంబుగన్ 97

ఘన కోలాహల దివ్యరావయుతమై కల్యాణసద్యాత్ర త
జ్జన పాలాగ్రణి సౌధశాల సవిధస్థానంబుఁ జేరఁగఁ బా
యని మర్యాదలు సల్పుచున్ విడిదిగేహాలందు విశ్రాంతి గై
కొనఁ బంపించిరి దేవతావితతులన్ గూర్మిన్ ప్రబోధించుచున్ 98

విడిదిగృహంబులందుఁగల వేల్పులకెల్లను బానకంబు కా
వడులను బంపిరచ్చట నృపాలక దంపతులెంచి హేమపుం
గడవలతోడ రత్నమయ కాంచనపాత్రలఁ గోర్కితీరఁగా
గడుపులనిండఁ ద్రావిరధికంబుగఁ ద్రేన్చుచు వారు మాటికిన్ 99

అంతట రత్నసంఘటిత హాటకసుందర పీఠముంచి య
త్యంతముఁ దద్వధూవరుల నం దుపవిష్టులఁజేసి కూర్మిఁద
త్ప్రాంతము తూర్యరావముల దద్దరిలంగ సహస్రదీప స
త్కాంతి దిగంతరాళములఁ గ్రమ్మి వెలుంగఁగఁ బాలవెల్లువై 100

దిగదిగ నవదంపతులకు
దిగదుడిచిరి నిష్కములను దిగవిడిచిరియా
దిగువఁగల నీటిపాత్రను
తగరాణియురాజు దేవతావరులెల్లన్ 101

గోరుగుల్లఁ గాలిగోళ్లు వారికిఁదీసి
తలకు నూనెనంటి నలుగువెట్టి
జలకమాడఁ జేసెనల యింటిమంగలి
వధువు కట్లఁ జేసె పడఁతి పిండు 102

వ॥ తదనంతరంబ వధూవరులనిద్దర వేర వేర పన్నీటి స్నానంబు లాడించి 103

నునుపారు రత్నదర్పణ కాంతిరవణించు
చెక్కిలిపైఁ జాదుచుక్కఁ బెట్టి
నెఱి చందమామలో నెఱకందువలెఁ దోఁప
మొగమునఁ గస్తూరిబొట్టుఁ బెట్టి

పుండరీక విలాసమును గ్రిందుపఱచు క
　　న్గవను గాటుకరేకఁ గలయదిద్ది
సకలదేవ కిరీట శబలిత పదయుగ్మ
　　కమునఁ బారాణిఁ జక్కఁగనమర్చి
　పట్టు పీతాంబరంబులు కట్టఁబెట్టి
　సరస మణిమయహారభూషలు ఘటించి
　మరల సింగారములను బద్మావతీ వ
　ధూటికినిఁ జేసిరప్పుడు చేటులెల్ల　　104

ప్రీతిగఁ బాకశాస్త్రపుఁ బ్రవీణులఁ బిల్వఁగఁబంచి షడ్రసో
పేతములౌ పదార్థములు పెల్లుగఁజేయఁగ నేర్పరించె భూ
మీతలనాథపుంగవుఁడు మిక్కిలి నేర్పును జూపి దేవసం
జాతము మెచ్చ సల్పిరి పసందెసఁగన్ నలభీమపాకముల్　　105

నులివెచ్చ పూఁదేనియల రుచిన్నిరసించు
　　పలుచని గోడంబి పాయసములుఁ
దీయఁదనమునకేఁ దినఁగ నోరూరించు
　　లలిఁబాలనురుఁగుఁ బోల్లడ్డుకములు
నాసాపుటంబుల నలిపొగల్ సెగలేర్చు
　　నావఁ బెట్టిన మంచి వ్యంజనములు
నూనెలోవేఁగి యనూన లాలాజలం
　　బూరించు వేపుడుకూరగములు

నాల్కఁ ద్రుప్పుడు డుల్లఁగా నవరసముల
వరలు వివిధమ్ములౌ పిండివంటకములు
ఆలపెరుగును వడియమ్ము లప్పడములు
వరుగులును నావకాయలుఁ బచ్చడులును 106

అప్పుడె కాఁచి చుఱ్ఱుమను నావుల నేయియుఁ గ్రొత్త వెన్నలున్
బప్పును దీయబారులును పాలును మీఁగడదేరు పెర్గులున్
గప్పురభోగి యన్నమును గమ్మనిగారెలుఁ బాలబూరెలున్
దెప్పలుగాఁగ వంటయిడి దింపిరి గీములు నిండరాసులన్ 107

ముదరక లేతగాక కడు ముచ్చటగా మృదువై విశాలమౌ
కదళి సువర్ణముల్ పఱచి కావలెనం చెవరేది కోరినన్
మది నది తత్క్షణంబ నతిమాత్రము వారల విస్తరాకులన్
గదియఁగఁ బెట్టిరెల్లరును గాటపుఁ దృప్తి భుజించి త్రేంచఁగన్ 108

ప్రతిదినమున్ సుధాద్రవముఁ ద్రావుట నాలుక రోఁతపుట్టి య
క్షత రుచిదాయకంబులగు షడ్రస యుక్త పదార్థజాత మం
చితగతిఁ గోర్కిమై కొసరి చేకొని లొట్టలువైచుచున్ సుర
ప్రతతి భుజించెఁ దృప్తిఁ బరిపాటిగఁ గుత్తుకబంటి గాఁదగన్ 109

శ్రీప్రదమౌ ముహూర్తమిదె చేరఁగవచ్చెను తొందరింపుఁడో
భూప్రభులార! యంచు మునిముఖ్య వసిష్ఠ విరించి గీష్పతుల్
విప్రపురోహిత ప్రముఖవేత్తలఁగూడి నృపాలుదెల్ప నా
క్ష్మాప్రభుఁడార్య పౌరహిత సజ్జన బంధుపురస్కృతంబుగన్ 110

అఖిల నదీసముద్ర నిచయాంబువులున్ వ్యజనాత పత్రముల్
సుఖదపుటగ్ని కర్మమునఁ జొప్పడు నాహుతు లాలమందలున్
నిఖిల సువర్ణ పాత్రముల నిశ్చల దీక్ష వహింప వస్త్రముల్
నఖశిఖదాఁకఁ గావలయు నాడెపువస్తులఁగూర్చె సర్వమున్ 111

కన్నులపండువై కవుల కల్పనకున్ సరిహద్దు సీమయై
వెన్నెల మేలిముత్తెముల వెల్లనికాంతుల వెల్లువై సుధా
చ్ఛన్న సువర్ణహార పరిసర్పిత దివ్యకళాభిరామమై
చెన్నగు పెండ్లిమంటపముచెంతకుఁ దెచ్చిరి శ్రీనివాసునిన్ 112

అంత వసిష్ఠమౌని సమయంబు నెఱింగి సువర్ణ సూత్ర స
త్కాంతి తనర్చు రత్నఖచితంబగు బాసికముల్ వధూవరా
త్యంత మనోజ్ఞఫాలములయందునఁ గట్టెఁ బురోహితుల్ సదా
శాంతి విశిష్ట మంత్రములఁ జల్లిరి సేసలు సుప్రసన్నులై 113

బాసికముల్ మొగంబులను భాసిలెఁ జందురు లోనికందులై
వాసిగ నా వధూవరుల ఫాలతలంబుల - స్వర్ణహార సం
భాసుర వక్షముల్ వరలెభవ్య మనోహర తారకా సము
ల్లాస విలాస సత్పథము లాగునఁ గన్నులఁ జూడఁబండువై 114

జాళువా విరులుబ్బు మేలిమి బంగారు
వెలుఁగుఁ జిమ్మెడు పెండ్లిపీటవైచి
పసపుఁ గుంకుములతోఁ బరమ మంత్రాక్షతల్
చెలువుగా నంతటఁ గలయఁజల్లి

తూర్పుముఖమ్ముగాఁ దోడ్తోడఁ గొనివచ్చి
క్రొత్తదంపతులఁ గూర్చుండఁబెట్టి
అల వసిష్ఠ శుక బృహస్పతి ముఖ్య పు
రోహితుల్ మంత్ర సమ్మోహనమ్ము

సలుపుచుండంగ దేవతానిలయమందు
నలరు దుందుభి ధ్వని భూనభోంతరములఁ
గలయఁ గ్రమ్మంగఁ బట్టుదువ్వలువనొండు
దంపతులమధ్యఁ బట్టిరత్యంత గరిమ 115

మహిత పరమాత్మ జీవాత్మ మధ్యఁగలుగు
మాయరీతి స్వామికినిఁ బద్మావతికిని
మధ్యఁ జొప్పడెఁదెర; యెంత మాన్యులైన
అందరికివోలె నాచారమలరుఁ గాదె 116

అల శాస్త్రంబులలో విధించిన విధంబాచారమై యొప్ప ని
ర్మల బృందారక ధేనుకాదధి సురక్ష్మాజాత పుష్పోల్బణో
జ్జ్వల మాధ్వీకముతోడ మిశ్రమముగా సద్భక్తి నర్పించె ని
శ్చలవృత్తిన్ మధుపర్కమున్ వరునకున్ క్ష్మాపాలకుండాలితోన్ 117

ఇది సమయమ్ము సుమ్మని మునీంద్రుఁడు పల్కఁగ రాజదంపతుల్
కదియగవచ్చి స్వచ్ఛ మృదుగాంగజలంబున శ్రీనివాసు స
త్పద జలజాతముల్ కడిగి తజ్జలమున్ దలలందుఁ దాల్చి స
మ్మదమున ధారవోసిరి సమంచిత భూషిత కన్యకామణిన్ 118

సరవిఁ ద్రివిక్రమాంఘ్రి జలజాతముఁగడ్డె విరించి - రాఘవే
శ్వర పదకంజముల్ జనక పాలకసంయమితానుకడ్గె - శ్రీ
హరి చరణ ప్రవాళముల నంబుధి నాథుఁడు కడ్గె శేష భూ
ధరవిభు శ్రీనివాసుని పదంబులు కడ్గె నితండు పుణ్యుఁడై 119

ఏజన్మంబునఁ జేసియున్న ఫలమో? యీజన్మమందిట్టు లీ
రాజీవాక్షుని నల్లుగాఁ బడసి రీరాద్దంపతుల్ మేలు నా
రాజశ్రేణి యనేకవాక్య సుమనోరాజిన్ బ్రశంసింపఁగా
రాజిల్లెన్ నృపపుంగవుండు నిజ భార్యావీక్షణ శ్రీలతోన్ 120

పరమముహూర్తమంచు మునివర్యులు కార్యము నెచ్చరింపఁగా
మురువుగ జీలకఱ్ఱ గుడమున్ గలకల్పిన బంధమున్ వధూ
వరులు పరస్పరంబుఁ దమ వంచిన మస్తకభాగమందు నుం
చిరి శ్రుతిమంత్రనాదములు శ్రీప్రదతూర్యములున్ జెలంగఁగన్ 121

దళమై బంగరుకాంతులన్ దశదిశాంత వ్యాప్తిగావించు మం
గళ సందాయక సన్మణిస్థగిత మాంగల్యంబు ముత్తైదువుల్
కళలన్ వాసిలు హస్తపద్మములఁ దాఁకంజేసి మంత్రాక్షతల్
కలయంబంచెఁ బురోహితుండు జనతా కల్యాణహస్తంబులన్ 122

అంతట నెల్లవారుఁ బ్రమదాంబుధి మున్గఁగ శ్రీనివాసుఁడ
త్యంత కుతూహలంబెసఁగ హస్త సరోజములన్ సదా నిర
భ్యంతర సద్గృహస్థ విధి కాదరువై తగు తాళిఁదాల్చి వీ
క్షాంత దయాతరంగ చయుఁడై నిలువంబడెఁ గన్యముంగటన్ 123

వావిరిసిగ్గుతోడఁ దలవంచి సుదర్శనరూపయైన ప
ద్మావతి శ్రీనివాసుని పదద్వయిఁ గాంచుచుఁ "దావసింపఁగాఁ
దావులు పద్మముల్ హరిపదంబులుగా విలసిల్లి యీ విధిం
దావులఁ జిమ్మనేర్చె సుమనస్సులు స్థానముఁబట్టి వర్ధిలున్ 124

అని చింతింప "నరుంధతీ గిరిసుతాహార్య ద్విషద్వల్లభల్
ఘన పద్మావతి వేణికాభరముఁ జక్కంబెట్టి పైకెత్త నా
య్యన నక్షత్ర సునేత్రముల్ తెఱచి దేవౌఘంబు వీక్షింప లో
చన పర్వంబుగ సర్వభూతములు నుత్సాహంబుతోఁ జూడఁగన్ 125

అతిమోదంబున విప్రులాగమ పవిత్రార్థైక మంత్రంబు లు
ద్వృతులై పల్కఁగ శ్రీనివాస పరమబ్రహ్మంబు పద్మావతీ
సతి కంఠంబునఁగట్టె లోకహిత రక్షాదక్షదీక్షా మహా
క్రతు సంకల్పము - సర్వమంగళ కళారంగంబు మాంగల్యమున్ 126

నారదుఁడాడెఁ దుంబురుఁ డనంతముదంబునఁబాడె దేవతా
వారము పుష్పవర్షము నపారముగాఁ గురిపించె నప్సరో
నారుల లాస్యభంగిమల నాకము క్రొత్తకళల్ వహించె వి
స్తారము దేవదుందుభుల స్వానముక్రమ్మె నభోంతరాళమున్ 127

చారులుదీరి యక్ష సుర పన్నగ కిన్నెరులాదిగానభ
శ్చారలు నేత్రపద్మములు చల్లగఁజూచిరి పెండ్లివేడుకల్
పారములేని హర్షమున వర్తిలె భూతములెల్ల లోకసం
సారి జగన్నియంత శుభసద్మను పద్మను పెండ్లియాడఁగన్ 128

బోరన తూర్యరావములు మ్రోగుచునుండఁగ మేల్మికాంతి బం
గారపుఁబళ్ళెరంబులను గ్రాలెడు ముత్యపు టక్షతంబులన్
వారక హస్త పద్మములఁబట్టి పరస్పర మస్తకంబులన్
జారుమహోత్సవంబున హుషారుగఁబోసిరి తద్వధూవరుల్ 129

శ్రీనివాసుని దోయిలిఁ జెలఁగు మంచి
ముత్తియంబులు నీలాల పోలుపుఁగాంచి
తరుణి పద్మావతీదేవి తనవునందు
మల్లెమొగ్గల చెలువున నుల్లసిల్లె 130

అలపద్మావతి హస్త పల్లవములందామౌక్తికంబుల్ మహో
జ్వల తేజోమయ పుష్యరాగమణులై భాసించి శ్రీ శ్రీనివా
స లసచ్ఛీర్షమునుండి జారి తనుదేశంబందు నొప్పారె ని
శ్చల నీలాంబుద మాలికావిరళ నక్షత్ర ప్రతానంబుగన్ 131

అప్పుడైదువరాండ్రు కల్యాణవేది
కడకు నైరేనిఁ గొనివచ్చి గంధ కుసుమ
దామముల నర్చ సలిపి రుద్దామభక్తిఁ
బాటలనుపాడి హారతుల్ పట్టి వేడ్క 132

భార్యాభర్తలు నిత్యసన్నిహితులై వర్తింతురెల్లప్పుడే
కార్యంబందుననేఁ బరస్పరము సోఁకన్ వచ్చు పాదంబులా
చర్యన్ దోసములేకయుండుటకు శశ్వన్మంత్ర సంభావనా
ధుర్యత్వంబునఁ గాళ్ల సన్నెకలుపైఁ ద్రొక్కించి రొక్కొక్కరిన్ 133

మునిసింహుండు వసిష్ఠమౌని యరణిప్రోద్భూతవహ్నిం బ్రతి
ష్ఠను గావించి మహాగ్నికుండమున నశ్వత్థద్రుకాష్ఠంబు లం
తన మండించి వధూవర ప్రవరులన్ దత్సన్నిధానంబునన్
వినయోపాత్తత నిల్పియాహుతులటన్ వ్రేల్వన్నియోగింపఁగన్ 134

నేవళమై ప్రవాళముల స్నిగ్ధత దగ్ధమొనర్పఁజాలు ప
ద్మావతి హస్త పల్లవ సమంచితలాజలు హేమపుష్పముల్
పావకుఁడుజ్జ్వలార్చుల నభంబును దాఁకుచు స్వీకరించి హ
ర్షావధియై ప్రదక్షిణ సహంబుగ వారలకిచ్చె దీవనల్ 135

అతులామోదత శేషశైల విభుఁడాజ్యంబున్ బురోడాశ మ
క్షతలున్ యజ్ఞముఖంబునన్ మిగుల నిష్ఠాభక్తి వ్రేల్వంగ న
క్షత హర్షంబున హవ్యవాహనుఁడు స్వచ్ఛజ్వాల సంచార దీ
క్షితుఁడై వానిని స్వీకరించెఁ గరుణాస్నిగ్ధ ప్రసన్నాత్ముఁడై 136

ఆహుతులన్ గ్రహించి ప్రచురాద్భుత కీలల సవ్యమార్గమం
దాహిత సౌఖ్యసంగతుఁడునై చరియించెడు పావకోపసం
గూహన దివ్యకుండమునకున్ వలగొంచుఁ బ్రదక్షిణించి ర
త్యూహల నేఁడుమార్లు సతియుంబతి మెల్లగ 'బ్రహ్మముళ్లతోన్' 137

నీరము నిండుకుండఁ దపనీయమయాంగుళిముద్ర వైచి యే
వారలు ముందు తీయుదురొ వారలు గెల్చినయట్లనంగ - శ్రీ
నారియు శ్రీనివాసుఁడు మనంబులఁ గోరికలూర వాలుచూ
పోరగ నొండొకళ్ళఁ బ్రియమొప్పఁ గనుంగొనుచుం బ్రియంబునన్ 138

సిగ్గుల నిగ్గుదొంతరలు చెక్కిళులం దొలుకాడఁ జేతులన్
దిగ్గన నందుముంచి కడుతీవ్రత వ్రేళుల రక్కుకొంచుఁ దా
మగ్గలమైన కోరిక జయంబును బొందఁ జరించిరిర్వురున్
మ్రొగ్గుచు నెల్లరుంగనిరి మూఁగితదంచిత రమ్యదృశ్యమున్ 139

ఒక్కరిచేతినుండి మరియొక్కరు లాగుకొనంగ యత్నముల్
మక్కువఁజేయుచుండ నతిమాత్రము సందడిహెచ్చ నందరున్
జక్కఁగ వారి దివ్యసరసంబులు జన్మతరింపఁగాంచి ర
మ్మక్క! తలంపనే జననమందుఁ దపంబులు చేసినారలో? 140

అంబర మం దరుంధతికినై పరికింపఁగనేల? మేల్మి నె
య్యంబలరారఁ జెంతఁగల యాయమ పావనపాదపద్మయు
గ్మంబుపయిన్ శిరంబులిడి గ్రక్కునమ్రొక్కఁగ నామె "దివ్య సౌ
ఖ్యంబుల వృద్ధిగాంచు" డని యాశిషముల్ పొనరించె సత్కృపన్ 141

అనురూపంబుగ వారు పందిరికిమధ్యన్ ఖట్వమున్ వైచి చి
త్ర నవీనాంచిత వర్ణచిత్రిత లసద్వస్త్రంబుచేఁ బూలచే
అనువౌరీతి నలంకరించి యొకవైపా శ్రీనివాసున్ నవో
ఢను పద్మావతి నింకొకండుకొన క్రీడారక్తిచేఁ జేర్చియున్ 142

నవరత్నాంచిత తారహార రుచిరానద్ధ ప్రభాకందుకం
బు విలాసంబుగఁ దద్వధూ వరకరాంభోజాతమందుంప - సం
స్తవనీయంబుగ వారలొండొకరిపై సంధించి వేయంగ నుం
కువ నద్దానిని బట్టు సంభ్రమము నెకొల్పెన్ సముత్సాహమున్ 143

చెలువారన్ దమివారు తన్మయతతోఁ జెండాడు చందంబు ని
శ్చల మోదంబును నుత్సుకత్వమును సంస్పందింపము త్తైదువుల్
లలిబృందారక సంఘ మబ్బురముగా లక్షించి వీక్షించి రు
జ్జ్వల మోహంబులు కూర్పవే సరసభావప్రౌఢ కేళీగతుల్? 144

శ్రీ మహిమంబుగా నిటులఁ జెల్లుచునుండఁగఁ బెండ్లివేడుకల్
ప్రేమ వహించి స్త్రీ పురుషభేదములన్ విడి యెల్లవారు బు
క్కామపొడిన్ బరస్పరముఁ గ్రమ్మఁగఁ జల్లుచు హాస్యవాక్య సం
స్తోమమునన్ విలాసగతితో విహరించిరి నవ్వులాటలన్ 145

శతయజ్ఞాదిక దేవతల్ కుసుమరంజద్రాగసంపద్రజం
బతి సద్భావన శ్రీనివాసు పయి నెయ్యంబారఁ జల్లంగ ను
ద్ధత కాలాంబుదమాలపైఁ జరమ సంధ్యారాగ రక్తప్రభా
తతిబింబించిన మాడ్కినొప్పె నవసౌందర్యంబు నిండారఁగన్ 146

తనర శచీముఖాది వనితల్ కరకంజ సువర్ణ కంకణ
క్వణనము కర్ణపేశలముగా వినిపింప వసంతమాడి రేఁ
పున నవరత్న సంఘటిత పుష్కల కాంచనపాత్రలన్ సువా
సనలను జిందు స్వచ్ఛఘనసార మృగీమద నీరధారలన్ 147

ఆవిధి నా వధూ జనము లల్లన హేలగ నోలలాడి ప
ద్మావతిపై వసంతజలధారలు బోసిన నామె చిత్రశో
భా వివిధైక వర్ణ పరివర్తిత సుందర వజ్రిచాప సు
శ్రీ విభవైక లీలఁదనరెన్ జడి మున్గిన పద్మరేఖగన్ 148

అతిలోకోత్తర వైభవప్రభలఁ గల్యాణోత్సవం బిట్లు సం
భృత కోలాహలమై అనన్య విభవంబేపార సాఁగన్ మహా
యతి చంద్రుండు వసిష్ఠమౌని శుకు లాహ్లాదంబుతో నాధరా
పతికింజెప్పిన నాతఁడుత్సుకతతో భార్యాద్వితీయంబుగన్ 149

ఘనశైల సంఘంబు కదలాడెనోయన
నెసరేఁగు గంథ గజేంద్ర సమితి
పవమానసుత జవపాటవంబును మించ
జన్మించె నన నొప్పు సైంధవములు
కాలాంబుదములు క్రొక్కారుమెర్గులఁ గూడె
నన నొప్పు మణిమయ స్యందనములు
ప్రసవంబులకుఁ బ్రాణవైభవంబబ్బెనో
యనఁ జాలు దివ్య కన్యాగణంబు
నవమణి సువర్ణమయ భూషణములగములు
హార కేయూర మకుట దివ్యాభరణము
లన్నియనిమేర యిడనేర నన్నియిడియె
నల్లునకుఁ గూఁతునకుఁ గట్నమవని విభుఁడు 150

నందనపారిజాతములు నవ్యపరీమళ శోభితంబు ల
స్పందిత కేసరాగ్రములు స్వర్ణమయంబులు వేనవేల్మహా
నందమునన్ వధూమణి కనంతమొసంగె శచీపురంధ్రి సం
క్రందనుఁడిచ్చెఁ గాన్కల నఖండముగా వరమౌళికున్నతిన్ 151

అంతట సర్వదేవగణ మాయురగేంద్ర మహీధ్రవాసు భా
స్వంత నితాంతకాంత సువిశాల పదాంబుజపీఠిచెంత శీ
ర్షాంత కిరీటరత్న రుచిరాంకుర శోభలు వెల్లిఁగొల్ప న
త్యంత సమగ్ర భక్తియుతమై ప్రణమిల్ల మహాకృపాళుఁడై 152

వారలవీడుకొల్ప నతివైభవమొప్పఁగఁ దత్ప్రభావ సం
భారము నాత్మలందుఁ బలుమారులు మెచ్చుచు సాఁగి రభ్రపుం
దారుల వారివారి భువనంబులు చేరఁగ వాహనాలపై
ధారుణి నిట్టి వైభవ విధానముఁగాన మటంచు నెన్నుచున్ 153

ధరణీదేవియు నూత్నదంపతులచేతన్ భారతీదేవి - య
య్యరవిందాసన దివ్యదంపతుల కత్యంతంబు మ్రొక్కింప ని
ర్భర మోదంబునఁ బంచభూతములుఁదారా సూర్య చంద్రాదు లు
ర్వర నెన్నాళ్లుచరింతు రంతదనుకన్ వర్థిల్ల దీవించినన్ 154

గిరిజాశంకర దివ్యసచ్చరణ పంకేజాతపీఠిన్ వధూ
వరు లాత్మీయత మ్రొక్కి నిల్చిన దయావ్యాపార మేపారఁగా
పరమానంద విశిష్టులై త్రిజగతీవాల్లభ్య సద్వైభవ
స్ఫురణన్ వర్ధిలుఁడంచు దీవనల సంస్తోత్రించిరత్యున్నతిన్ 155

అల నందీశ్వరుస్కంధ మెక్కి గిరిజావ్యాఘ్రాజినుల్ వెండి గు
బ్బలిఁ జేరంగ మరాళవాహనముపై వాణీసరోజాసనుల్
నిలయంబై తగు సత్యలోకమునకున్ వేంచేసి రామ్నాయ సం
కుల నాదంబులు శ్రోత్రపేయముగ దిక్కుల్‌నిండి మార్మ్రోయఁగన్ 156

యతివరులకును వారి యర్ధాంగులకును
ధరణిదేవి నూతన వధూవరులచేత
నెమ్మి మ్రొక్కించ విమలాశిషమ్ము లొసఁగి
తరలిపోయిరి వారలు పరమతృప్తి 157

## ఫలశ్రుతి

అతిలోకవైభవంబైన పద్మావతీ
శ్రీనివాసీయమన్ జిత్రగాధ

వినిన వ్రాసినఁగాని యెనలేని సంపదల్
కల్యాణములతోడఁ గలుగఁజేయుఁ

బుత్రులం బౌత్రులం బుత్త్రికామణులను
కోరినట్లొనగూర్చుఁ గోర్కితీర

నారోగ్యభాగ్యంబు లలవడు దీర్ఘాయు
వంది శోభించెద రవనియందు

అఖిలశుభముల నూరేండు లవనినుండి
యుత్తమంబగు విష్ణుసాయుజ్యపదము
శాశ్వతముగఁ బడసెదరు సత్యమిద్ది
ప్రబలు పద్మావతీ శ్రీనివాస కరుణ 158

మొవ్వ సుధాన్వయాంబునిధి పూర్ణశశాంకుఁడు సర్వశోభలు
న్నివ్వటిలన్ రసాత్మక వినిర్మల ఘట్టములేర్చి మెత్తనౌ
క్రొవ్విరి లేఁత వాసనలుకూర్చి వృషాద్రిపతి ప్రసిద్ధుఁడీ
మవ్వపు శేముషీ విభవమాధురి వ్రాసెఁ బరిగ్రహింపుడీ! 159

## సోపానాంతము

నిజతత్త్వాంచితరూప! సత్త్వగుణ సందీప్తప్రదీపా! సుధీ
సుజనవ్యాప్తకలాకలాప! బుధ సంస్తుత్య ప్రతాపా! సమి
ద్విజ యాఖ్యప్రతిభాసతీప! దురితావేశ ప్రతీపా! భవ
ద్భజనానంద మునీంద్ర హృద్వినుతభూపా! వర్గశత్రుంతపా! 160

కాకోదరాద్రీశ! కారుణ్యవేశా!
పాకారి సంస్తుత్య! ప్రజ్ఞావిచింత్యా!
సాకారసంవర్తి! సాంద్రప్రకీర్తి!
శ్రీ కప్రమహృద్భాస! శ్రీ శ్రీనివాసా! 161

శ్రీ కమలజాహృదయ చిన్మయ విశిష్ట బుధ సేవనగుణాకరసురూపా!
లోకజన రక్షణవిలోకన రవీందుకృతలోచన దయామృతకలాపా!
భీకర దురంతపటువీర నిచయాఖిల విభేదన పరాక్రమ సుచాపా!
స్వీకృత మునీంద్ర గణచిత్తనిలయా! వినుత శేషగిరి శృంగగృహదీపా! 162

: పద్మావతీ శ్రీనివాసీయము సర్వము సంపూర్ణము :

శ్రీరామార్పణమస్తు - శ్రీకృష్ణార్పణమస్తు
శ్రీ వేంకటపరబ్రహ్మార్పణమస్తు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



మొవ్వ వృషాద్రిపతి